## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్చైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్చైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000001365

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంగీతలక్షణము

(గవర్నమెంటు టెక్నికల్, విశ్వవిద్యాలయ పరీక్షలకు)

గ్రంథకర్త:

శ్రీ వి. సత్యనారాయణగారు

గవర్నమెంటు ట్రైనింగుస్కూళ్ళ సంగీత ఉపాధ్యాయుడు



పబ్లిషర్సు:

రాతు బుక్కు డిపో,

ఎడ్యుకేషనల్ పబ్లిష..., సంగీత రత్నాకర,

ప్రొ॥ ఆర్. చంద్రయ్య అండ్... విద్యాభూషణ, గానకళావిశారద,

రాజమహే... ద్వారం వేంకటస్వామి నాయుడు,

విజయనగరము

ప్రిన్సిపాల్, విజయనగరం మహారాజావారి

సంగీతశాల—విజయనగరం

శ్రీ గురుభ్యో నమః

శ్రీ మహాగణాధిపతయేనమః

# సంగీత లక్షణ గ్రంథము.



ప్రస్తుతము సంగీతము ప్రపంచములో రెండువిధములుగనున్నది.

1. Melodical ఏకస్వర సమ్మేళన రంజకమైన సంగీతము.
2. Harmonical బహుస్వర సమ్మేళన రంజకమైనసంగీతము.

మొదటిరకము ప్రాచ్యదేశములందును రెండవరకము యూరోపా ఖండము, యూరోపియను లెక్కడనున్న ఆదేశములందును అభ్యాసములోనున్నవి.

హార్మోనికల్ సంగీతము అనగా దగ్గర సంబంధముగల ధ్వనుల సన్నివేశము చేసి యొకేసారి వినుటయే. ఈ మాదిరిగా పాశ్చాత్యులు యభిమానించి వృద్ధినొందింపబడినది. ఈ సంగీతము మూడునాలుగు శతాబ్దముల నుండి మాత్రమే యమలులోనున్నది.

ఇకను మొదటిరకమైన ఏకస్వర సమ్మేళన సంగీతము మన హిందూదేశములో అనాదినుండియు నున్నది. మఱియు హార్మోనికల్ సంగీతపు పద్ధతి వీరికి తెలిసియేయున్నను దానియందు వీరికి అభిరుచి కలుగలేదు. ఏక స్వర సమ్మేళన సంగీతమందే ఎక్కువ అభిరుచి వారికికలిగి దానినే యభివృద్ధికి దెచ్చిరి. ఇందుకు తార్కాణము మన రాగపద్ధతియే. ఈ రాగపద్ధతిగల హిందూసంగీతము నేడుఅమూల్యమై సాటిలేనిదై వెలయుచున్నది. మఱియు ఈ సంగీతము ఒక్కవ్యక్తి చేతనే పాడబడి సకలమైనవారిని రంజింపజేయుచున్నది. ఒక్కవ్యక్తి యొక్క బుద్ధి చాతుర్యమును అసమాన పాండిత్యమును వ్యక్తీకరించుటకు నదే యున్నది. ఈ స్వర మాధుర్య సంగీతము దశవిధ గమకములతో గూడి ప్రాచ్యదేశ సంగీతమై బహుస్వర సమ్మేళనముతో గూడి

రంజకమై వెలయుచున్న పాశ్చాత్య సంగీతమును మించుచున్నది. ప్రాచ్య సంగీతము ఏకస్వర ప్రయోగముచే నెంతవరకు రంజింపజేయు నగునో అంతవరకు వ్యక్తీకరింపబడి సుప్రసిద్ధతను గాంచియున్నది. శుద్ధమైన స్వర మాధుర్యము ప్రాచ్యసంగీతమందే కలదు. పాశ్చాత్య సంగీతమందు బహుస్వర మాధుర్యమే మాధుర్యమని భావన. ఏకస్వర సమ్మేళన మాధుర్యమే రంజకమైనదని ప్రాచ్యసంగీతమందలి భావన.

ఇప్పటి గాన పద్ధతులలో రెండే గొప్పవి. అవి ఒకటిహిందూ దేశపు సంగీతము, రెండు యూరోపియను సంగీతము. మొదటిది ఏక స్వర సమ్మేళన మాధుర్య పరిపూర్ణత్వమును రెండవది బహుస్వర సమ్మేళన మాధుర్య పరిపూర్ణతను గలిగి రెండురకములుగా స్పష్టీకృతమైన గాన భావములమీద నేర్పడియున్నవి. రెండునుగొప్ప పద్ధతులే. మనుజుని బుద్ధి చాతుర్యము రెంటియందును పరిపూర్ణతను గాంచి యున్నది. ఈ రెంటియందును రచయితల ఉద్దేశ్యములు సమానమే కాని ఆయుద్దేశ్యముల నెరవేర్చుటకు వేరుమార్గముల ననుసరించిరి. హిందూ సంగీతమునకు జీవనాధారమైన రాగపద్ధతి హిందూ సంగీత రచయితలకున్ను యూరోపియను సంగీతములోని బహుస్వర సమ్మేళన పద్ధతి యూరోపియను సంగీత రచయితలకున్ను ఒకే విధమైన పనిని నెరవేర్చినవి. యూరోపియను సంగీతశాస్త్రము బహుళముగాక సులభమై ఏకశైలిగలదై యున్నది. హిందూ సంగీతశాస్త్రము బహుళమై సంకులమై యున్నది. ప్రాచ్య సంగీతములలో నెల్ల హిందూ సంగీతమే ప్రాధాన్యమును వహించి మిక్కిలి రంజకమును, గొప్పయభివృద్ధిని గాంచియున్నది.

హిందూ సంగీతము బహుపురాతనమైనది. దీనికి సంబంధించిన శాస్త్రగ్రంథములు క్రీస్తుశక ప్రారంభమునుండియున్నట్లు కానిపించు చున్నవి. ఒకప్పుడు ఆసేతు హిమాచల పర్యంతము, హిందూదేశ మంతటను ఒకేవిధముగ వ్యవహారములో నుండెడిది. కాని మహమ్మదీయుల కాలమ్ము

నుండియు హిందూదేశ సంగీతము రెంటిక్రింద విభజింపబడి ఉత్తర హిందూస్థానమందలి సంగీతము హిందూస్థానీ సంగీతమనియు దక్షిణ హిందూస్థానమందలి సంగీతము కర్నాటక సంగీతమనియు వ్యవహరింపబడుచున్నవి. ఈ రెంటికిని శాస్త్రము ఒకటే. స్వరములు ఒకటే. అయినను రాగములు పాడుటలో శృతులు ఒక విధమైన పూర్వకలిగి రెండును ఒకదానినుండి యొకటి భేదించుచున్నవి. ఈ కారణముచేతనే 1. హిందూస్థానీ సంగీతము, 2. కర్నాటక సంగీతము అని వేరుగా వ్యవహరింప బడుచున్నవి.

## సంగీతము అననేమి ?

చాలమంది పూర్వాచార్యులు గాత్రపాట - జంత్రపాట - నాట్యము - ఈ మూడింటి కలయికయే సంగీతమని యభిప్రాయపడిరి. (గీత, వాద్య, నృత్యముల చేరిక సంగీతము)

కాని యిటీవల కొందరు జంత్ర, గాత్ర పాటలే సంగీతమని యభిప్రాయపడుచున్నారు. మఱియు స్వర, రాగ తాళముల చేరికయు సంగీతమనుచున్నారు.

## సంగీతము రెండురకములు.

1. మార్గసంగీతము. 2. దేశ్యసంగీతము.

1. మార్గసంగీతము దేవతలచే దేవలోకమున పాడబడునది. ఇది భూలోకమున లేదు.
2. భూలోకములో ఆయాదేశములలో వాడుకలోనున్న గీత, వాద్య, నృత్యములే దేశ్యసంగీతము.

## సంగీత మాహాత్మ్యము.

సకల విద్యలకధిపులైన పార్వతీపరమేశ్వరులు సులభముగా గానముచే స్తుతించుటవలన సులభముగా సంప్రీతి నొందుచున్నారని చెప్పబడినది. ఏమానవుడు అచంచలమైన భక్తితో గానముచే పార్వతీ

ధ్వనులలోని వేగాని భిన్నములైనవి కావు. ధ్వనియొక్కటే పేరుమాత్రము వేరు. అవి యెట్లనగా:—

1. చతుశ్శృతిరిషభమునకు – శుద్ధగాంధారమనియు
2. సాధారణగాంధారమునకు – షట్ఛ్రుతిరిషభమనియు
3. చతుశ్శృతిధైవతమునకు – శుద్ధనిషాదమనియు
4. కైశికినిషాదమునకు — షట్ఛ్రుతిధైవతమనియు

వేరు నామములుగలవు.

* ఇందుకు కారణము కొన్ని రాగములలో ఆయాస్వరములు వాడుకలోనుండుటయే. 72 మేళకర్త రాగముల పట్టికయందు జూడ దగును ఇట్టి స్వరభేదములు యూరోపియను సంగీతమందును గానగును.

## స్వరవిభాగము

స్వరములు రెండురకములుగా విభజింపబడినవి.

1. ప్రకృతి స్వరములు.
2. వికృతి స్వరములు

1. షడ్జము 2. శుద్ధరిషభము 3. శుద్ధగాంధారము 4, శుద్ధమధ్యమము 5. పంచమము 6. శుద్ధధైవతము 7. శుద్ధనిషాదము ఈ సప్తస్వరములు ప్రకృతిస్వరములనియు, 1. చతుశ్శృతిరిషభము 2. షట్ఛ్రుతిరిషభము 3. సాధారణగాంధారము 4. అంతరగాంధారము 5. ప్రతిమధ్యమము 6. చతుశ్శృతిధైవతము 7. షట్ఛ్రుతిధైవతము 8. కైశికినిషాదము 9. కాకలినిషాదము యీ తొమ్మిది స్వరములు వికృతిస్వరములనియు పూర్వీకులయభిప్రాయము. కాని యిటీవలవిద్వాంసులు ఏస్వరములైతే మరియొకధ్వనికి తావియ్యవో అట్టి శుద్ధస్వరములైన 1. షడ్జమము 2. పంచమముమాత్రమే ప్రకృతి స్వరములనియు, తీవ్ర, కోమలములకు తావిచ్చిన 'రి, గ, మ, ధని' స్వరములు వికృతి స్వరములనియు అభిప్రాయపడుచున్నారు.

1. దాని కాలపరిమితి 2. దాని స్థాయి 3. దానియొక్క రకము.

1. కాలపరిమితి:—(Unit-time) సరిగమపధని యని సప్త స్వరములు హ్రస్వాక్షరములుగా వ్రాయబడిన యెడల ఒక్కొక్క స్వరము ఒక అక్షరకాలము యొక్క పరిమాణమును గలిగియున్నది.

అక్షరకాలమనగా ఒకఅక్షరమును పలుకుట కెంతకాలము పట్టునో దానికే అక్షరకాలమని పేరు.

సారీగామాపాధానీ. ఇవి దీర్ఘాక్షరములు. ఒక్కొక దీర్ఘాక్షరము రెండక్షరకాలమని యెరుంగునది

సరిగమలతరువాత — (స, రి, గ,) ఈతీరుగా ఒక కామా పెట్టిన ఆకామాగుర్తు ఒకఅక్షరకాలము అనియు, సెమికోలను (స;—గా;) పెట్టిన ఆ సెమికోలను రెండక్షరకాలములనియు నెఱుంగునది. ఇంకా కాలపరిమాణము హెచ్చి పవలసినయెడల కామాలును సెమికోలను లును విరివిగా వాడబడును.

స—————— = 1 అక్షరకాలము,

సా———— = 2 ,,

స ,, = 3 ,,

సా ; లేక సా ,, = 4 ,,

సా; , లేక సా ,,, = 5 ,,

సా ; ; లేక సా ,,,, = 6 ,,

ఈవిధముగా నూహించునది.

కొన్నిస్వరముల సమూహమునకుగాని ఒక్కస్వరమునకుగాని అడుగున ఒకతిన్ననిగీత గీయబడినయెడల ఒక్కస్వరముగాని, స్వర సమూహముగాని కాలపరిమాణమును సగముకు తగ్గించుననియు, రెండుగీతలున్న పావుకుతగ్గించుననియు, మూడుగీతలున్న అర్థపావుకు తగ్గించుననియు నెరుంగునది,

ఉ॥ స———— 1 అక్షరకాలము.

సస————
$\frac{1}{2}+\frac{1}{2}$———— } 1 ,,

సససస
$\frac{1}{4}+\frac{1}{4}+\frac{1}{4}+\frac{1}{4}$ }———— 1 ,,

స స స స స స స స
$\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}$ } 1 ,,

N. B కొందరు ఈగీతలను స్వరములపైనకూడ వాడుదురు.

ఉ॥ సస – సససస – ససససససస

## కాల పై కాలములు.

1. ప్రథమకాలము 2. ద్వితీయకాలము 3 తృతీయకాలము 4. చతుర్థకాలము 5. పంచమకాలము 6 షట్కాలము అనుసంజ్ఞలు పాటయొక్క వేగపరిమాణమును దెలుపును.

1. ప్రథమకాలములో ఒక్క స్వరము ఒక అక్షరకాలములో పాడబడును.

2. ద్వితీయకాలములో రెండు స్వరములు (2) ఒక అక్షరకాలములో పాడబడును.

3 తృతీయకాలములో నాలుగు స్వరములు (4) ఒక అక్షరకాలములో పాడబడును.

4. చతుర్థకాలములో నెనిమిది స్వరములు (8) ఒక అక్షరకాలములో పాడబడును.

5. పంచమ కాలములో పదియారు స్వరములు (16) ఒకఅక్షరకాలములో పాడబడును.

6. షట్కాలములో ముప్పదిరెండు స్వరములు (32) ఒకఅక్షరకాలములో పాడబడును.

స్వరావళులు సాధకముచేయునపుడును, విద్వాంసులు పల్లవి పాడునపుడును పైనచెప్పిన యారుకాలములలో పాడుదురు. ఇట్లు పల్లవిలో ఆరు కాలములు పాడుటకే షట్కాలవిమర్శన మనబడును.

మఱియు ప్రథమకాలము 4 అక్షరకాలములతో ప్రారంభించిన దాని ద్వితీయకాలము 8 అక్షరకాలములును, తృతీయకాలము 16 అక్షరకాలములును చతుర్థకాలము 32 అక్షరకాలములును అగునని తెలియవలెను.

## 2. స్థాయి.

స్థాయిలు గాత్రపాటలో 3 రకములు.

1. మంద్రము 2. మధ్యము 3. తారము.

వీణమొదలగు వాద్యములలో పైన చెప్పిన మూడునుగాక మరి రెండు స్థాయిలున్నవి. అవి 1. అనుమంద్రము. 2. అతితారము.

## స్థాయి సంజ్ఞలు

1. ఒక స్వరమునకు అడుగున ఒకచుక్కపెట్టిన ఆస్వరము మంద్ర స్థాయికి జెందును. (తగ్గుస్థాయి)

2. ఒక స్వరమునకు పైనగాని క్రిందగాని చుక్కలేలేనిచో నది మధ్యమ స్థాయికి జెందును. (మంద్రముకంటె హెచ్చుస్థాయి)

3. ఒక స్వరమునకు పైన ఒక చుక్కపెట్టిన నది తారస్థాయికి జెందును. (మధ్యమస్థాయికంటెహెచ్చు)

4. ఒకస్వరమునకు క్రింద రెండుచుక్కలుండిన నది అనుమంద్ర స్థాయికి జెందును. (మంద్రస్థాయికంటెను తగ్గుగనుండుస్థాయి)

5. ఒక స్వరమునకు పైనరెండుచుక్కలుండిన నది అతితారస్థాయికి జెందును. (తారస్థాయికంటెను హెచ్చుస్థాయి)

స రి గ మ ప ధ ని యను సప్తస్వరములు ఒక స్థాయియగును. (వికృతి స్వరములతోగలసి 12 అగును.)

## స్థాయిల వివరము.




(అనుమంద్రముకంటె తగ్గుస్థాయిగాని అతితారముకంటె హెచ్చుస్థాయిగాని లేదు)

### అంకెలవలన స్వరముల సంజ్ఞలు.

| | |
|---|---|
| 1. శుద్ధ రిషభము = $రి_1$ | 8. ప్రతి మధ్యమము = $మ_2$ |
| 2. చతుశ్రుతి రిషభము = $రి_2$ | 9. శుద్ధ ధైవతము = $ధ_1$ |
| 3. షట్శ్రుతి రిషభము = $రి_3$ | 10. చతుశ్రుతిధైవతము = $ధ_2$ |
| 4. శుద్ధ గాంధారము = $గ_1$ | 11. షట్శ్రుతి ధైవతము = $ధ_3$ |
| 5. సాధారణగాంధారము = $గ_2$ | 12. శుద్ధ నిషాధము = $ని_1$ |
| 6. అంతర గాంధారము = $గ_3$ | 13. కైశికి నిషాధము = $ని_2$ |
| 7. శుద్ధ మధ్యమము = $మ_1$ | 14. కాకలి నిషాధము = $ని_3$ |

14 + స + ప = 16 స్వరములు.

## 3. స్వరముయొక్క రకము.

ఒక రచనయొక్క ఉపరి భాగమున రాగముపేరు కనబడినంత మాత్రమున ఆరచనలో వాడబడు స్వరముల రకములు తెలియనగును. కాబట్టి రచనలో స్వరములేజాతికిజెందునో తెలియజేయుటకు సంజ్ఞల వసరమేలేదు. అయినను శీఘ్రముగాగ్రహించుటకు శుద్ధ,కోమల, తీవ్ర స్వరములకు వరుసగా 1, 2, 3 లు వాడబడుచున్నవి. అందువలన ఒకస్థాయిలో స్వరములను తెలిసికొనుటకు ఈదిగువరీతిని వ్రాయుదురు.

ఉదాహరణకొరకు కొన్ని మేళకర్త రాగములలోని స్వరము లీదిగువ పట్టికలో జూపబడినవి.

| మేళకర్తరాగసంఖ్య | మేళకర్తరాగము పేరు | అందలి స్వరములు |
|---|---|---|
| 8 | హనుమత్తోడి | సరి$_1$గ$_2$మ$_1$పధ$_1$ని$_3$సా |
| 15 | మాయామాళవగౌళ | సరి$_1$గ$_3$మ$_1$పధ$_1$ని$_3$సా |
| 22 | ఖరహరప్రియ | సరి$_2$గ$_2$మ$_1$పధ$_2$ని$_2$సా |
| 28 | హరికాంభోజి | సరి$_2$గ$_3$మ$_1$పధ$_3$ని$_2$సా |
| 29 | ధీరశంకరాభరణం | సరి$_2$గ$_3$మ$_1$పధ$_2$ని$_3$సా |
| 65 | మేచకల్యాణి | సరి$_2$గ$_3$మ$_2$పధ$_2$ని$_3$సా |

N B: భాషాంగరాగములలో మేళకర్త రాగస్వరములు గాక మేళకర్తననుసరించి ఆరాగములో రాకూడని వేరురాగ స్వరము వచ్చినట్లైన ఆస్వరమునకు పుష్పగుర్తు * (Asterisk) ఈరీతిని దానిపైన పెట్టబడును. అట్లువచ్చిన స్వరమునకు అన్యస్వరమని పేరు.

ఒకస్వరము యొకరకమును దెలియ జేయుటకుమరియొక పద్ధతిగాగూడ వ్రాయుదురు.అదేదన స్వరాక్షరముయొక్కఅచ్చునుమార్చివ్రాయుటయే.

రి గ ధ ని అను స్వరములకు మూడేసి రకములున్నవి గాన ఈపద్ధతి వీనికిమాత్రమే చెందును.

రి ——— ర. రి. రు. } శుద్ధ—చతుశ్రృతి—షట్ఛ్రుతి
గ ——— గ. గి. గు. } శుద్ధ—సాధారణ—అంతర
ధ ——— ధ. ధి. ధు. } శుద్ధ—చతుశ్రృతి—షట్ఛ్రుతి
ని ——— న. ని. ను. } శుద్ధ— కైశికి — కాకలి

## కాల పైకాలముల జూపు పధకము.

| కాలము | ఆదితాళము | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | | | | ౦ | | ౦ | |
| 1. ప్రథమ కాలము. | స– (1) | రి (1) | గ (1) | మ (1) | ప – (1) | ధ (1) | ని – (1) | స (1) |
| 2. ద్వితీయ కాలము. | సరి – (2) | గమ – (2) | పధ – (2) | నిస (2) | సని – (2) | ధప (2) | మగ – (2) | రిస (2) |
| 3. తృతీయ కాలము. | సరిగమ – (4) | పధనిస – (4) | సనిధప – (4) | మగరిస (4) | సరిగమ – (4) | పధనిస (4) | సనిధప – (4) | మగరిస (4) |
| | 1 | | | | ౦ | | | |
| 4. చతుర్ధ కాలము. | సరిగమపధనిస– (8) | సనిధపమగరిస– (8) | సరిగమపధనిస– (8) | సనిధపమగరిస (8) | సరిగమపధనిస – (8) ౦ సనిధపమగరిస (8) | | సరిగమపదనిస – (8) ౦ సనిధపమగరిస (8) | |
| | 1 | | | | ౦ | | ౦ | |
| 5. పంచమ కాలము. | 16 – | 16 – | 16 – | 16 | 16 – | 16 | 16 – | 16 |
| 6. షట్కాలము. | 32 – | 32 – | 32 – | 32 | 32 – | 32 | 32 – | 32 |

ఈమార్గముల విమర్శనము సంగీతములో మొట్టమొదట సాధకముచేసే స్వరావళులయందును, సంగీతమందు పరిపూర్ణజ్ఞానము కలిగినపిదప మనోధర్మసంగీతమైన పల్లవియందును వాడుకలో నున్నది.

అలంకారములు గీతములు మొదటి మూడుకాలములందును, స్వరజతులు, వర్ణములుపాడునపుడు ప్రథమకాలములో అక్షరకాలములో 4 అక్షరముల చొప్పున ప్రారంభించి స్వరజతులు ప్రథమ, ద్వితీయకాలములలోను, వర్ణములు ప్రథమ, ద్వితియ్య, తృతియ్య కాలములలోను సాధకముచేయుచున్నారు.

కృతులు, పదములు, జావళులు మొదలైన పాటలన్నియు క్రియకు అనగా ఒక అక్షరకాలములో 4 అక్షరములచొప్పున ప్రథమ కాలమందు మాత్రమే పాడుచున్నారు. కాని అక్కడక్కడ సంగతులను చోట క్రియకు 8 అక్షరములు 16 అక్షరములు కూడ పలికించుచున్నారు.

## తాళప్రకరణము.

యూరపియను సంగీతములోని తాళవిధానముకంటె హిందూ సంగీతమందు తాళములు బహుళములై యున్నవి. సులభముగా గ్రహింపగలుగుటకు తాళమునకు ఆరు అంగములను ఏర్పాటుచేసియున్నారు. వీనికే తాళషడంగములని పేరు.

తాళషడంగములు :—1. లఘువు. 2. దృతము. 3. అనుదృతము. 4. గురువు. 5 ప్లుతము. 6. కాకపాదము—అని పేరులు.

వీనిలో మొదటి మూడు అంగములు ప్రధానమైన సప్తతాళములందును, ఈయారంగములును చచ్చత్పుటాది 108 తాళములందును వచ్చును.

దృతముయొక్కయు, అనుదృతముయొక్కయు కాలపరిమితి స్థిరముగానుండి అనుదృతము ఒక అక్షరకాలపరిమాణమును దృతము

రెండు అక్షర కాలముల పరిమాణమును గలిగియున్నవి. అనుద్రుతము లెక్కించునపుడు చేతితో నొకదెబ్బ లేక ఘాతవేయవలెను. ద్రుతము లెక్కించునపుడు చేతితో నొకదెబ్బకొట్టి చేతిని విసరవలెను. ఇట్లు చేతిని విసరుటకే విసర్జితమనిపేరు.

అనుద్రుతమునకు గుర్తు అర్ధచంద్రాకారము — ◡

ద్రుతమునకు గుర్తు పూర్ణచంద్రాకారము— ○

లఘువునకు గుర్తు అర్ధబాణము అనగా ఒకనిలువుగీత— |

లఘువు :—ఇది రెండు భాగములు. ఒకటి ఒకదెబ్బ రెండు వ్రేళ్లు లెక్కించుట. ఈదెబ్బలేక ఘాతను ఎడమచేతిమీదకుడిచేతితో గాని తొడమీదకుడిచేతితోగాని వేయవలెను. తొడమీద వేయుట కూర్చుండి పాడినపుడే.

ఇట్లు దెబ్బవేసినపిమ్మట వ్రేళ్లులెక్కింప వలెను. వ్రేళ్లులెక్కించునపుడు చిటెనవ్రేలుతో ప్రారంభించికుడి చేతివ్రేళ్లను వరుసగాబొటనవ్రేలి వరకును లెక్కించవలెను. ఇంకను లఘువు పూర్తికానియెడల తిరిగి చిటెనవ్రేలి నుండియే ప్రరంభించి లెక్కించవలెను. ఇట్లు లెక్కించుట లఘువులో ఆరులేక యెనిమిది వ్రేళ్లులెక్కింపవలసినపుడు చేయవలెను.

ద్రుతము, అనుద్రుతము వలెగాక లఘువు జాతినిబట్టి మారుచుండును. లఘువునకు ఐదు జాతులున్నవి.

ఈలఘువు యొక్క 5 జాతులను బట్టియే సప్తతాళములు ($7 \times 5 = 35$) ముప్పదియైదు తాళములైనవి.

లఘువుజాతులు :—1. త్రిశ్రజాతి
2. చతురశ్ర ,,
3. ఖండ ,,
4. మిశ్ర ,,
5. సంకీర్ణ ,,

| లఘువుజాతి | గుర్తు | అక్షరకాల మొత్తము | లెక్కించేపద్ధతి |
|---|---|---|---|
| 1. త్రిశ్రలఘువు ,, | $\vert_3$ | 3 అక్షరకాలములు | $\vert$ దెబ్బ + 2 వ్రేళ్ళు లెక్కించుట |
| 2. చతురశ్ర ,, | $\vert_4$ | 4 ,, | $\vert$ దెబ్బ + 3 ,, |
| 3. ఖండ ,, | $\vert_5$ | 5 ,, | $\vert$ దెబ్బ + 4 ,, |
| 4. మిశ్ర ,, | $\vert_7$ | 7 ,, | $\vert$ దెబ్బ + 6 ,, |
| 5. సంకీర్ణ ,, | $\vert_9$ | 9 ,, | $\vert$ దెబ్బ + 8 ,, |

ప్రధానమైన సప్తతాళములందును లఘువు ప్రధానభాగము. ఏకతాళమందు దృతము లేనేలేదు.

అనుద్రుతము ఒక్క ఝంపెతాళమందు మాత్రమే వచ్చును. మిగిలిన మూడంగములు — గురువు, ప్లుతము, కాకపాదము అనునవి చాల పురాతనమునుండియున్న 108 తాళములలో వచ్చును. ఈతాళములు 108 నృత్యగానమందును అరుణగిరినాధుడు వ్రాసిన తిరుప్పుగజు పాటలలోను వచ్చును.

## తాళషడంగములపట్టిక.

| నెంబరు | అంగముపేరు | గుర్తు | అక్షరకాలపరిమితి | క్రియ (అనగా లెక్కించువిధము) |
|---|---|---|---|---|
| 1 | అనుద్రుతము | ◡ | 1 | ఒక్కదెబ్బ (ఘాత) |
| 2 | ద్రుతము | ○ | 2 | ఒకదెబ్బ + ఒక విసర్జితము |
| 3 | లఘువు | \| | 3, 4, 5, 7 & 9 | ఒకదెబ్బ, 2, 3, 4, 6 & 8 వ్రేళ్ళు లెక్కించుట. |
| 4 | గురువు | 8 | 8 | ఒకదెబ్బ, ఏడువ్రేళ్ళు లెక్కించుట. |
| 5 | ప్లుతము | 8 \| 8 | 12 | ఒకదెబ్బ, ఒక కృష్యము, ఒక సర్పిణి. |
| 6 | కాకపాదము | + | 16 | ఒకదెబ్బ, ఒకపతాకము, ఒక కృష్యము, ఒక సర్పిణి. |

కృష్య, సర్పిణి, పతాకములకు ఒక్కొకదానికి (4) నాలుగు అక్షరకాలముల పరిమితి యేర్పడుచున్నది.

1. కృష్యమనగా (కుడి) చేతిని ఎడమవైపునకు విసరుట.

2. సర్పిణియనగా ( ,, ) చేతిని కుడివైపునకు విసరుట.

3. పతాకమనగా ( ,, ) చేతిని పైకి విసరుట.

సరిగమల వ్రాతపద్ధతిలో మరికొన్ని విషయములు.

నిలువుగీతలు = | , | | ,

రచనలు వ్రాయుటలో తాళములోని విభాగముల జూపుటకు ఒక్క నిలువు గీతయు ( | ) తాళము ఒకవర్తము అయిన పిమ్మటను, ప్రతి ఆవర్తమునకు చివరను, రచన అంతమందును రెండు నిలువు గీతలు పెట్టబడును. | |

పువ్వు(Asterisk):— * ఇట్టి పువ్వుగుర్తు ఒక రాగములో వచ్చు అన్యస్వరమును దెలియజేయుటకు ఆస్వరముపైన పెట్టబడును.

గమకగీతలు = ~~~~ ఇట్టిగుర్తు స్వరములపై నుండిన ఆ స్వరమునుగాని స్వరములగాని వణికించి పాడవలెననుటకు చిహ్నమని తెలియవలెను.

చుక్కలులేక చిన్న చిన్న అడ్డగీతలు:—ఇవి స్వరములకు క్రింద సాహిత్యములో అ, ఇ, ఉ, ఎ, ఒ, ఔ, అం అను అచ్చులను ఒక అక్షరము తరువాత పొడుగించి పాడుటకు వాడబడును.

ఒక సంగీతరచనలోని ఒకభాగము తిరిగి పాడవలసి వచ్చినచో ఆభాగమును బ్రాకెట్సు (      )లో జూపునది. లేక ఆభాగమునకు ఆద్యంతములయందు + ఇట్టిగుర్తు కూడబెట్టుట వాడుక. ఒకసంగీత రచనను అచ్చులోగాని వ్రాతలోగాని వాడునపుడీ క్రిందివిషయములు గమనించుట వాడుక.

ఒక రచనయొక్క పైభాగమున దాని రాగము - తాళము వ్రాయవలెను. పైభాగముననే ఎడమవైపు మూలను మేళకర్తరాగము యొక్క వరుస సంఖ్య వేయవలెను. పైభాగముననే కుడివైపుమూలను ఆరాగముయొక్క ఆరోహణ, అవరోహణ క్రమములను వ్రాయవలెను. ఒకవేళ ఆరాగము భాషాంగ రాగమైనచో దానిలో వచ్చు అన్యస్వరము లేక స్వరములగూర్చి వేరే ఆ అన్యస్వరము లేక స్వరములు ఎట్టిసందర్భములలో వాడబడునో సూచించి వ్రాయవలెను.

సామాన్యముగా రచనలలో సులభముగా గ్రహించుటకుగాను స్వరాక్షరములు పెద్దవిగాను సాహిత్యాక్షరములు అంతకంటె కొంచము చిన్నవిగాను వ్రాయవలెను. మామూలుగా చాలారచనలు చతుశ్రగతిలోనే వ్రాయబడి యున్నవి. ఒకవేళ రచనలు త్రిశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణగతులలోనుండిన బాగుగా స్పష్టీకరింపబడి యుండవలెను.

సంగీతశాస్త్రములో వాడబడు శబ్దములు వాని యర్థములు.

ఆదితాళము:—ఇది త్రిపుట తాళములో నొకరకము. దీనికి చతురశ్రజాతి త్రిపుటతాళమనియు పేరు. ఈతాళములో లఘువు చతురశ్రజాతి లఘువు, రెండుద్రుతము లుండును. ।.౦.౦ = 4 + 2 + 2 = 8 8 అక్షరకాలముల తాళము. (ఝంపటాతాళాలంకారము).

అక్షరకాలము:—ఒక అక్షరమును పలుకుటకు ఎంతకాలము పట్టునో అంతకాలమునకు అక్షరకాలమని పేరు దీనినిబట్టియే సంగీతములో కాలపరిమాణ మంతయు ఆధారపడి యున్నది.

ఆలాపన—మనోధర్మ సంగీతములో రాగమును పెంపుచేసి పాడుటకు ఆలాపనయనియు రాగాలాపనయనియు అందురు.

అంగము:—అనగా ఒకభాగము. తాళమునకుగాని గీతమునకుగాని అంగములు కలవు.

అంతరగాంధారము:— గాంధారము లన్నిటిలో మిక్కిలి హెచ్చుగా పలుకునది. తీవ్రగాంధారము.

అనుద్రుతము:— తాళషడంగములలో నొకటి. లెక్కించు విధము:—ఒక్క దెబ్బ. కాలపరిమితి ఒక అక్షరకాలము మాత్రము.

అటతాళము:—ప్రధానమైన సప్తతాళములలో ఆరవది. ఈ తాళమునకు రెండు లఘువులు రెండుద్రుతములు లఘువు ఖండజాతి. గుర్తు = | | | ౦ ౦

అతితారస్థాయి:—తారస్థాయికంటెపైది. ఈ స్థాయిలో వీణ, ఫిడేలు మొదలగు వాద్యములలో గానము చేయబడును. గాత్రపాట లేదు. స్వరములపైన రెండుచుక్కలుగుర్తు = స̈ రి̈

అవరోహణము:—పైనుండి క్రిందికి నిచ్చెనమెట్లు దిగులాగున వరుసక్రమముగా హెచ్చునుండి తగ్గుకు పాడబడు స్వరముల సమూహమునకు అవరోహణమని పేరు. ఉ॥ సఀ ని ధ ప మ గ రి స॥

ఆరోహణము;—క్రిందినుండి పైకి వరుస క్రమములో నిచ్చెన మెట్లు ఎక్కులాగున ఒకదానికంటె తగ్గునుండి హెచ్చునకు పాడబడు స్వరముల సమూహము. ఉ॥ స రి గ మ ప ధ ని సఀ.

ఆవర్తము;—ఒక తాళముయొక్క అన్ని అంగములు పూర్తిగా లెక్కింపబడిన దానికి ఆవర్తమని పేరు.

కళ :—ఒక అక్షరకాలమును సమాన భాగములుగా విభజించిన ఒక్కభాగమునకు కళ యని పేరు. సామాన్యముగా అక్షరకాలము గోవు పాదములవలె 4 కళలను గలిగియుండును.

కాకలి నిషాదము;—నిషాదములన్నిటిలో మిక్కిలి. హెచ్చుగా పలుకునది, తీవ్రనిషాదము.

కాలము:—గీతముపాడునపుడు అదినడచు గతి లేక వేగము. కాలభేదములు ఆరు. 1. ప్రథమ 2. ద్వితీయ 3. తృతీయ 4. చతుర్థ

5. పంచమ 6. షట్కాలము. అని ఆరు కాలములు.

కాకపాదము;—తాళషడంగములలో నొకటి. ఈ తాళమును లెక్కించునపుడు చేతి (కుడి) తోనొక దెబ్బకొట్టి చేతిని నిట్టముగాపైకి విసరి అనగా పతాకమువేసి పిమ్మట చేతిని ఎడమకు విసరి అనగా కృష్యమువేసి పిమ్మటచేతిని కుడికి విసరవలెను అనగా సర్పిణివేయవలెను.

పతాకము:—అనగా చేతిని నిట్టముగాపైకి విసరుట. దీనికాల పరిమితి 4 అక్షరకాలములు.

కృష్యము:—అనగా చేతిని ఎడమకు విసరుట దీని కాలపరిమితి యు 4 అక్షరకాలములే.

సర్పిణి:—అనగా చేతిని కుడికి విసరుట. దీని కాలపరిమితియు 4 అక్షరకాలములే.

దెబ్బయొక్క కాలపరిమితియు 4 అక్షరకాలములే. కాక పాద మునకు (4 భాగములు ఒక్కొకటి 4 అక్షరములచొప్పున) కాల పరిమితి 16 అక్షరకాలములు. దీని సంజ్ఞ లేక గుర్తు = +

కైశికనిషాదము;—కోమల నిషాదము. కాకలినిషాదముకంటె తగ్గుస్వరము.

ఖండలఘువు:—లఘువుజాతిలో నొక రకము. కాలపరిమితి 5 అక్షరకాలములు. లెక్కించు విధము—ఒక దెబ్బకొట్టి 4 వ్రేళ్లులెక్కించుట. గుర్తు = 1.

గమకము:—పాటపాడునపుడు స్వరములను చెవికింపుగానుండు లాగున మనోహరముగా వణకించి అనేక అందచందములతో పాడుట కే గమకమని పేరు పెట్టబడినది. ఎంతచిన్నపాటయైనను కొద్దియో గొప్పయో గమకముండిననగాని వినువారి కింపుగానుండదు. పాటనుండి గమకము లేకుండ చేయుట వీలుగాదు. గమకములేని శుద్ధ స్వరముల బాడిన చెవికింపుగా నుండదుగాన పాటకు గమక మత్యావశ్యకము. సోమనాధుడను పండిత శ్రేష్ఠుడిటుల చెప్పినాడు:— "గమకము లేని

సంగీతము వెన్నెలలేని రాత్రి వలెను, నీరములులేని నదివలెను, పుష్పములు లేని లతవలెను నుండును" అని చెప్పినాడు.

గమకములు పది రకములు:—(ప్రస్తుతకాలము న)

1. ఆరోహణము = స రి గ మ ప ధ ని సా.

2. అవరోహణము = సా ని ధ ప మ గ రి స.

3. ఢాలు = సప - సమ - సగ - సరి.

4. స్ఫురితము = సస - రిరి - గగ - మమ.

5. కంపితము = పా - కపపప.

6. ఆహతము = సరి - రిగ - గమ - మప.

7. ప్రత్యాహతము = సాని - నిద - దప,

8. త్రిపుచ్ఛము = ససస - రిరిరి - గగగ.

9. ఆందోళితము = సరిసపాప - రిగరిమామ.

10. మూర్ఛన = స రి గ మ ప ధ ని— రి గ మ ప ధ ని సా.

గాంధారము:—సప్తస్వరములలో మూడవ స్వరము.

గురువు:—తాళషడంగములలోనొకటి.

కాలపరిమితి :–8 అక్షర కాలములు.

తాళము వేయువిధము ;– ఒక దెబ్బకొట్టి ఏడుప్రేళ్ళు లెక్కించవలెను. గుర్తులేక సంజ్ఞ = 8.

ఘాత:—కుడిచేతితో ఏడమచేతిమీదగాని, తొడమీదగాని తాళము వేయునపుడు కొట్టు ఒక దెబ్బ.

చతురశ్ర లఘువు:—లఘువుజాతిలో 4 అక్షర కాలములపరిమితి గలది. ఒక దెబ్బకొట్టి మూడు ప్రేళ్లు లెక్కించుట. గుర్తు = |

చతుర్థకాలము:—నాల్గవకాలములో గీతముయొక్క వేగము. అనగా ఒక అక్షరకాలములో 4 స్వరములను వేగముగా పలికించుట.

చతుశ్రుతిధైవతము:—వికృతి స్వరమైన 'ధ' యొక్క తీవ్ర స్వరూపము.

చతుశ్రుతి రిషభము:—వికృతి స్వరమైన 'రి' యొక్క తీవ్ర స్వరూపము.

జంటవరుసలు:—సరళీ స్వరములు మొదలగు స్వరసాధకములలో రెండేసి స్వరముల వరుసలు.

ఉ॥ సస - రిరి - గగ - మమ - పప - ధధ - నిని - **సాసా**

**సాసా** - నిని - ధధ - పప - మమ - గగ - రిరి - సస

ఝంపెతాళము:—ప్రధానమైన సప్తతాళములలో నాల్గవది. లఘువు, అనుదృతము, దృతము అనుభాగములు కలది

గుర్తు = | ◡ ○ — లఘువు = 7 అక్షరకాలము; అనుదృతము = 1 అక్షరకాలము; దృతము = 2 అక్షరకాలము.

తారసప్తకం:—తారస్థాయి (హెచ్చుస్థాయి)

తట్టు:—(దెబ్బ) ఘాత. తాళము వేయునప్పుడు కొట్టుదెబ్బ.

త్రిశ్రలఘు:—ఒక జాతి లఘువు. ఒక దెబ్బ కొట్టి రెండు వ్రేళ్లు లెక్కించుట. | 3.

త్రిపుటతాళము:—ప్రధానమైన సప్తతాళములలో నైదవది. ఒక లఘువు రెండుదృతములు— | ○ ○ = 7 అక్షరాలు.

త్రితియ్యకాలము:—అక్షరకాలమునకు మూడురెట్లు వేగముగల కాలము అనగా ఒకఅక్షరకాలములో 4 అక్షరములు పాడుట.

దాటువరుసలు:—స్వరావళిలో— స గ రి మ గ ప — ని ప ద మ ప గ— వలెనుండుదాటు స్వర పాఠములు.

ధైవతము:—సప్తస్వరములలో నారవది.

ధ్రువతాళం:—ప్రధానమైన సప్తతాళములలో మొదటిది.

లఘువు ద్రుతము రెండు లఘువులు కలది   గుర్తు = | ○ | |

దీర్ఘ:—పొడవు — దీర్ఘస్వరము రెండక్షరకాలములు కలది.

ద్రవిడ సంగీతము:—దక్షిణఇండియాలో పురాతన తమిళులలో నేర్పాటుగానుండిన సంగీతము. ఈ సంగీతమున్ను విశాలరాగపద్ధతిని సరించియేయున్నది. వీరి సంగీతమునకును సప్తస్వరములే ప్రధానములు 1. కురాక్ 2. తట్టం 3. కైక్కిలై 4. ఉజై 5. ఇల్లి 6. విలారి 7. తారం. అని సప్తస్వరముల పేర్లు.

ద్రుతం:—తాళషడంగములలోనొకటి లెక్కించు విధము ఒక దెబ్బకొట్టి చేతిని విసరుట (దెబ్బ—వుసి) కాలపరిమితి—రెండక్షర కాలములు. గుర్తు— ○

ద్రుతకాలము:—శీఘ్రగతిని పాడుట.

ద్వితియ్యకాలము:—రెండవకాలము అనగా ఒక అక్షరకాలములో రెండక్షరములు పాడుట.

నాదము:—సంగీత సంబంధమైన ధ్వని. ఇది ఇ పుగానుండును. మఱియు నేదైన సంగీతవాయిద్యముయొక్క ధ్వని. ఈ తంబురనాదము కంటె హెచ్చులేక బాగు అనివాడుచుందుము.

నీచస్థాయి:—తగ్గుస్థాయి. (మంద్రస్థాయి)

నిషాదము:—సప్తస్వరములలో నేడవది.

పంచమం:—సప్తస్వరములలో నైదవది.

ప్లుతం:—తాళషడంగములలోనొకటి. లెక్కించువిధము. ఒక దెబ్బ—కృష్య (చేతిని ఎడమవైపు విసరుట). సర్పిణి (చేతిని కుడివైపు విసరుట). ఈ మూడుభాగముల కాలపరిమితి ఒక్కొకదానికి 4 అక్షర కాలము. ఈ ప్లుతమునకు 12 అక్షర కాలములు కాలపరిమితి గుర్తు = ⸤8

ప్రకృతస్వరం:—వికృతిలేని స్వభావసిద్ధమైన స్వరము. (స — ప) ప్రకృతి స్వరములు.

ప్రథమకాలము:—మొదటికాలము—ఒక అక్షరకాలము కావచ్చును లేదా 4 అక్షర కాలము కావచ్చును.

ప్రతిమధ్యమం:—సప్తస్వరములలో నాల్గవస్వరమైన మధ్యమమునకు తీవ్రస్వరూపము. తీవ్రమధ్యమం అనగా హెచ్చు మధ్యమము.

పూర్వాంగము:—సప్తస్వరములలో స రి గ మ పూర్వాంగమనబడును. మఱియు వర్ణములోని ప్రథమభాగము అనగా పల్లవి, అనుపల్లవి, ముక్తాయి స్వరము కలసి పూర్వాంగ మనబడును.

భేదము:—తేడా లేక రకము.

ఉత్తరాంగము:—సప్త స్వరములలో హెచ్చు స్వరము లైన ప ధ ని స యును, వర్ణములోని చరణము, ఎత్తుగడ స్వరములు కలసి ఉత్తరాంగమనబడును.

ఉచ్చస్థాయి:—హెచ్చుస్థాయి లేక తారస్థాయి.

మధ్యమము:—సప్తస్వరము లలో నాల్గవ స్వరము

మధ్యమకాల:—చౌకము కాక త్వరితము కాక సమముగా నుండు వేగము.

మధ్యసప్తకము:—మంద్రస్థాయికిని తారస్థాయికిని మధ్యముగా నుండు మధ్యస్థాయి.

మధ్యస్థాయి:— డిటో

మంద్రసప్తకము లేక మంద్రస్థాయి } — మధ్య స్థాయికి దిగువనుండు స్థాయి తగ్గుస్థాయి.

మాత్ర:—నాల్గు లఘ్వక్షరముల నుచ్చరించు కాలమునకు మాత్ర యని పేరు.

మఠ్యతాళము:—ప్రధాన తాళసప్తకములో రెండవది. లెక్కించు విధము:— ఒక లఘువు ఒకధృతము ఒకలఘువు, గుర్తు | O | లఘువు = 4 అక్షరములు. మొత్తము 10 అక్షరములు.

మిశ్రలఘువు:—లఘువు జాతులలో నొకటి. ఒక దెబ్బ కొట్టి ఆరు వ్రేళ్ళు లెక్కించుట. 7 అక్షరముల లఘువు. గుర్తు = | 7.

రాగము:—విను వారి మనస్సును ఆకర్షించి రంజింపజేయు స్వర వర్ణముల చేరికకు రాగము అని పేరు.

రిషభము:—సప్త స్వరములలో రెండవ స్వరము.

రూపక తాళం:—ప్రధానమైన తాళ సప్తకములో మూడవ తాళము. ఒక ద్రుతము ఒక లఘువు కలిగియున్నది, గుర్తు = ○ |

లఘువు: —తాళషడంగములలో నొకటి, ఒక దెబ్బకొట్టి జాతి భేదములననుసరించి వ్రేళ్ళు 2, 3, 4, 6, 8 లెక్కింపవలెను. త్రిశ్ర(3), చతురశ్ర(4), ఖండ(5), మిశ్ర(7), సంకీర్ణ(9) జాతులను కలిగియున్నది. గుర్తు = | .

లయ:—తాళము. అనగా పాటతో తాళము ఇంచుమించు లేక సరిగానడచుటకే లయ అని పేరు.

విచ్చు లేక వుసి:—తాళము వేయునపుడు చేతిని విసరి విడదీయుట—దీనికే విసర్జితమనియు పేరు.

వికృతి స్వరములు:—భేదముగల స్వరములు అనగా హెచ్చు తగ్గులుగల ధ్వనుల కవకాశమిచ్చునవి. రి గ మ ధ ని వికృతిస్వరములు.

విళంబిత కాలము:—చౌక కాలముఅనగా మందముగాపాడుట.

శుద్ధ గాంధారము:—ఇరువది రెండు శ్రుతులలో నొకటి. సాధారణ గాంధారస్థానముకంటె దిగువది అనగా 3 రకముల గాంధారములలోను మిక్కిలి తగ్గు(గ) యదార్థముచేత చతుశ్రుతి రిషభమే పేరునకు అవసరమునుబట్టి శుద్ధగాంధారమని వాడబడుచున్నది.

శుద్ధ నిషాదము:—మూడు రకముల నిషాదములలోని మిక్కిలి తగ్గు (ని) కైశికి నిషాదమునకు దిగువది. చతుశ్రుతి ధైవతస్థానము. ఇరువది రెండు శ్రుతులలోని నిషాద స్వరములలో మొదటిది.

శుద్ధధైవతము:—ధైవతములన్నిటిలో కోమలముగా బలుకునది కోమలధైవతము అనగా తగ్గు (ధ).

శుద్ధమధ్యమము:— కోమల మధ్యమము. అనగా తగ్గుకాల ప లుకు (మ)

శుద్ధరిషభము:—రిషభము లన్నిటిలో తగ్గుగా పలుకునది. కోమల రిషభము (రి)

✓ శ్రుతి:—చెవిచే వినతగిన ధ్వని శ్రుతి యని చెప్ప బడుచున్నది. శరీరమందలి 22 నాడుల వలన 22 రకములుగా శ్రుతి పలుకుచున్నదని యు, దీని నాధారము చేసికొనియే వీణ యనువాద్యము నిర్మింపబడిన దనియు పూర్వాచార్యులు చెప్పుచున్నారు. షడ్జము, పంచమము ఈ రెండు ధ్వనుల సమీకరణమునే శ్రుతి యని వాడుచున్నారు. ఈ షడ్జ పంచమ భావమువలన గాత్రమందును, వీణయందును ఇరువది రెండు శ్రుతులు పుట్టుచున్నవి. మంద్రస్థాయియందు ఇరువది రెండు శ్రుతులు హృదయ స్థానమందును, మధ్యస్థాయియందు ఇరువది రెండు శ్రుతు లు కంఠమందును, తారస్థాయి యందు ఇరువది రెండు శ్రుతులు శిరస్సు నందును పుట్టుచున్నవని చెప్పుచున్నారు.

శ్రుతియె స్వరావయవము. ఆ శ్రుతివలన స్వరములును స్వరముల వలన గ్రామములును, గ్రామములవలన జాతులును, జాతులవలన రాగ ములును బుట్టుచున్నవని చెప్పుదురు.

గానముసేయుటకు శ్రుతి యాధారము. (Key-Note)

షడంగములు:—తాళ షడంగములు. 1 అనుద్రుతము ◡ 2 ద్రుతము O. 3 లఘువు | 4 గురువు S 5 ప్లుతము ꞩ 6 కాకపా దము +

షడ్జము:—సప్తస్వరములలో మొదటి స్వరము అనగా—(స)

షట్ఛ్రుతిధైవతము:—చతుశ్శృతిధైవతము కంటె హెచ్చు కైశికి నిషాదస్థానమే షట్ఛ్రుతి ధైవత మనబడును. మిక్కిలి హెచ్చు (ధ)

షట్ఛ్రుతి రిషభము:—(రి) చతుశ్రుతి రిషభమునకు పైది. సాధారణ గాంధారస్థానము (గ)

✓ సంగతి:—కృతిలో ఒక భాగమైన పల్లవిని ఓకే విధమున పాడక రాగ భావముగాని తాళముగాని చెడకుండ మార్పుచేసి పాడుట కే సంగతియందురు. ఈవిధముగనే అనుపల్లవిని, చరణములను కూడ మార్పుచేసి అనేకసంగతులతో పాడునపుడే కృతికి భావము కలిగి రక్తి కట్టును. ఈ సంగతులవలన శ్రోతలమనస్సు ఆకర్షింపబడును. పదముల ను, జావళులను అనేక సంగతులతో పాడి వినువారి నానందింప జేయు చున్నారు.

సంకీర్ణజాతి లఘువు:—లఘువుయొక్క జాతులలోనొకటి. ఒక దెబ్బకొట్టి యొనిమిది వ్రేళ్ళులెక్కింపవలెను. గుర్తు | 9

సప్త:—ఏడు.

సప్తకము:—స రి గ మ ప ధ ని—యను ఏడు స్వరములకు సప్తకమని పేరు. ఒక స్థాయి. (Octave)

సప్తతాళములు: ప్రధానమైన యేడు తాళములు 1. ధృవ 2. మఠ్య 3. రూపక 4, ఝంపె 5. త్రిపుట 6. అట 7. ఏక. అనునవి సప్తతాళములు.

సప్తస్వరములు:—ఏడు స్వరములు — స రి గ మ ప ధ ని. వరుసగా 1. షడ్జ 2. రిషభ 3. గాంధార 4. మధ్యమ 5. పంచమ 6: ధైవత 7. నిషాదములనిపేర్లు.

స్వరము:—మనస్సును స్వకీయముగా అనగా తనంతట తానే రంజింపజేయు ధ్వనికి స్వరమని పేరు. సంగీత సంబంధమైన స్వరము.

స్వరజ్ఞానము:—కృతిపాడునపుడుగాని రాగముపాడునపుడుగాని ఆధ్వనుల పోకడల స్వరస్థానములలో సరిగాపోల్చిచెప్పగలవానిని స్వరజ్ఞానము కలవాడందురు సాహిత్యమును పాడునపుడు రాగబావము చెడకుండ సరియైన స్వరముల చెప్పగలుగుట. స్వరసమూహముల జూచి సాహిత్యమును సరిగా పాడగలుగుట స్వరజ్ఞానమనబడును. ఇట్టి జ్ఞానము వాద్య విశేషములందును గాత్రపాట యందునుగూడ గలిగియుండుట స్వరజ్ఞానమనబడును.

స్వరావళి:—సరళీ స్వరములు లగాయితు అలంకారముల ఆఖరు వరకుజేయు స్వరముల సాధకములకు స్వరావళీయందురు.

సాధారణగాంధారము:—కోమల గాంధారము. అనగా తీవ్ర గాంధారముకంటె తగ్గుగా బలుకు (గ) స్వరము.

సాహిత్యము:—గీతము, స్వరజతి. వర్ణము మొదలగు వానిలో స్వరములక్రింద వ్రాయబడు రచనకు సాహిత్యమనిపేరు.

స్థాయి:—సప్తస్వరములైన స రి గ మ ప ధ ని యను స్వరములు నిలిచెడి చోటునకు స్థాయి యని పేరు. ఇంగ్లీషులో ఆక్టేవు అందురు. గాత్ర పాటలో స్థాయిలు మూడు. మంద్ర, మధ్యమ, తారస్థాయిలు ఒకొక్క స్థాయియందు 22 శృతులుండును.

వీణ మొదలగు వాద్యములందు అనుమంద్ర, అతితారస్థాయిలతో గూడి మొత్తము ఐదు స్థాయిలున్నవి.




హెచ్చుస్థాయి:—**Higher Octave** తారస్థాయి.

హెచ్చుస్థాయివరుసలు:—తారస్థాయిలో స్వరముల సాధకములు.

హ్రస్వ:—పొట్టి **(Short)** ఒక హ్రస్వస్వరము యొక్క కాలపరిమితి ఒక అక్షరకాల మగును.

శబ్దశాస్త్రము!—అకౌస్టిక్సు. (Acoustics) (శబ్దము=ధ్వని) ఇది యొక శాస్త్రము. ఈశాస్త్రము ధ్వనులపుట్టుక కారణము స్వభావము మొదలగు విషయములగూర్చి చెప్పును. సంగీతశాస్త్రము మనోరంజకమైన ధ్వనులగూర్చి జెల్పుచున్నది. అకౌస్టిక్సు మామూలు ధ్వనులపుట్టుక, వేపనములు, పోలికలు లేక భేదములు, వానిని కనిపెట్టు విధమును గూర్చి చెప్పుచున్నది.

ఏకో యొకవిధమైన చలనశక్తి వలన ధ్వని కలుగుచున్నది. చాల విషయములలో ఈ చలనశక్తి మనకు ప్రత్యక్షగోచరమగును. ఇందు కుదాహరణము:—ఒక తంబురయొక్కగాని, వీణయొక్కగాని తంత్రిని మీటునప్పుడది యిటునటు కదలి ధ్వని పుట్టించుటను జూచుచున్నాము. తిరిగి దానిని వ్రేలితో తాకినవెంటనే ఆతంత్రి చలన మాగిపోవుటయేగాక ధ్వనియును నమసిపోవుచున్నది. ఇందుమూలమున నొక ధ్వనినిచ్చువస్తువు వేపనములుగల చలనమువలన ధ్వని పుట్టించుచున్నదని తెలియుచున్నది.

## Musical Sounds and Noises.

## సంగీతధ్వనులు — వట్టిధ్వనులు.

సంగీత సంబంధమైన ధ్వని ఎడతెగని మనోరంజకమును గలుగజేయుచున్నది. అది క్రమమైన, కాలపరిమితి గల వేపనములచే బుట్టుచున్నది. ఇక (Noise) అనగా చప్పుడు, గందరగోళమైన, అనేకమైన వినుట కింపుకాని ధ్వనులవలన కలుగుచున్నది. ఇందు కుదాహరణ సముద్రఘోష. ఇట్టిధ్వనికి సక్రమమైన కాలపరిమితిగాని క్రమపద్ధతిగాని లేకపోవుటయే కారణము. అయినను ఒకొక్కప్పుడు సంగీత ధ్వనికిని (Musical Sounds) మామూలు ధ్వనికిని (Noise) భేదము కని

పెట్టుటయు కష్టమే. ఇందుకు తార్కాణముగా, ఘటవాద్యము, కంజిరావాద్యము వల్ల కలుగుధ్వనులు మ్యూజికల్ సౌండ్సు కాకపోయినను ఒక పాటకచేరీలో ప్రక్కవాద్యములక్రింద నుపయోగింపబడి మనోరంజకము లగుచున్నవి.

## సంగీత ధ్వనులు — వాని లక్షణములు.

(Musical Sounds and their Characteristics)

సంగీత సంబంధమైన ధ్వనులు ఈ దిగువ విషయములలో భేదించును :—

1. శృతి (Pitch) 2. ఘనము (Intensity or loudness) 3. గుణము (Quality or timbre)

1. శృతి (Pitch): —హెచ్చు శ్రుతులలోని స్వరమునకును తగ్గు శ్రుతిలోని స్వరమునకును గల భేదమును వెల్లడించు నదియే శృతి లేక పిచ్ (Pitch).

గాంధారము, మధ్యమము అనురెండుస్వరములలోను మధ్యమము (మ) యొక్క శృతి గాంధారము (గ) యొక్క శృతికంటె హెచ్చు ఎందుచేతననగా ఒక స్వరముయొక్కశృతి దాని వేపనముల (Vibrations) సంఖ్యమీద ఆధారపడియుండును. ఒక సెకనులో ఎన్ని వేపనములుండునో దానినిబట్టి ఒక స్వరముయొక్క శృతికొలువబడుచున్నది. ఉత్తమమైన మనుష్య శారీరములో పలుకు స్వరములకుగల వేపనముల లెక్క తక్కువ స్వరమునకు ఒక సెకండులో 50 వేపనములును మిక్కిలి హెచ్చు స్వరమునకు ఒక సెకండులో 1500 వేపనములును, సాధారణ గాత్రములో సెకండుకు 100 మొదలుకొని 900 లేక 1000 వరకు వేపనములుండునని శాస్త్రజ్ఞులు చెప్పియున్నారు. ఇప్పుడు

ఇంగ్లాండు దేశమున హార్మోనికల్ సంగీతమునకు సెకండుకు 240 వేపనములుగల స్వరమును ఆధార షడ్జమముగ జేసికొనియున్నారట.

ఆధారషడ్జమును నాధారముగ జేసికొనిన దానికి మధ్యమముగాని పంచమముగాని ఆ యాధార షడ్జమముకంటె ఎంతహెచ్చుశృతి (Pitch) యో తెలియనగును. ఒక్క స్వరముయొక్క శృతిని దెలిసికొనుటకు ఆ స్వరముయొక్క వేపనముల సంఖ్యయే ఆధారము.

ఘనము (Intensity or loudness :—ఒక ధ్వనియొక్క ఘనము ఎంతవరకు ఎన్ని వేపనములను కలిగింప శక్తి గలవస్తువో అట్టి ధ్వనిని కల్పించు వస్తువుమీద నాధారపడియుండును. ఒక తంబురయొక్కగాని వీణయొక్కగాని సారణి తంత్రిని మొదట నెమ్మదిగాను పిమ్మట గట్టిగాను మీటిన శృతి ఒక్కటేయైనను ఆ రెండు ధ్వనుల తారతమ్యములను సులభముగా గ్రహింపనగును. ఎట్లన నెమ్మదిగా మీటినపుడు గలిగిన ధ్వనికంటె గట్టిగా మీటినధ్వనియొక్క ఘనము (Intensity) హెచ్చు అని తెలియనగును. శృతి (Pitch) లో నెంతమాత్రమును మార్పులేదు.

ఒక స్వరమును దాని పుట్టుకస్థానమునుండి కొంతదూరములో వినునపుడు దాని ఘనము (Intensity) అయిదు ముఖ్యవిషయముల మీద నాధారపడి యుండును. అవి యెవ్వియనిన :—

1. ధ్వనినిచ్చువస్తువునుండి వినేచెవియొక్కదూరము.
2. వేపనముల బాహుళ్యము.
3 ధ్వనిపుట్టిన స్థానమందలి గాలియొక్కసాంద్రత.
4. వాయుతరంగములుపోవు దిశ (వైపు లేక దిక్కు)
5. పరిసరప్రాంతమందు ధ్వని కల్పింపగల ఇతరవస్తువులుండుట.

గుణము (Quality or timbre) :—

మనుష్యగాత్రములోగాని, ఫిడేలు, వీణ, వేణు మొదలగు వాద్యము

లందుగాని ఒకే స్వరమును బలికించినను, ఆస్వరముయొక్క శృతి(Pitch) గాని, ఘనము (Intensity or loudness) గాని ఒకటే యైనను, వినువారికి ఆస్వరము మనుష్యగాత్రమునుండి పుట్టినదో లేక వీణ మొదలగు ఏవాద్యమునుండి పుట్టినదో శులభముగా దెలియుచున్నది. అటుల దెలియుటకు కారణభూతమైనది ఆ యా నాదముల యొక్క లక్షణమే. ఏనాద లక్షణముచేత ఆనాదము మనుష్య గాత్రమువలన గాని, వేణు, వీణ, ఫిడేలు మొదలగు వాద్యములవలనగాని పుట్టినదని తెలిసికొనునట్లు చేయుచున్నదో దానికే గుణము (Quality or timbre) అని పేరు.

—: రా గ ము :—

వినువారి మనస్సును ఆకర్షించి ఆనందింపజేసి సుఖపరచి వాంఛించునటుల జేయు స్వరవర్ణముల చేరికకు రాగమందురు (రాగము అనగా ఆస)

రాగఆలాపన లేక ఆలప్తి :—

ఒక రాగముయొక్క స్వరస్థానములగుర్తెరిగి ఆరోహణావరోహణ క్రమములో గమకవరేకులతో బహువిధములుగా బెంపుచేసి అన్నియందముల గనబఱచి రాగమును బాడుటకే రాగాలాపనయనిపేరు. బిడ్డలు ఎదుగుట కాహారమెట్లుకావలెనో ఆరీతిగానే రాగమును పెంపుచేయుటకు రాగమును ఏ స్వరముచే గ్రహించవలెనో గ్రహించి రాగలక్షణముల గుర్తెరిగి స్వరములను బహువిధములుగా జేర్చి మంద్రస్థాయి, మధ్యస్థాయి, తారస్థాయిలయందు పాడుకొని తిరిగి మధ్యస్థాయి షడ్జములో ముగించుటయే రాగముపాడు విధము.

ఇప్పటి పద్ధతిప్రకారము రాగములు రెండు విధములు.

1. జనక రాగములు 2. జన్య రాగములు.

N. B. పూర్వాచార్యులు రాగములు 1. మార్గ రాగములు 2. దేశీరాగములని రెండుభాగములనియు అందుమార్గరాగము లీమనుష్యలోకములో లేక గంధర్వ లోకమందున్నవనియు మనుజలోకములో దేశీరాగములు మాత్రమే గలవని యు జెప్పుచున్నారు. దేశీ రాగములు 1. రాగాంగ 2. ఉపాంగ 3. భాషాంగ 4. క్రియాంగ రాగములని నాలుగు రకములుగా జెప్పియున్నారు.

జనక రాగములు:—ఈరాగములు ఆరోహణ అవరోహణములందు వరుస క్రమము తప్పక సప్తస్వరములను గలిగి యుండును. ఇట్టి రాగములు జనక రాగములనియు, రాగాంగరాగములనియు, మేళకర్త రాగములనియు, సంపూర్ణ రాగములనియు, ప్రధాన రాగములనియు, ప్రైమరీరాగము లనియు, కర్తరాగము లనియు, మేళరాగము లనియు, రూట్‌రాగము లనియు పిలువబడుచున్నవి. ఈ జనరాగము లన్నిటిలోను షడ్జ పంచమములయందు మార్పేమియు నుండక తక్కిన (రి గ మ ద ని) స్వరములు మాత్రము రాగమునుబట్టి మార్పు జెందును. ఇట్టి జనకరాగములు మొత్తము 72 రాగము లున్నవి.

ఉదాహరణ:—ధీరశంకరాభరణం, మేచకల్యాణి, మాయామాళవగౌళ, హనుమత్తోడి, ఖరహరప్రియ. — మొదలగునవి జనక రాగములు. ఈ 72 మేళకర్తరాగములు పండ్రెండు చక్రములలో ఒక్కొక చక్రమందు ఆరురాగముల చొప్పున విభజింపబడి చూపబడి యున్నవి.

| | | |
|---|---|---|
| చక్రములపేర్లు. | 1. ఇందు | 7. ఋషి |
| | 2. నేత్ర | 8. వసు |
| | 3. అగ్ని | 9. బ్రహ్మ |
| | 4. వేద | 10. దిశి |
| | 5. బాణ | 11. రుద్ర |
| | 3. ఋతు | 12. ఆదిత్య |

# 72. జనక రాగముల పథకము.

| చక్రము | శుద్ధ మధ్యమ రాగములు | స్వరస్థానములు. రి | గ | ధ | ని | ప్రతి మధ్యమ రాగములు | చక్రము |
|---|---|---|---|---|---|---|---|
| 1. ఇందు | 1. కనకాంగి | శు | శు | శు | శు | 37. సాలగము | 7. ఋషి |
| | 2. రత్నాంగి | ,, | ,, | ,, | కై | 38. జలార్ణవము | |
| | 3. గానమూర్తి | ,, | ,, | ,, | కా | 39. ఝాలవరాళి | |
| | 4. వనస్పతి | ,, | ,, | చ | కై | 40. నవనీతము | |
| | 5. మానవతి | ,, | ,, | చ | కా | 41. పావని | |
| | 6. తానరూపి | ,, | ,, | ష | కా | 42. రఘుప్రియ | |
| 2. నేత్ర | 7. సేనావతి | శు | సా | శు | శు | 43. గవాంబోధి | 8. వసు |
| | 8. హనుమత్తోడి | ,, | ,, | ,, | కై | 44. భవప్రియ | |
| | 9. ధేనుక | ,, | ,, | ,, | కా | 45. శుభపంతువరాళి | |
| | 10. నాటక ప్రియ | ,, | ,, | చ | కై | 46. షడ్విధమార్గణి | |
| | 11. కోకిల ప్రియ | ,, | ,, | చ | కా | 47. సువర్ణాంగి | |
| | 12. రూపవతి | ,, | ,, | ష | కా | 48. దివ్యమణి | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 3. అగ్ని | 13. గాయకప్రియ | శు | అం | శు | శు | 49. ధవళాంబరి | 9. బ్రహ్మ |
| | 14. వకుళాభరణము | " | " | " | కై | 50. నామనారాయణి | |
| | 15. మాయామాళవగౌళ | " | " | " | కా | 51. కామవర్థని | |
| | 16. చక్రవాకము | " | " | చ | కై | 52. రామప్రియ | |
| | 17. సూర్యకాంతము | " | " | చ | కా | 53. గమనశ్రమ | |
| | 18. హాటకాంబరి | " | " | ష | కా | 54. విశ్వంభర | |
| 4. వేద | 19. ఝంకారధ్వని | చ | సా | శు | శు | 55. శ్యామలాంగి | 10. దిశి |
| | 20. నఠభైరవి | " | " | " | కై | 56. షణ్ముఖప్రియ | |
| | 21. కీరవాణి | " | " | " | కా | 57. సింహేంద్రమధ్యమము | |
| | 22. ఖరహరప్రియ | " | " | చ | కై | 58. హేమవతి | |
| | 23. గౌరీమనోహరి | " | " | చ | కా | 59. ధర్మవతి | |
| | 24 వరుణప్రియ | " | " | ష | కా | 60. నీతిమతి | |
| 5. బాణ | 25. మారరంజని | చ | అం | శు | శు | 61. కాంతామణి | 11. రుద్ర |
| | 26. చారుకేశి | " | " | " | కై | 62. రిషభప్రియ | |
| | 27. సరసాంగి | " | " | " | కా | 63. లతాంగి | |
| | 28. హరికాంభోజి | " | " | చ | కై | 64. వాచస్పతి | |
| | 29. ధీరశంకరాభరణము | " | " | చ | కా | 65. మేచకళ్యాణి | |
| | 30. నాగానందిని | " | " | ష | కా | 66. చిత్రాంబరి | |
| 6. ఋతు | 31. యాగప్రియ | ష | అం | శు | శు | 67. సుచరిత్రము | 12. ఆదిత్య |
| | 32. రాగవర్ధని | " | " | " | కై | 68. జ్యోతిస్వరూపిణి | |
| | 33. గాంగేయభూషణి | " | " | " | కా | 69. ధాతువర్ధని | |
| | 34. వాగధీశ్వరి | " | " | చ | కై | 70. నాసికాభూషణి | |
| | 35. శూలిని | " | " | చ | కా | 71. కోసలము. | |
| | 36. చలనాట | " | " | ష | కా | 72 రసికప్రియ | |

పై 72 మేళకర్తరాగముల ప్రణాళిక (స్కీము) యందు ఒక్కొకచక్రములో (6) ఆరురాగముల చొప్పున 12 చక్రములుగా విభజింపబడి యుండుటను గాననగును. ఒకటిలగాయతు ముప్పదియారు (1 to 36) వరకును గలరాగములలో శుద్ధమధ్యమమే వాడబడుటచే ఈమొదటి ముప్పదియారు (36) రాగములకును శుద్ధమధ్యమ మేళకర్త రాగములనియు, ముప్పదియేడవరాగము లగాయతు డెబ్బదిరెండవరాగము ఆఖరువరకు (37 to 72) ప్రతిమధ్యమము వాడబడుటచే ఈ ముప్పదియారురాగములకు ప్రతిమధ్యమ మేళకర్తరాగములనియు పేరు. మఱియు శుద్ధమధ్యమ మేళకర్తరాగములకు పూర్వమేళకర్తలనియు, ప్రతిమధ్యమ మేళకర్తరాగములకు ఉత్తరమేళకర్త లనియు పేర్లు. కాబట్టి 72 మేళకర్తలను సమానముగా విభజించుటకు మధ్యమస్వరమే ప్రధానమగుచున్నది. మఱియు పూర్వమేళకర్తలలో శుద్ధమధ్యమస్వరమును ఉత్తరమేళకర్తలలోని ప్రతిమధ్యమస్వరమును తప్ప తక్కినస్వరములు పూర్వమేళకర్తలలోను ఉత్తరమేళకర్తలలోను సరిసమానముగా నుండుటను గమనించునది.

మొదటి ఆరుచక్రములలోను (1 to 6) శుద్ధమధ్యమ రాగములును, రెండవ ఆరుచక్రములలోను (7 to 12) ప్రతి మధ్యమరాగములును జూపబడియున్నవి గదా.

రిషభస్థానవిషయము:—మేళకర్తరాగములు ఒకటి లగాయతు పదునెనిమిది (1 to 18) వరకును (1, 2, 3 చక్రములలోనివి) ప్రతిమధ్యమ మేళకర్తరాగములు మొదటి పదునెనిమిది (37 to 54) వరకును (7, 8, 9 చక్రములలోనివి) శుద్ధరిషభమును సమానముగా గలిగియున్నవి. 19 లగాయతు 30 వరకు గల పండ్రెండు శుద్ధమధ్యమ మేళకర్తరాగములున్ను (4, 5 చక్రములలోనివి) 55 లగాయతు 66 వరకు గల పండ్రెండు ప్రతిమధ్యమ మేళకర్తలున్ను (10, 11 చక్రములలోనివి) చతుశ్రుతిరిషభమును సరిసమానముగా గలిగియున్నవి. మఱియు శుద్ధమధ్యమ మేళకర్తలు 31 లగాయతు 36 వరకుగల ఆరింటిలోను (6 చక్రములలోనివి) ప్రతిమధ్యమ మేళకర్తలు 67 లగాయతు 72 వరకు గల ఆరింటిలోను (12 చక్రములలోనివి) షట్శ్రుతిరిషభమును సరిసమానముగా గలిగియున్నవి.

ఇక గాంధారస్థాన విషయము:—శుద్ధమధ్యమ మేళకర్తలు 1 లగాయతు 6 వరకును, ప్రతిమధ్యమ మేళకర్తలు 37 లగాయతు 42 వరకున్ను (1, 7 చక్రములలో నున్నవి) శుద్ధగాంధారమును సమానముగా గలిగియున్నవి. శుద్ధమధ్యమ మేళకర్తలు 7 లగాయతు 12 వరకున్ను, 19 లగాయతు 24 వరకున్ను మొత్తము పండ్రెండున్ను, ప్రతిమధ్యమ మేళకర్తలు 43 లగాయతు 48 వరకున్ను, 55 లగాయతు 60 వరకున్ను మొత్తము పండ్రెండున్ను (2, 4-8, 10 చక్రములలోనివి) సాధారణ గాంధారమును సరిసమానముగా గలిగియున్నవి. మఱియు శుద్ధమధ్యమ మేళకర్తలు 13 లగాయతు 18 వరకును, 25 లగాయతు 36 వరకును, మొత్తము పదునెనిమిదిన్ని, ప్రతిమధ్యమ మేళ

కర్తలు 49 లగాయతు 54 వరకున్ను, 61 లగాయతు 72 వరకున్ను మొత్తము పదునెనిమిదిన్ని (3, 5, 6-9, 11, 12 చక్రములలోనివి) అంతరగాంధారము సరిసమానముగా గలిగియున్నవి.

ధైవతస్థానవిషయము:—ప్రతి చక్రములోను పూర్వమేళకర్త రాగములలోను ఉత్తరమేళకర్త రాగములలోను గూడ మొదటి మూడేసిరాగములును శుద్ధధైవతమును, నాలుగైదులు చతుశ్రుతిధైవతమును ఆరులు షట్ఛ్రుతి ధైవతమును సరిసమానముగా గలిగియున్నవి.

నిషాదస్థాన విషయము:—ప్రతి చక్రములోను శుద్ధమధ్యమ ప్రతిమధ్యమ మేళకర్తరాగముల రెంటిలోను మొదటి మేళకర్తరాగము మాత్రము శుద్ధనిషాదమును, రెండునాలుగులు కైశికినిషాదమును, మూడు, ఐదు, ఆరులు కాకలినిషాదమును సరిసమానముగా గలిగియున్నవి.

N. B:—మేళకర్తల పధకమును జాగ్రత్తగా జదువరులు గమనించిన పై విషయములు తేటతెల్లముగ దెలియనగును. మఱియు, షట్ఛ్రుతి రిషభస్థానము సాధారణ గాంధారస్థానమేయనియు, శుద్ధగాంధారస్థానము చతుశ్రుతిరిషభస్థానమే యనియు, షట్ఛ్రుతిధైవతస్థానము కైశికినిషాదస్థాన మనియు, శుద్ధనిషాదస్థానము చతుశ్రుతిధైవతస్థానమే యనియు జ్ఞప్తియందుంచుకొనవలయును.

## ✓ జన్యరాగములు.

పైన జెప్పబడిన డెబ్బదిరెండు జనక లేక మేళకర్త రాగముల నుండియు ఒక్కొకదానినుండి అనేక రాగములు పుట్టుచున్నవి. అట్లు పుట్టిన రాగములు ఆయామేళకర్తల స్వరస్థానములనే గలిగియుండి,

కొన్ని స్వరములు ఆరోహణమందుగాని, అవరోహణమందుగాని, లేక రెంటియందుగాని లోపించుటచేతను, లేక సప్తస్వరముల గలిగియున్నను వరుసక్రమములో వెళ్ళక వక్రగతిని బోవుటచేతను జన్యరాగము లనబడుచున్నవి.

జన్యరాగములు నాలుగు రకములు: —

1. వర్జరాగములు, 2. వక్రరాగములు, 3. ఉపాంగరాగములు, 4. భాషాంగరాగములు.

1. వర్జరాగములు:—వర్జ అనగా విడుచుట యని యర్థము. ఆరోహణమందుగాని అవరోహణమందుగాని లేక రెండింటియందు గాని కొన్ని స్వరములు విడువబడుచున్నవి (వర్జింపబడుచున్నవి). ఇట్టి రాగములకు వర్జరాగము లనిపేరు. ఈ వర్జరాగములు తిరిగి యెనిమిది రకములుగా నున్నవి.

1. షాడవ సంపూర్ణరాగములు.
2. ఔడవ సంపూర్ణరాగములు.
3. సంపూర్ణ షాడవరాగములు.
4. సంపూర్ణ ఔడవరాగములు.
5. షాడవ షాడవరాగములు.
6. షాడవ ఔడవరాగములు.
7. ఔడవ షాడవరాగములు.
8. ఔడవ ఔడవరాగములు.

ఈ దిగువ పఠికములో నుదాహరణపూర్వకముగా జూపబడినవి.

| | జన్యరాగము లేక వర్జరాగము రకము | | జన్యరాగ లక్షణము | | | ఉదాహరణలు | మేళకర్త |
|---|---|---|---|---|---|---|---|
| | | | స్వరముల సంఖ్య | | | | |
| | ఆరోహణ | అవరోహణ | ఆరోహణ | అవరోహణ | రాగంపేరు | ఆరోహణ<br>అవరోహణ | |
| 1 | షాడవ | సంపూర్ణ | 6 | 7 | కాంభోజి | సరిగమపధస<br>సనిధపమగరిస | 28. హరి కాంభోజి |
| 2 | ఔడవ | సంపూర్ణ | 5 | 7 | బిలహరి | సరిగపధస<br>సనిధపమగరిస | 29. ధీర శంకరాభరణం |
| 3 | సంపూర్ణ | షాడవ | 7 | 6 | భైరవం | సరిగమపధనిస<br>సధపమగరిస | 17. సూర్య కాంతము |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 4 | సంపూర్ణ | ఔడవ | 7 | 5 | గరుడధ్వని | సరిగమపధనిస̇<br>స̇ధపగరిస | 29. ధీర<br>శంకరాభరణం |
| 5 | షాడవ | షాడవ | 6 | 6 | శ్రీరంజని | సరిగమధనిస̇<br>స̇నిధమగరిస | 22. ఖర<br>హరప్రియ |
| 6 | షాడవ | ఔడవ | 6 | 5 | నాటకురంజి | సరిగమధనిస̇<br>స̇నిధమగస | 28. హరి<br>కాంభోజి |
| 7 | ఔడవ | షాడవ | 5 | 6 | మలహరి | సరిమపధస̇<br>స̇ధపమగరిస | 15. మాయా<br>మాళవగౌళ |
| 8 | ఔడవ | ఔడవ | 5 | 5 | మోహన | సరిగపధస̇<br>స̇దపగరిస | 28. హరి<br>కాంభోజి |

షాడవ = 6 స్వరములు
ఔడవ = 5 స్వరములు
సంపూర్ణ = 7 స్వరములు
} అని పైపట్టికమునుండి గమనించునది.

2. వక్రరాగములు — జనకరాగములోని సప్తస్వరములను గలిగియుండి ఆరోహణమందుగాని అవరోహణమందుగాని లేక రెండింటియందుగాని వరుసక్రమములో స్వరములు వెళ్లక వక్రగతిగా స్వరములు పోవురాగములకు వక్రరాగములని పేరు. మరియు కొన్నిటిలో సప్తస్వరములలో ఒకటి లేక రెండుగాని లేక మూడుగాని ఆరోహణమందుగాని అవరోహణమ దుగాని లేక రెండిటియందుగాని లోపించుటయు గలదు.

వక్రరాగములు మూడురకములు :—

(1) ఆరోహణ అవరోహణముల రెండింటియందును స్వరములు వక్రగతిని పోవురాగములు.

ఉదాహరణ:—శహానారాగము.

ఆరోహణ:—సరిగమపమధానిస.

అవరోహణ:—సనిధపమగామరీగరిస.

(2) ఆరోహణమందు మాత్రమే స్వరములు వక్రగతిగా పోవు రాగములు.

ఉదాహరణ:—ఆనందభైరవి. } ఆ:—సరిగమపధపనిస
అవ:—సనిధపమగరిస.

(3) అవరోహణమందు మాత్రమే స్వరములు వక్రగతిగా పోవురాగములు.

ఉదాహరణ:—శ్రీరాగము. } ఆ:—సరిమపనిస
అవ:—సనిపదనిపమరిగరిస.

(3) ఉపాంగరాగములు:—అనగా సరిగా మేళకర్త రాగము లోని స్వరములను మాత్రమే కలిగియుండి యేవిధమైన అన్యస్వర

మును బొందకయుండు జన్యరాగములకు ఉపాంగరాగములని పేరు.

ఉదాహరణ:—1. ధన్యాసి. 2 ఆరభిరాగములు.

అన్యస్వరము:—ఒకరాగమందు వాడబడకూడని స్వరము కర్తకీగాను విద్వాంసులచే సాంప్రదాయసిద్ధముగా వాడబడు స్వరమునకే అన్యస్వరమని పేరు.

(4) భాషాంగరాగములు:—తమ మేళకర్త రాగములలోని స్వరములను గలిగియుండియు ఒకటిగాని రెండుగాని అన్యస్వరముల నధికముగా గలిగియుండు జన్యరాగములకు భాషాంగరాగములని పేరు.

ఉదాహరణ:—1. బిలహరిరాగము. ఇందు కైశికినిషాద ప్రయోగముండుటచే ఆకైశికినిషాదమన్యస్వరము.

2. భైరవిరాగము. ఈరాగములో ఆరోహణమందు చతుశ్శ్రుతి ధైవతము అన్యస్వరము.

జన్యరాగములు మఱిమూడు విధములుగకూడ గానవగును. అవి 1. నిషాదాంత్యరాగములు 2. ధైవతాంత్యరాగములు 3. పంచమాంత్యరాగములు-అనిమూడు విధములు.

1. నిషాదాంత్యరాగములు:—కొన్నిరాగములు మధ్యస్థాయిలోనినిషాదము వరకేపాడబడుచున్నవి. ఇట్టిరాగములకు నిషాదాంత్యరాగములని పేరు.

ఉదాహరణ:- నాదనామక్రియ { ఆ:- సరిగమపధని / అవ:- నిధపమగరిసని }

15. మాయామాళవగౌళజన్యం.

2. ధైవతాంత్యరాగములు:—ఈరాగములలో హెచ్చుస్వరము మధ్యస్థాయిలోని ధైవతము. ఇందుమూలమున ధైవతాంత్యరాగములని పేరు.

ఉదాహరణ:—కురంజిరాగము } ఆ:-సనిసరిగమపధ
29. ధీరశంకరాభరణజన్యం } అవ:-ధపమగరిసనిస

3. పంచమాంత్యరాగములు:—ఇట్టిరాగములలో హెచ్చుస్వరము మధ్యస్థాయి పంచమముగాన వీనికి పంచమాంత్యరాగములని పేరు.

ఉదాహరణ:- నవరోజురాగము } ఆ. పధనిసరిగమప
29. ధీరశంకరాభరణజన్యం } అవ:-మగరిసనిధప ॥

పూర్వకాలమునుండియు దేశీయరాగములు మఱిమూడువిధములుగ విభజింపబడియున్నవి.

అవి. 1. శుద్ధరాగములు 2. ఛాయాలగ లేక సాలగరాగములు 3. సంకీర్ణ లేక సంకర లేక మిశ్రరాగములు.

1. శుద్ధరాగములు:—ఈరాగములు అన్యస్వరముల కెంతమాత్రము తావీయక జనకరాగములో జెప్పబడిన సప్తస్వరములను గాని లేక కొన్నిస్వరములు లోపించిగాని అరోహణావరోహణములందుగలిగియుండును. అందుచే వీనికి శుద్ధరాగములనిపేరు.

ఉదాహరణ:—మాయామాళవగౌళ, మేచకల్యాణి, మోహన, హంసధ్వని, మధ్యమావతి, శ్రీరంజని మొదలగునవి శుద్ధరాగములు.

2. ఛాయాలగ లేక సాలగరాగములు:— మేళకర్తరాగముల లక్షణములనేగాక ఇతరరాగలక్షణముల ననగా అన్యస్వరములను గలిగియుండుటచే నిట్టిరాగములకు ఛాయాలగ లేక సాలగరాగములని పేరు.

ఉదాహరణ:—సారంగ, కాంభోజి, ముఖారి, భైరవి మొదలగునవి ఛాయాలగ లేక సాలగరాగములనబడును.

3. సంకీర్ణ లేక సంకర లేక మిశ్రరాగములు:—ఏరాగములలో వికృతిస్వరములైన రిగమధని యనుస్వరములలో రెండేసిరకములను

అనగా కోమల, తీవ్రరూపముల రెంటిని గలిగియుండునో అట్టిరాగ ములు సంకీర్ణ లేక సంకర లేక మిశ్రరాగము లనబడును. అనగా శుద్ధమును ఛాయాలగమును గల అనేకరాగఛాయలను గలిగియుండి రంజకముగా నుండును.

ఉదాహరణ:—అహిరి, దేశ్యకాఫి, జుజావంతి మొదలగునవి.

రాగములు త్రివిధములు (మఱియొకవిధము.)

రాగములు 1. ఘనరాగములనియు 2. రక్తిలేక నయరాగము లనియు 3. దేశ్యరాగములనియు మూడుతరగతులుగా విభజింప బడినవి.

1. ఘనరాగములు:—నాభితానముచే, ఘనముగాజేయబడు గానక్రియను గలిగి యుద్ధరంగమందలి మహాశూరునిబోలి గాంభీర్య ముగానుండు రాగము ఘనరాగమనబడును. పూర్వాచార్యులు పది రాగములు మాత్రమే ఘనరాగములని ఎంచియున్నారు.

అవి:—1. నాట 2. గౌళ 3. వరాళి 4. ఆరభి 5. శ్రీరాగము 6. కేదార 7 నారాయణగౌళ 8. రీతిగౌళ 9. సారంగనాట 10. భౌళి- యీరాగములు పదిన్ని ఘనరాగములు.

2. నయలేక రక్తిరాగములు:—వినువారి మనస్సును విశేష ముగ రంజింపజేయు రాగమునకు నయరాగమనియు, రక్తిరాగమని యు, మార్గరాగమనియు పేరు.

ఘనరాగ దేశ్యరాగములుగాక దక్కినవన్నియు నయరాగ ములు.

ఉ॥ తోడి, శంకరాభరణము మొదలగునవి.

3. దేశ్యరాగములు:— ఉత్తరహిందూస్థాన సంగీతమునుండి స్వీకరింపబడిన కొన్నిరాగకళలతో స్ఫురించురాగములకు దేశ్యరాగ ములని పేరు.

ఉ॥ ఫరజు, ఖమాసు, కాఫి, దర్బారు మొదలగు రాగములు దేశ్యరాగము లనబడును.

# రాగవిభాగపట్టిక




7

1. రాగాంగరాగము;—అనగా జనకరాగము లేక మేళకర్త రాగము.

2. ఉపాంగరాగము:—జనకరాగములోని స్వరములనే కలిగియుండి అన్యస్వరములకు ఎంతమాత్రము తావీయదు.

3. భాషాంగరాగము:—జనకరాగముయొక్క స్వరములనే గాక అన్యస్వరములనుగూడ కలిగియుండునది.

4. క్రియాంగరాగము:—వినువారి ఇంద్రియముల కుత్సాహమును ఆవేశమును కలిగించు రాగము క్రియాంగరాగ మనబడును. యుద్ధము చేయునపుడు వీరులను ప్రోత్సహించి ఆవేశపరులగ జేయుటకు వాడబడు రాగములు క్రియాంగరాగములు.

## జన్యరాగముల వివరణపట్టిక.



## రాగము—దాని లక్షణములు.

ప్రతిరాగమునకు దశవిధలక్షణములుగలవు.

1. గ్రహము 2. అంశము 3 మంద్రము 4 తారము 5. న్యాసము 6. అపన్యాసము 7. సన్యాసము 8. విన్యాసము 9. బహుత్వము 10 అల్పత్వము—అను పదిలక్షణముల రాగము గలిగియుండునని మతంగాదిమునులచే జెప్పబడియున్నది.

1. గ్రహము:—అనగా గ్రహించుట. రాగము పాడునపుడు ఆరాగము ఏస్వరముతో ఎత్తుగడ చేయబడునో అట్టిస్వరమునకే గ్రహమనియు, గ్రహస్వరమనియు పేరు. ఒకరాగము గ్రహస్వరమేదైనప్పటికిని షడ్జస్వరస్థానముతోనే ఏరాగమునైనను ప్రారంభించుట సాంప్రదాయము.

2. అంశము:—ఒకరాగము పాడునపుడు ఆరాగఛాయను జూపి రంజింపజేయుటకు మాటిమాటికి వాడబడునదియు, రాజవలె ప్రాముఖ్యముగనుండునదియునగు స్వరమునకే అంశస్వరమనియు, జీవస్వరమనియు, రాగఛాయాస్వరమనియు, పేరు.

3. మంద్రము:—ఒక రాగమును తగ్గు స్వరములలో పాడుటయే మంద్రమగును. అనగా మంద్రస్థాయిలో పాడుట. దీనినే మంద్రగతియనియు చెప్పుదురు.

4. తారము:—రాగమును ఉచ్ఛస్థాయి స్వరములతో అనగా ఉచ్ఛస్వరముతో పాడుట. దీనినే తారగతియందురు.

5. న్యాసము:—రాగమును పాడి ముగించు స్వరము న్యాసమనియు, న్యాస స్వరమనియు చెప్పబడుచున్నది.

6. అపన్యాసము:—రాగమును పాడునపుడు మధ్య మధ్య ముగించు స్వరము అపన్యాసమనబడును. ఇట్లు పాడుటలో సన్యాస విన్యాసములు లీనమై యున్నవని భరతముని చెప్పుచున్నాడు.

7. సన్న్యాసము:—రాగమును పాడునపుడు పలుఖండములు విభజించి ఒక్కొక్కఖండమును ముగించు స్వరము సన్న్యాసమనబడును.

8. విన్న్యాసము:—రాగమును పాడునపుడు దానిఖండముల అవయవములుగా నేర్పడు స్వరము విన్న్యాస మనబడును.

9. బహుత్వము:—రాగముపాడునపుడు ఒకేస్వరమును మాటి మాటికి గ్రహించిపాడుట బహుత్వమనబడును. అది 1. అలంఘనమని యు. - అభ్యాసమనియు రెండువిధములు.

(1) అలంఘనము అనగా ఒక స్వరమును విడువకుండ పాడుట.

(2) అభ్యాసము అనగా ఒకస్వరమును కొంచెము ఎడమిచ్చి మాటి మాటికి ఉచ్చరించుట.

10. అల్పత్వము:—రాగమును పాడునపుడు ఒకస్వరమును అధికముగా నుచ్చరింపకుండుట అల్పత్వమగును. అది. 1. లంఘనము 2. అనభ్యాసము అని రెండువిధములు.

(1) లంఘనము అనగా పాడునపుడు ఒకస్వరమును బొత్తిగా ఉచ్చరింపక విడిచి పైస్వరమునకు దాటుట.

(2) అనభ్యాసము అనగా రాగముపాడునపుడు ఒకస్వరమును మాటిమాటికి ఉచ్చరింపక ఏదైన నొకసమయమున కొద్దిగా నుచ్చరించుట.

## రాగాలాపనపద్ధతి.

ఆలాపనము లేక ఆలప్తి:—అనగా వృద్ధిచేయుట లేక విస్తరించుట. రాగమును వృద్ధిచేసి పాడుట రాగాలాపనము. ఆలాపనచేయుటలో మొదటిది ఆక్షిప్తిక లేక ఆయుత్తము అని చెప్పబడుచున్నది. అనగా రాగమును పాడుటలోగల ప్రథమయత్నము. ఆక్షిప్తిక అనగా ముందుగా విసరుట. ఆయుత్తము అనగా ప్రథమయత్నము.

బాలురు వృద్ధినొందుటకు ఆహారము నెట్లపేక్షించి గ్రహించి వృద్ధినొందుచున్నారో ఆవిధముగానే రాగము వృద్ధినొందుటకు ఆక్షిప్తికను అపేక్షించుచున్నది. కాబట్టి రాగమును పాడునపుడు ప్రారంభమందు మధ్యస్థాయి షడ్జమును ఆక్షిప్తికగా గ్రహించి మందస్థాయిలోను, పిమ్మట మధ్యస్థాయి రిషభగాంధారములలోను, అటుపిమ్మట తారస్థాయి రిషభ, గాంధార, మధ్యమ, పంచమములదాక నొకసారి పాడుకొనిపోయి తిరిగి మధ్యస్థాయి షడ్జమములో ముగించవలెను. ఇట్లు ప్రథమమున పైకిపోయి క్రిందికి వచ్చుటకే ఆక్షిప్తికయనియు ఆయిత్తమనియు చెప్పబడుచున్నది. అనగా మధ్యషడ్జమునుండి ప్రారంభించి మొదట నొకసారి సంక్షేపముగ రాగమురు మూడుస్థాయిలందును పాడి మధ్యషడ్జములోనే ముగించుట. ఇదిరాగాలాపమునకు మొదటి ప్రయత్నము.

అటుపిమ్మట ఆక్షిప్తికానంతరము చేయు రాగాలాపనమునకు మొదటి 'రాగవర్ధని' యనబడును. అరవములో 'ఎడుప్పు' అందురు. ఎడుప్పు అనగా ఎత్తుట. రాగవర్ధనియనగా రాగమును వృద్ధిచేయుట యని యర్థము. ఇది నాలుగు రకములు. (1) ప్రథమరాగ వర్ధని (1) ద్వితీయ రాగవర్ధని (3) తృతీయ రాగవర్ధని (4) చతుర్థ రాగవర్ధని యని నాలుగురకములు. ఈరాగవర్ధనులను ముగించు క్రియలకు విదారులు లేక ముక్తాయిలు అనిపేరు. రాగవర్ధనులవలెనే విదారులు కూడ నాలుగురకములు. (1) ప్రథమ విదారి (2) ద్వితీయ విదారి (3) తృతీయ విదారి (4) చతుర్థవిదారి. విదారి అనగా చీల్చుట యని యర్థము.

(1) ప్రథమరాగవర్ధని లేక ఎడుప్పు-ప్రథమవిదారి లేక ముక్తాయి.

రాగాలాపనమందు ఆక్షిప్తిక కాగానే ప్రథమరాగవర్ధని చేయవలయును. అదెట్లన మధ్యస్థాయి షడ్జమునుండిప్రారంభించి రాగమును

పెంపుచేయు పనిని ముందు మంద్రస్థాయి యందును తరువాత మధ్యస్థాయి యందును రాగాలాపన చేయవలెను ఇట్లు చేయుటలో స్వరములను గమక భేదములతోబట్టి తగినటువంటి వర్ణాలంకారములనుపయోగించి విలంబకాలమే (అనగా చౌక) ప్రధానముగా గొని మధ్య మధ్య ద్రుతకాల మధ్యమ కాలములు నిమిడించి రాగాలాపన సేయవలెను. రాగస్వరూపము బాగా వెల్లడించుటకు పొడిగించవలసిన స్వరముల పొడిగించి, తొలగింపవలసిన స్వరముల తొలగించుచు, బహుత్వమీయగల స్వరములకు అల్పత్వమీయక, అల్పత్వమీయగల వానికి బహుత్వమీయక, ఆరోహణావరోహణాదులందు వక్రగతిని బోవు స్వరములు వక్రముగానే బట్టి రాగఛాయను జెఱచు వివాది స్వరముల బట్టక, ఒకవేళ బట్టినవానిని గమకములచే వంచించి రంజకముచేసి వీలైన అన్యరాగస్వరములచే రంజింపజేసి పిమ్మట ద్రుతకాలమున పాడి తారస్థాయిచేరి క్రమ్మరతిరిగి క్రమప్రకారము మధ్యస్థాయి షడ్జమునకు చీల్చుకొని రావలెను. ఇట్లుతిరిగి మధ్యషడ్జమునకు చీల్చుకొని వచ్చుటకే విదారియనియు లేక ముక్తాయయనియు పేరు. ఇదియే ప్రథమవిదారి లేక ముక్తాయి.

(2) ద్వితీయరాగవర్ధని—ద్వితీయవిదారి:—ఇదియు ప్రథమ రాగవర్ధనివలెనే ప్రారంభించి ముఖ్యముగా మధ్యస్థాయియందును పిమ్మట తారస్థాయి పంచమమువరకును అనేకవిచిత్ర కల్పనలతో గమక వర్ణాలంకారములతో నొప్పారునట్లు చేసి పిమ్మట తారస్థాయి నుండి మధ్యషడ్జమునకు క్రమముగా చీల్చుకొనివచ్చి రెండవరాగవర్ధనిని రెండవవిదారిచే ముగింపుచేయవలెను.

(3) తృతీయరాగవర్ధని- తృతీయవిదారి:—ఇందును పైరాగవర్ధనివలెనే ప్రారంభించి ముఖ్యముగా తారస్థాయియందు పనిచేసి మధ్యషడ్జముకు చీల్చుకొనివచ్చి మూడవరాగవర్ధనిని మూడవవిదారిచే ముగింపుచేయవలెను.

(4) చతుర్థరాగవర్ధని- చతుర్థవిదారి:—ఇదియు రెండవమూడవ రాగవర్ధనులవలెనే రాగసంచారము చేయుచు స్వల్పకాలములోనే విశేషముగ మూర్ఛనాదులచే ప్రస్తరించి పనిచేసి నాల్గవవిదారిచే ముగింపుచేసి మధ్యషడ్జమున నిలుపవలెను.

N. B. పైజెప్పిన రాగవర్ధనుల ప్రకారము రాగాలాపను చేయవలసియున్నను కాలానుగుణ్యముగ కొందరు రెండురాగవర్ధనులందే తారస్థాయి స్వరములను అంత ఇమిడించి పనిచేసి రాగమును ముగింపుచేయుటయుకలదు.

స్థాయిసంచారక్రమము:—రాగాలాపన చేయుటలో స్థాయిసంచారక్రమము రెండువిధములుగానున్నది. అవి (1) ఆరోహణాస్థాయిసంచారము (2) అవరోహణాస్థాయి సంచారము అని రెండువిధములు:

(1) ఆరోహణ స్థాయి సంచారము:—స్వరసంచారము చేయునపుడు ఒక స్వరమునందు ప్రారంభించి సంచరించి తిరిగి ఆస్వరమునందే ముగించితే ఆస్వరమునకు స్థాయియనిపేరు. ఆరోహణాస్థాయిసంచారము తొమ్మిది విధములు. అవియెవ్వియనిన:—(1) ప్రథమమున మధ్యషడ్జమును గ్రహించి స్థాయిగ నేర్పరచుకొని దానిపై స్వరములనంటక మంద్రస్థాయి స్వరములందును క్రమేపి మంద్రషడ్జము వరకు పనిచేసి తిరిగి మధ్య షడ్జమందు వచ్చి నిలిపి తిరిగి మధ్యషడ్జము నుండి మంద్రషడ్జమువరకును తిరిగి మధ్యషడ్జమును చేరుట ఇటుల రెండుసార్లు సంచరించిన ఇది మధ్య షడ్జస్థాయి ఆలాపన యనబడును. (1) అటుపిమ్మట మధ్యస్థాయి రిషభమును స్థాయిగా జేసికొని దానిపై స్వరముల నంటక మంద్రస్థాయి రిషభమువరకును సంచరించి పైవిధముననే రెండుసార్లు సంచారముచేసి మధ్య రిషభమందు న్యాసము చేయవలెను. (3) ఇటులనే మధ్యస్థాయి గాంధారమును స్థాయిగా జేసికొని పైస్వరముల నంటక మంద్రస్థాయి గాంధారమువరకు రెండుసార్లు

సంచారముచేసి తిరిగి మధ్యస్థాయి గాంధారమందు న్యాసము చేయవలెను (అనగాముగించవలెను.) ఈప్రకారమే మధ్యస్థాయి (4) మధ్యమ (5) పంచమ (6) దైవత (7) నిషాద (8) తారషడ్జమములను స్థాయిగా జేసికొని పైస్వరముల నంటక దిగువనే రెం.డేసి సార్లు ప్రస్తరించి తిరిగి ఆయాస్థాయిలందే న్యాసము చేయవలెను. ఇదియే ఆరోహణ స్థాయి సంచారక్రమము.

(2) అవరోహణ స్థాయి సంచార క్రమము:—ఇదియును 8 విధములు. ఆరోహణ స్థాయి సంచారములలో ఆఖరున జెప్పబడిన 1) తారషడ్జమును స్థాయిగా జేసికొని దానిక్రింది స్వరముల నంటక గాయకుని శక్తికొలది అతితార స్థాయి షడ్జమువరకు రెండుసార్లు సంచరించి తిరిగి వచ్చి తారషడ్జములో ముగించవలెను. (2) పిమ్మట మధ్యస్థాయి నిషాదమును స్థాయిగా గొని దాని దిగువ స్వరముల నంటక తారస్థాయి నిషాదమువరకు రెండుసార్లు సంచారముచేసి మధ్యస్థాయి నిషాదమందే ముగించవలెను. ఈ ప్రకారముగానే (3) మధ్యధైవతము (4) పంచమము (5) మధ్యమము (6) గాంధారము (7) రిషభము (8) మధ్యషడ్జమము—వీనిని వరుసగా నొక్కొక దానిని స్థాయిగాజేసికొని దానిదిగువ స్వరముల నంటక దాని పైస్థాయి అదే స్వరమువరకే రెండేసిసార్లు సంచారముచేసి ఆ స్థాయిస్వరమందే ముగింపుచేయవలెను. యిదియే అవరోహణ స్థాయి సంచారక్రమము.

మఱియు ఆరోహణస్థాయి సంచారముచేయునపుడు ఆయాస్థాయి స్వరములకు మీదనుండు స్వరము నెంతమాత్రము నుపయోగింపకూడదు. అవరోహణస్థాయి సంచారముచేయునపుడు ఆయాస్థాయి స్వరములకు దిగువనుండు స్వరముల నెంతమాత్రము వాడకూడదు. మఱియు అవరోహణస్థాయి సంచారముచేయునపుడు ద్రుతకాలములోనే పాడవలెను. రాగము పాడునపుడు వర్జ్యస్వరముల దొలగించి

ఆరోహణావరోహణ స్వరముల ననుసరించి పాడుచు స్వరముల బహుత్వ, అల్పత్వ, దీర్ఘ, హ్రస్వముల గమనించి గమకవరేసలతో నానావిధవర్ణాలంకారములచే రాగమును రంజకముగాజేసి వినువారి మనస్సులకరగించి మోహితుల జేయవలెను.

మకరిణి: - రాగరంజకమైన అంశ లేక జీవస్వరమును స్థాయిస్వరముగాజేసికొని ఆస్థాయియందు కొంత అల్పముగాపాడి యేదైన నొక స్వరమందు ముగింపుజేసి, తిరిగి ఆలాపనముచేసి మొదటిస్థాయి స్వరమునకే నిలుపవలెను. ఈప్రకారము మూడుసార్లు ఆలాపనము చేసి నాల్గవసారి ఆలాపనయందు మంద్రమునుండి తారమువరకు సంచరించి మధ్యషడ్జమున ఆలాపన ముగింపుచేయవలెను. ఇట్లు రాగము నుపాడుటకే భరతముని 'మకరిణి' యని జెప్పియున్నాడు.

తానవివరము:—రాగాలాపన జేయునపుడు 'తానంతానంతా' అని ఆలాపించవలెనేగాని వేఱుశబ్దము లుచ్చరింపగూడదని పూర్వాచార్యులు చెప్పియున్నారు. 'తానం, తానం' అని పాడునపుడు అకార అంకారాదుల జేర్చి దీర్ఘముగా బాడుట సాంప్రదాయముగానున్నది. మధ్యకాలములో రాగమును పాడుటయే 'తాన' మనబడును. అయితే విళంబకాలమునే స్థాయిగా జేసికొని మధ్యమధ్య ద్రుతకాలముగా ఆలాపింపవలెను. ద్రుతకాలముగా పాడుటకే 'ఘనము' పాడుటయని పూర్వాచార్యులు సెప్పియున్నారు. తానం తానం పాడినపిదప చివరకు 'అనంతా అనంతా' యను శబ్దములుగా పరిణమించి పరమేశ్వరుని స్తుతించుటయగుచున్నది.

ఠాయవివరము:— ఠాయము అనగా నేదైన నొకస్వరమును స్థాయిగాగొనుట. రాగాలాపన జేయునపుడు ఆయారాగముల ననుసరించి యేదైన నొకస్వరమును స్థాయిగా నేర్పరచికొని దానిదిగువ స్వరము లందు రాగలక్షణము సంచరించి మధ్యషడ్జమందు ముగించి;

(1) అష్టాయికి పైన ఆరోహణక్రమములో ఒకటి, రెండు, మూడు, నాలుగుస్వరముల క్రమముగా నొక్కొకదానిని జేర్చుకొనుచు సంచారముచేసి మధ్యషడ్జమందే న్యాసము చేయింపవలెను. పిమ్మట (2) అవరోహణక్రమముగానే అనాల్పవస్వరమును స్థాయిగా జేసికొని తానము ప్రారంభించి దానిక్రిందిస్వరముల నుపయోగింపక ఆస్వరమందును దానిపై స్వరములందును రాగాలాపన జేసి మధ్యషడ్జమందే న్యాసము చేయవలెను. ఇటులు స్థాయికి మూడవ, రెండవ, మొదటిస్వరములందు క్రమముగా నొక్కొక స్వరము నెత్తుకొని సంచారముచేసి మధ్యషడ్జమందే ముగింపులు సేయవలెను. ఈరీతిని అష్ట (8) తానములుపాడి స్థాయిస్వరమును మరల గ్రహించి కొంచమాలాపించి తారస్థాయినుండి చీల్చుకొని (విదారించుకొని) వచ్చి మధ్యషడ్జమందు నిలుపవలెను. ఇటుల పాడుటకే ఠాయమని వెంకటమఖి తమ చతుర్దండి ప్రకాశికయను గ్రంధములో చెప్పియుండిరి.

## ౹విషయములు.

1. వాది 2. సంవాది 3. వివాది 4. అనువాది:— స్వరముల న్నియు నాలుగుతరగతులుగా విభజింపబడినవి. అవి 1. వాది 2. సంవాది 3. వివాది 4. అనువాది— అనునవి.

1. వాది:—ఒకరాగమునందు మాటిమాటికి నుపయోగింపబడు అంశస్వరములేక జీవస్వరము వాదియనబడును. ఈవాదిస్వరము స్వరములలోకెల్ల ప్రధానమైనది గనుక రాజుతో బోల్చదగియుండును. వాది స్వరమన్నను, అంశస్వరమన్నను, జీవస్వరమన్నను ఒక్కటే. ఇది స్వరములకన్నిటికి రాజుగానుండును.

2. సంవాది:—రెండుస్వరములకు నడుమ యెనిమిదిగాని పండ్రెండుగాని శృతులున్నయెడల ఆరెండు స్వరములును బరస్పరము

సంవాదులనబడును. ఆసంవాది రాజైన వాదిస్వరమునకు మంత్రివలె నుండును.

ఉదాహరణ:—షడ్జము శుద్ధమధ్యమము (స-మ), షడ్జము పంచమము (స-ప), శుద్ధరిషభము శుద్ధధైవతము (రి-ధ), శుద్ధగాంధారము శుద్ధనిషాదము (శుగ-శుని) సంవాది స్వరములు. మఱియు సాధారణ గాంధారము కైశికీనిషాదము ($గ_2$-$ని_2$), అంతరగాంధారము కాకలి నిషాదము ($గ_3$-$ని_3$), శుద్ధరిషభము ప్రతిమధ్యమము ($రి_1$-$మ_2$) సంవాదిస్వరములు.

* కాని శుద్ధమధ్యమమునకు శుద్ధనిషాదమునకు మధ్య తొమ్మిది శృతులున్నను ఇవి సంవాదిస్వరములు కానేరవు.

3. వివాది:—రెండుస్వరములకునడుమ ఒక్క శృతి మాత్రమే యున్న యెడల ఆరెండుస్వరములును పరస్పరము వివాదిస్వరములగును. వివాదిస్వరము శత్రువును బోలియుండును.

ఉదాహరణ:—శుద్ధస్వరములలో (రి-గ) - (ధ-ని) ఇవి పరస్పరము వివాదులగును.

వికృతిస్వరములలో:—(1) సాధారణగాంధారము లేక షట్ఛ్రుతి ఋషభ అంతరగాంధారములును, (2) కైశికినిషాదము లేక షట్ఛ్రుతి ధైవత కాకలీనిషాదములును- ఇవి పరస్పరము అనగా నొకదానికొకటి వివాదులని చెప్పబడుచున్నది.

4. అనువాది:—పైనజెప్పినవాది, సంవాది, వివాదిస్వరములుగాక తక్కినవన్నియు అనువాదిస్వరము లనబడును. ఈ అనువాదిస్వరములు పనిచేయు నౌకరులవలె నుండును.

శుద్ధస్వరములు:—1 షడ్జ 2 శుద్ధరిషభ 3 శుద్ధగాంధార 4 శుద్ధమధ్యమ 5 పంచమ 6 శుద్ధధైవత 7. శుద్ధనిషాదములు శుద్ధస్వరము లనబడును. వీనినే ప్రకృతిస్వరములనియు అందురు.

వికృతిస్వరములు:—1. చతుశ్రుతిరిషభ 2. షట్ఛ్రుతి రిషభ 3. సాధారణగాంధార 4. అంతరగాంధార 5. ప్రతి మధ్యమ 6. చతుశ్రుతిధైవత 7. షట్ఛ్రుతిధైవత 8. కైశికినిషాద 9. కాకలీనిషాద ములు వికృతిస్వరములనబడును.

N. B:— ఇప్పటికాలమున రాగములకు ప్రాచీన కాలమందు వలె దశవిధరాగలక్షణము లేక గ్రహ, అంశ, న్యాస అను మూడు లక్షణములను మాత్రమే కలవని వెంకటమఖిగారు చెప్పియున్నారు.

(1) గ్రహము:—అనగా ఏస్వరమునుండి రాగము ప్రారంభమగునో ఆస్వరమునకు గ్రహమనిపేరు.

(2) అంశ:—రాగముయొక్క స్వరూపమును బాగుగ కనపరచుటకు మాటిమాటికి నుచ్చరింపబడి ప్రధానమును వహించు స్వరమునకే అంశయనిపేరు.

(3) న్యాస:—రాగమును పాడిపాడి ఆఖరున ఏస్వరమందు ముగింపబడుచున్నదో దానికి న్యాస అనిపేరు.

# మేళకర్తజన్యరాగస్కంధము.

## 72. మేళకర్తరాగము లేర్పడువిధము.

సప్తస్వరముల శుద్ధ లేక ప్రకృతి వికృతిభేదముల ననుసరించి ప్రస్తరించుటవలన మేళకర్తలు డెబ్బదిరెండుగా నేర్పడుచున్నవి. ఈ డెబ్బదిరెండు మేళములకంటె అధికముగాగాని తక్కువగాగాని చేయుట కొంతమాత్రము వీలులేదు.

సప్తస్వరములలో పూర్వాంగము 'సరిగమ' యను స్వరములు. ఉత్తరాంగము 'పధని' యను స్వరములు. ఈపూర్వాంగ ఉత్తరాంగములైన సప్తస్వరములలోను శుద్ధస్వరములైన 1. షడ్జ 2. శుద్ధరిషభ

3. శుద్ధగాంధార 4. శుద్ధమధ్యమ 5. పంచమ 6 శుద్ధధైవత 7. శుద్ధ నిషాదముల చేరికవలన నేర్పడునది ఒకమేళము. ఈవిధముగానే పూర్వాంగములోని స్వరభేదములచే ఉత్తరాంగములోని స్వరభేదములను ప్రస్తరించినయెడల ఆ (విధములైన మేళకర్తరాగములేర్పడుచున్నవి. అదెట్లనిన:-

| | | | |
|---|---|---|---|
| 1. స-శు.రి-శు.గాం-శు మ | పం శు ధై-శు ని చేరికచే | 1. వ. | మేళము. |
| | పం-శు.ధై-కై ని ,, | 2 వ. | మేళము. |
| | పం-శు.ధై-కా.ని ,, | 3. వ. | మేళము. |
| | పం-చ.ధై-కై.ని ,, | 4. వ. | మేళము. |
| | పం-చ.ధై-కా.ని ,, | 5. వ. | మేళము. |
| | పం-ష ధై-కా.ని ,, | 6. వ. | మేళము |

ఇటులనే.

| | | | | |
|---|---|---|---|---|
| 2. షడ్జ-శు రి-సా గాం-శు మ- | ,, | ,, | 6 | మేళములు. |
| 3. షడ్జ-శు.రి-అం.గాం-శు.మ- | ,, | ,, | 6 | మేళములు. |
| 4. షడ్జ-చ.రి-సా.గాం-శు.మ- | ,, | ,, | 6 | ,, |
| 5. షడ్జ-చ.రి-అం గాం-శు.మ- | ,, | ,, | 6 | ,, |
| 6. షడ్జ-ష రి-అం.గాం-శు.మ- | ,, | ,, | 6 | ,, |

శుద్ధమధ్యమరాగములు మొత్తం. 36

యేర్పడుచున్నవి. ఈలాగుననే పై వానిలో శుద్ధమధ్యమునకు బదులు ప్రతిమధ్యము తజ్ఞమూ చేసిన ఇంకొక 36 మేళకర్త లేర్పడి మొత్తము 36 + 36 = 72 మేళములగుచున్నవి.

ఒక్కొక మేళకర్తనుండి జన్యరాగము లెటుల పుట్టుచున్న వనగా:—

| | | |
|---|---|---|
| సంపూర్ణ సంపూర్ణభేదములు. | | 1 |
| షాడవసంపూర్ణ | ,, | 6 |
| సంపూర్ణషాడవ | ,, | 6 |
| ఔడవసంపూర్ణ | ,, | 15 |
| సంపూర్ణఔడవ | ,, | 15 |
| షాడవషాడవ | ,, | 36 |
| ఔడవషాడవ | ,, | 90 |
| షాడవఔడవ | ,, | 90 |
| ఔడవఔడవ | ,, | 225 |
| మొత్తము = | | 484 |

ఒక్కొక మేళకర్త రాగమునుండి 484 జన్యరాగములు పుట్టిన 72 మేళకర్తలనుండి 72 × 484 = 34, 848 జన్యరాగము లేర్పడుచున్నవి. ఈరాగములకు వక్రసంపూర్ణ, వక్రషాడవ, వక్రఔడవ భేదములవలన జన్యరాగము లనంతములగుచున్నవని దెలియనగును.

జన్యరాగములలో శివర్ధని, నవరసకన్నడ మొదలగు కొన్ని రాగములు ఆరోహణమందు నాల్గుస్వరములు మాత్రమే గలిగి యున్నవి.

హుసేని, మాంజి మొదలగు మరికొన్ని జన్యరాగములు ఆరోహణావరోహణముల రెండింటియందును పూర్తిగా సప్తస్వరములను గలిగియున్నవి. ఇట్టిరాగములలో రాగఛాయా స్వరములయొక్కయు, రాగరంజకమైన స్వరములయొక్కయు విచిత్రమైన చేరికలచే రాగస్వరూపము బాగుగా జూపబడుచున్నది.

పూర్వకాలమున మనహిందూసంగీత మెక్కువఔన్నత్యమును గనినరోజులలో కొందరు విద్వాంసు లొక్కొక రాగమందు విశేషపరి

శ్రమచేసి పేరుగాంచియున్నారని దెలియుచున్నది. అట్టివారి నామధేయమారాగముతోనే ప్రారంభించుచున్నది. వారిలో కొందరు (1) తోడి సీతారామయ్యగారు. వీరు తోడిరాగము నొకప్పుడు 8 దినములు పాడి అందరిని మించిరని తెలియుచున్నది.

(2) నారాయణగౌళకుప్పయ్యారు. వీరు అనేక తానవర్ణముల రచించి కీర్తిగాంచిరి.

(3) శంకరాభరణం నరసయ్యగారు.

(4) దర్బారు శీతారామయ్యగారు.

(5) అఠాణా అప్పయ్యగారు—మొదలైనవారు ఆచంద్రార్క స్థాయిగ పేరుగాంచియున్నారు.

## గ్రామత్రయవివరణము.

కొన్ని కుటుంబములవారు ఒకచోటచేరి నివశించిన గ్రామమెట్లగుచున్నదో అలాగుననే మూర్ఛనయు మూర్ఛనాభేదములును మేళములను సంభవింపజేయుటకు కారణభూతములైన స్వరసమువాయములను జేరి గ్రామమనబడును.

ఇట్టిగ్రామములు మూడుగానున్నవి. (1) గాంధారగ్రామము (2) మధ్యమగ్రామము (3) షడ్జగ్రామము— అని 3 విధములు. వీనికి మొదటిస్వరములు వరుసగా గాంధారము, మధ్యమము, షడ్జమము అయియున్నవి.

(1) గాంధారగ్రామము:—సరిగమపధ-యను స్వరములు మూడేసి శృతులను, నిషాదము మాత్రము నాల్గుశృతులను గలిగియుండును ఇదియే గాంధారగ్రామము. ఈగాంధార గ్రామము మనుజలోకములో వాడబడక స్వర్గలోకమందే ప్రకాశించుచున్నదని నారదుల వారు చెప్పినట్లు శార్ఙ్గదేవుడు తనసంగీతరత్నాకరమను గ్రంథమున జెప్పియున్నాడు.

(2) మధ్యమగ్రామము:—ఈగ్రామమందు పంచమము సొందీ పినియనెడు తనమూడవశ్శృతి స్థానమును బొంది 4, 3, 2, 4, 3, 4, 2 శృతులను క్రమముగా బొందిన సరిగమపధని యను సప్తస్వరముల గలదియగును. ఈమధ్యమగ్రామమున త్రిశృతిపంచమము లక్ష్యమార్గ ముచే వరాళీమధ్యమము (లేక ప్రతిమధ్యమము) అగుచుండుటచే నిదియును గానయోగ్యముగా లేదని 400 సంవత్సరములకు పూర్వమే ఈమధ్యగ్రామము విడువబడినట్లును, షడ్జగ్రామముమాత్రమే గాన యోగ్యమైనట్లును చెప్పబడినది పత్రికాళికయందును- సంగీతపారిజాత మను గ్రంథమందును గూడ జెప్పబడియున్నది.

(3) షడ్జగ్రామము :—ఈ గ్రామమందు పంచమము నాల్గు శృతులతోజేరి 4, 3, 2, 4, 4, 3, 2 శృతులను క్రమముగాబొంది స రి గ మ ప ధ ని యను సప్తస్వరము లగలది యగుచున్నది. ప్రస్తుత ము ఈగ్రామమే గానయోగ్యమై వెలయుచున్నది.

మూర్ఛన :—(అనగా వినువారిని విశ్మృతిజెందునట్లుచేయుట అనగా వినువారిని మోహింపజేయుట యని యర్థము.) క్రమముగా సప్తస్వరములయొక్క ఆరోహణ అవరోహణములు మూర్ఛనయనబడు ను. ఆరోహణయందు షడ్జము మొదలు నిషాదము వరకును అవరోహ ణమందు నిషాదమునుండి షడ్జమువరకును మొదటిమూర్ఛన యగును. ఇటులనే రిషభము మొదలు మీదిస్థాయి షడ్జమువరకును అక్కడినుండి తిరిగి రిషభమువరకును రెండవ మూర్ఛనయగును. ఈప్రకారముగానే మిగత స్వరము లొక్కొకదాని కొక్కొక మూర్ఛన గలుగునని తెలియునది.

| | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|
| 1. | స రి గ మ ప ధ ని | ని ధ ప మ గ రి స |
| 2. | రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి |

| | | |
|---|---|---|
| 3. | గ మ ప ధ ని స రి | రి స ని ధ ప మ గ |
| 4. | మ ప ధ ని స రి గ | గ రి స ని ధ ప మ |
| 5. | ప ధ ని స రి గ మ | మ గ రి స ని ధ ప |
| 6. | ధ ని స రి గ మ ప | ప మ గ రి స ని ధ |
| 7. | ని స రి గ మ ప ధ | ధ ప మ గ రి స ని |

ఇటుల సప్తస్వరములకు సప్త (7) మూర్ఛనలు చొప్పున 72 మేళములకు ఒక్కొకదానికి ఏడేసి మూర్ఛనలుగలవని యని వెంకటమఖిగారు చెప్పుచున్నారు.

తానము :— స్వరములను విస్తరించుట లేక గుణించుట తానమనబడును. తానము రెండు విధములు 1. శుద్ధతానము 2. కూటతానము.

1. శుద్ధతానము :—ఒక్కరాగముమాత్రమే ప్రకాశించునటుల జూపుట శుద్ధతాన మనబడును.

2. కూటతానము :—రెండు రాగములు ప్రకాశించునటుల జూపునది కూటతాన మనబడును. కొందరు భాషాంగరాగస్ఫూర్తిచే గలుగు తానమే కూటతానమని యభిప్రాయపడిరి. కాని యది సరియైనది కాదని కొందరూహించుచున్నారు. వెంకటమఖియును రెండు రాగముల స్ఫురింపజేయు నదియే కూటతానమని చెప్పిరి.

వర్ణము:—గానముయొక్క క్రియయే వర్ణమనబడును. వర్ణము నాలుగువిధములు:— 1. స్థాయి 2. ఆరోహి 3. అవరోహి 4. సంచారి యని 4 విధములు.

(1) స్థాయివర్ణము:—అనగా గానము ఏ స్వరమందు ప్రారంభముగునో అస్వరమందే తిరిగివచ్చి నిలుపబడు క్రియకే స్థాయివర్ణమని పేరు.

ఉదాహరణ :—సాసాసా—సాసాసా—సాసాసా—సగరిస—రిగమపమగరి.

(2) ఆరోహవర్ణము:—ప్రారంభించిన స్వరమునుండి క్రమముగా పైకెక్కుట యనెడి గానక్రియ ఆరోహవర్ణ మనబడును

ఉ:—స రి గ మ—రి గ మ ప—గ మ ప ధ నీ.

(3) అవరోహవర్ణము:—ప్రారంభించిన స్వరమునుండి క్రమముగా క్రిందికి దిగెడి గానక్రియకు అవరోహవర్ణమని పేరు.

ఉ:— శ్రీ ని ధ ప మ గ రీ—ని ధ ప మ గా—ధ ప మ గ రి సా.

(4) సంచారి వర్ణము:—పైనజెప్పబడిన స్థాయి, ఆరోహి అవరోహి వర్ణములు కలయికచే కలుగునట్టి గానక్రియను సంచారి వర్ణమందురు.

ఉ:— స మ గ ని ధా—స ని ధ ప దా—రి మ మ గ రి సా

ఈ కాలమున పైనజెప్పబడిన వర్ణము ధాతువను స్వరములతో జేర్పబడిన మాతువను సాహిత్యములమాత్రము వర్ణమెట్టని కొందరి యభిప్రాయమై యున్నది

అలంకారము :—వర్ణభేదముల ననుసరించి మనోహరముగా నుండునటుల క్రమపద్ధతిని స్వరముల జేర్చుటయే అలంకార మనబడును. గానమునకు అందమును గలుగజేయు దియే అలంకార మనబడును. మఱియు తాళమునుబోధించు రచనకు అలంకారమని పేరు. సరళీస్వరముల బోధించుట కేర్పడిన ఆదితాళమునకు ఝంపటాలంకారము అని పేరు. మిగత అలంకారములు (1) ధృవ (2) మఠ్య (3) రూపక (4) ఝంపె (5) త్రిపుట (6) అట (7) ఏక.

వెంకట మఖి తమ చతుర్దండి ప్రకాశికయందు అలంకారముల నెనిమిదిగా చెప్పుచున్నారు ధృవాది 7 అలంకారములకు మొదట ఝంపటా తాళాలంకారముచేర్చి మొత్తము యెనిమిది అలంకారములుగా చెప్పుచున్నారు.

అహోబలపండితులు తమ సంగీత పారిజాతగ్రంథమందు అలంకారముల ధృవాది సప్తాలంకారములనే చెప్పియున్నారు.

* ఝంపటాలంకారము అనగా చతురశ్రజాతి త్రిపుట లేక ఆది తాళము. లఘువు, రెండు దృతములు. లఘువు నాలుగక్షరములు దృతము రెండక్షరములు గుర్తు | ○ ○ = 4 + 2 + 2 = 8 అక్షరాలు. కాని ప్రస్తుత కాలమున అహోబిలపండితులు విరచించిన సప్త అలంకారములే వాడుకలో నున్నవి. ఇవియే లఘుజాతిభేదము ననుసరించి సూళాది 35 తాళములగుచున్నవి ఇందులో చతురశ్రజాతి త్రిపుటయున్నదిగాన ఝంపటాలంకారమవసరము గాన్పించదు. (సూళ యను శబ్దమునకు గీతమని యర్థము.)

లఘుశేఖరము:—ఇది యొక తాళము. ఇది ఆరక్షరముల తాళము. వీణవాద్యమందే దీని యుపయోగ మెక్కువగ నేటికిని గాన్పించుచున్నది. ఒక లఘువు ఒక దృతముగల తాళము. లఘువు 4 అక్షరములు దృతము రెండక్షరములు. అయితే వైణికులు చతురశ్రజాతి ధృవతాళము వేయుటకు మొదటి అక్షరమున తాళసూచకములు ప్రక్క మీటును, తక్కిన రెండు లఘువుల మొదటి అక్షరము లందు రెండు ప్రక్కమీటుల జేసికొని ధృవతాళము వాయించుటయే దీని యుపయోగము.

గమకములు:—ప్రస్తుతకాలమున గమకములు పదిమాత్రమే యని ఆధునికులు చెప్పుచున్నారు. ప్రాచీనపద్ధతి ననుసరించి గమకములు పదునైదు (15) (వినువారి మనస్సుల రంజింపజేయునట్టుల స్వరముల కదలించి పాడుటయే గమకమనబడును) 1. కంపితము 2. లీనము 3. ఆందోళితము 4. ప్లావితము 5. స్ఫురితము 6. తిరుపము 7. ఆహతము 8. వళి 9. ఉల్లసితము 10. హుంపితము 11. కురుళము 12. త్రిభిన్నము 13. ముద్రితము 14. నామితము 15. మిశ్రితము. అని గమకములు పదునైదు.

# గమకముల వివరము.

1. కంపితము:—ఒక స్వరము నొక యక్షరకాలము కదలించి అట్లు కదలించుటలో దానిమీది స్వరముయొక్క ఛాయరాకుండ చేయుటయే కంపితమనబడును. (కంపితము = కదలింపు)

2. లీనము:—ఒక స్వరమునందే రెండక్షరకాలము నిలిపి కదలించి దానిమీది స్వరముయొక్క ఛాయను రప్పించి లీనము చేయుట యనగా లయముచేయుటయే లీన మనబడును. (లీనము = లయముచేయుట లేక కలుపుట.)

3. ఆందోళితము:—(అనగా ఊగుటయని యర్థము). ఒక స్వరమందు నాలుగక్షరకాలమువరకు కదలించి దానిమీది స్వరము యొక్క ఛాయను రప్పించుట ఆందోళిత మనబడును.

4. ప్లావితము:—ఒకే స్వరమందు పండ్రెండక్షరకాలము కదలించి దానిమీది స్వరముయొక్క ఛాయను రప్పించుటయే ప్లావిత మనబడును. (ప్లావితము = తేలుట)

5. (ఎ) స్ఫురితము:—సస-రిరి మొదలగు ఆరోహణ క్రమమందు జంటస్వరములలో వెనుక స్వరమందు ముప్పాతిక అక్షర కాలము నిలిపి దానినికొట్టి దానిదిగువ స్వరముయొక్క ఛాయను రప్పించుటయే స్ఫురితమనబడును. ఉ:—'సస' యొక్క వెనుక 'స' ను గొట్టి ని ని ను 'సనిస' యగునట్లు చేయుటయే స్ఫురిత మనబడును. (స్ఫురితము = తోచుట లేక చలనము.)

(బి) ప్రత్యాఘాతము:—ససనిని మొదలగు అవరోహణ జంట స్వరములందు రెండవ స్వరమునుగొట్టి దానిమీది స్వరముయొక్క ఛాయవచ్చునట్లు చేయుట ప్రత్యాఘాత మనబడును. ఉ:—స స యొక్క వెనుకటి 'స' ను గొట్టి ససను సరిసయని పలికించుట ప్రత్యాఘాతమనబడును. దీనినే డోలమనియు అందురు. (డోలమన ముగ్గ్యములో నీరు కదలునట్లుండుట.)

(6) త్రిపుచ్ఛము:—ఒక స్వరమందు అరక్షరకాలము నిలిపి

దాని నడిమి దానిమీఁది స్వరముయొక్క ఛాయవచ్చునట్లు చేయుట తిరుపమనబడును. దీనినే నొక్కు అనియు జెప్పుచున్నారు.

7. ఆహతము:—ఇది (ఎ) రవ, (బి) ఖండింపు అని రెండు విధములు.

(ఎ) రవ:—ఒకస్వరమునుండి దిగునపుడు పై స్వరఛాయతో గూడ క్రిందిస్వరమునకు దిగుట ఆహతమనబడును. ఉ:—పమ అని 'ప' నుండి 'మ' కు దిగునపుడు 'పప్మ' యని దిగుట

(బి) ఖండింపు:—ఒక స్వరమునుండి దాని సమీప స్వరము లేకుండగనే క్రిందిస్వరమునకు దిగునపుడు అట్లు ఖండించి విడచిన స్వరముయొక్క ఛాయను గనపరచుటయే ఖండింపు అనబడును. ఉ:—మరి అనునపుడు మగ్రి అనునట్లు చేయుట.

8. వళి:—ఒకస్వరమును సుడియించి పట్టి దానిమీఁది స్వరము యొక్క ఛాయను గలుగజేయుట వళియనబడును.

9. ఉల్లసితము:—అనగా జారు (జారడము) ఇది రెండు విధములు. 1 ఆరోహణ జారు లేక ఎక్కుజారు 2. అవరోహణ జారు లేక దిగుజారు—అని రెండువిధములు.

1. ఎక్కుజారు:—షడ్జమునుండి పంచమమునకు బోవునపుడు షడ్జమందే పంచమముయొక్క నాదము కలిగి రిషభ, గాంధారములను లోన నణగించుకొని పంచమమునకు బోవుటయే ఎక్కుజారు అనబడును. అనగా ఒకస్వరమునుండి పైకిబోవునపుడు ఆరెంటికి నడుమనుండు స్వరముల రాచుకొని వ్యక్తము కాకుండగనే పై స్వరమునకు బోవుట.

2. దిగుజారు:—ఎక్కుజారున కెదురైనజారు. అనగా పైనుండి క్రిందికి అవరోహణ క్రమములో వచ్చుట.

10. హుంపితము: (అనగా 'హుం' అని ధ్వనిని వర్ధిల జేయుట) ఈగమకమును జారువంటిదే. ఒక స్వరమునుండి బయలుదేరినది మొదలు నిలచెవరకు హుంఅనే నాదముతో ఆరోహణ క్రమమందును అవరోహణ క్రమమందునుగూడ గానముచేయుట హుంపితమనబడును.

11. కురుళము:—(కురుళము అనగా ముంగురులుఅనియర్థము) కురుళము రెండువిధములు:—(1) ఒదిగింపు (2) ఒరయిక లేక (ఒరిక)
(1) ఒదిగింపు:—గాత్రపాటలోని జారును బోలియుండును. ఒకస్వరము నుండి దాని సమీప స్వరమునుగాని దాని రెండవ స్వరమునుగాని పలికించుట—ఒదిగింపు అనబడును. ఇది వీణ వాద్యములో నుపయోగము. ఉ:—రిషభ స్వరమందే గాంధారస్వరమునుగాని మధ్యమ స్వరమునుగాని పలుకునట్లు చేయుట.

(2) ఒరయిక:—మీది స్వరమునుండి క్రింది స్వరములకు దిగునపుడు ఒక్కొక్క స్వరమునకు దానిమీది స్వరచ్ఛాయను గనపరచి రాచుకొని దిగుట ఒరయిక లేక ఒరికయని యనబడును. ఉ:—సనిధప యనునపుడు సిస్థధని ప అని పలికించుట ఒరయిక అనబడును.

* నుదుటిమీద బడు ముంగురుల నెటుల చేతితో ప్రక్కలకు తొలగించు కొందురో ఆవిధముగానే స్వరముల నొదిగించి పట్టుటకు ఒదిగింపు అని చెప్పుదురు

12. త్రిభిన్నము:—వీణ వాయించునపుడు మీది 1, 2, 3 తంత్రులను వ్రేళ్ళతో నదిమి కుడిచేతి వ్రేళ్ళతో రంజకమునకై ఒకే సారి మీటుట త్రిభిన్నమనబడును.

13. ముద్రితము:—నోరుమూసికొని పాడునపుడు గలుగు స్వరములయొక్క కదలింపునకు ముద్రితమని పేరు. (ఇది గాత్రపాటలో మాత్రమే.)

14. నామితము:—నాదమును తగ్గించి సూక్ష్మధ్వనితో పాడుటచే గలుగు స్వరముల కదలికకు నామితమని యందురు.

15. మిశ్రితము:—పైనజెప్పబడిన గమకములలో నేవైన రెండు మూడు గమకములు కలసివచ్చునట్లు చేయుటయే మిశ్రిత మనబడును.

ఇప్పటి దశవిధగమకముల నిదివరలో వ్రాయడమైనది. ఈదశ విధగమకముల నవీనులెవరో కల్పించిరని తెలియుచున్నది.

# స్త్రీ పురుష రాగములు.

రాగములు పురుషరాగములనియు స్త్రీరాగములనియు రెండువిధములుగా ప్రాచీనులు నుడివి యున్నారు. వానిని క్రింది పథకమున జూచునది.

| నెం | పురుష రాగములు | అధిదైవతములు | కులములు | వేదములు | రసములు | గుణములు | భార్యలు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | భైరవి | శివుడు | బ్రాహ్మణ | సామ | రౌద్ర | రాజస | దేవక్రియ, మేఘరంజి కురంజి |
| 2 | భూపాలము | విష్ణువు | ,, | ,, | శృంగార | ,, | బిలహరి, మలహరి, భాండి |
| 3 | శ్రీరాగము | సరస్వతి | క్షత్రియ | యజుస్సు | భీభత్స | తామస | ఆంధాళి, భల్లాతి, సాహుళి |
| 4 | ఫలమంజరి | లక్ష్మి | ,, | ,, | కరుణ | ,, | దేశి, ముఖారి, లలిత |
| 5 | వసంత | సూర్యుడు | వైశ్య | ఋక్కు | హాస్య | సాత్విక | రామక్రియ, వరాళి, గౌళ |
| 6 | మాళవము | నారదుడు | ,, | ,, | భయానక | ,, | గుండక్రియ, ఘూర్జరి, బౌళి |
| 7 | బంగాళ | వినాయకుడు | శూద్ర | అథర్వణ | అద్భుత | రాజస | కల్యాణి, ఆహిరి, సావేరి |
| 8 | నాట | తుంబురుడు | ,, | ,, | వీర | ,, | ఘంటారవం, కాంభోజి శంకరాభరణము |

తక్కిన రాగములు శాంతరస ప్రధానములు.

పుత్రరాగములు:—రేగుప్తి, నీలాంబరి, కాఫీ. మందారి, మారువ, సౌరాష్ట్రి, కేదార, తోడి, ధన్యాసి, నారాయణి, గౌరి, వరాళి, బేగడ, యమున, మనోహరి మొదలైనవి.

మిశ్రరాగములు:—భిన్ననామము గలిగియున్నవి.

ఉదాహరణలు:—

1. భైరవి:—ఆనందభైరవి, వసంతభైరవి.
2. వరాళి:—వసంత వరాళి, పున్నాగ వరాళి.
3. కాంభోజి:—యదుకుల కాంభోజి, గుమ్మకాంభోజి.
4. నాట ఛాయానాట, ప్రతాపనాట, సారంగనాట.
5. గౌళ:—రీతి గౌళ, కేదార గౌళ, నారాయణ గౌళ.
6. మల్లారు :—సామంతమల్లారు, చెంచుమల్లారు. గౌడమల్లారు. ఇత్యాదులు మిశ్రరాగము లనబడును.

# రాగముల కాలనిర్ణయము.

(1) ఉదయము 6 గంటలనుండి 9 గంటలవరకు పాడదగినవి. 1. కురంజి, 2. సావేరి, 3. ఘంటారవము, 4. రామక్రియ, 5 బిలహరి, 6. భైరవి, 7. రేగుప్తి 8. యమున, 9. ముఖారి, 10. మలహరి–అను పదిరాగములు.

(2) ఉదయము 9 గంటలనుండి 12 గంటలవరకు పాడదగినవి. 1. శ్రీరాగము 2. మధ్యమావతి 3. మేఘరంజి 4. సారంగ 5. భల్లాతి 6. దేశి 7. నీలాంబరి 8. మంగళదేశిక–అను 8 రాగములు.

(3) పగలు 12 గంటల మొదలు 3 గంటలవరకు పాడదగిన రాగములు. 1. కల్యాణి 2. కాఫీ 3. ఘూర్జరి 4. పూర్వి 5. వసంత 6 శంకరాభరణం 7. మోహన–యనునవి.

(4) మధ్యాహ్నము 3 గం॥ మొదలు సాయంకాలము 6 గం॥ వరకు పాడదగిన రాగములు. 1. హిందోళము 2. సౌరాష్ట్రము 3. నారాయణి 4. తోడి 5. రామక్రి 6. వరాళి 7. పంతువరాళి 8. గౌరి 9. హుసేని 10. లలిత 11. మాళవి-అనునవి.

(5) సాయంకాలము 6 గం॥ మొదలు రాత్రి 9 గం॥ వరకు పాడదగిన రాగములు. 1. కాంభోజి 2. బేగడ 3. శేళావతి 4. సావేరి 5. నాట 6 పున్నాగ-అనునవి.

(6) రాత్రి 9 గం॥ మొదలు 12 గం॥ వరకు పాడదగిన రాగములు. 1. ఆహిరి 2. అసావేరి 3. బౌళి 4 బంగాళా 5. కేదార 6. గుండక్రియ 7. మంగళకైశికి 8. మనోహరి-అనునవి.

(7) రాత్రి 12 గం మొదలు తెల్లవారుజాము 3 గం॥ వరకు పాడదగిన రాగములు. 1. సురటి 2. మంజరి 3. కర్ణాట 4. జోగిని 5. చిత్రవేళ-అనునవి.

(8) తెల్లవారుజాము 3 గం॥ మొదలు ఉదయము 6 గంటల వరకు పాడదగిన రాగములు. 1. భూపాలము 2. దేవగాంధారి 3. దేశాక్షి 4. ధన్యాసి 5 భాంశీ 6. మారువ 7. దేవక్రియ 8. గౌరి 9. మందారి-అనునవి.

# కటపయాది నామేళకర్తల నామముల దెలియు విధము.

పూర్వాచార్యులు 72 మేళకర్తరాగముల నామముల సులభముగా దెలిసికొనుటకు గణితశాస్త్ర పద్ధతిని ఒకసూత్రము నేర్పరచిరి. దానికే (కటపయాది సంఖ్యాపద్ధతియందురు.

1. కాదినవ అనగా క లగాయతు తొమ్మిది అక్షరములు;

2. టాదినవ ,, ట లగాయతు తొమ్మిది అక్షరములు.

3. పాదిపంచ „ ప లగాయతు అయిదక్షరములు.
4. యాద్యష్ట „ య లగాయతు యెనిమిదక్షరములు
సులభముగా దెలియుట కీక్రింది పథకమును బరిశీలించునది.

# కటపయాది సంఖ్యాపథకము.

| కటపయాదిసంఖ్యలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కాదినవ | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| టాదినవ | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| పాదిపంచ | ప | ఫ | బ | భ | మ | | | | | |
| యాద్యష్ట | య | ర | ల | వ | శ | ష | స | హ | | |

"అంకానాంవామతోగతిః" అను సూర్యసిద్ధాంత సూత్రము ననుసరించి పైన జెప్పబడిన కటపయాది సంఖ్యల గుర్తించునపుడు రాగముయొక్క నామాక్షరముల మొదటి రెండక్షరముల మాత్రమే తీసికొని ఆయక్షరముల సంఖ్యలను మొదటవచ్చినప్రకారము లెక్కించక కుడిసంఖ్య యెడమకును, యెడమనుండు సంఖ్యను కుడికిని మార్చుకొనవలెను. అనగా ఒకట్ల స్థానములోని సంఖ్యను పదులస్థానములోనికిని పదులస్థానములోని సంఖ్యను ఒకట్లస్థానము లోనికిని మార్చుకొనినపిమ్మటనే అటులవచ్చిన సంఖ్యనుబట్టి రాగసంఖ్యను దెలియనగును మఱియు ద్విత్వాక్షరము(సంయుక్తాక్షరములు) లు వచ్చుచోట హల్లును వదలిపెట్టి ప్రాణాక్షరమునే ప్రధానముగా దీసికొనవలెను.

ఉదాహరణ :— 'కీరవాణి' అనునప్పుడు కీ (క అను అక్షరమునకు సంబంధించినదిగాన) కాదినవకములో మొదటిఅంకె ఒకటి 1. ర యనునది యాద్యష్టకములో రెండవఅక్షరముగాన 2. 12 పండ్రెండైనది. అయితే సూర్యసిద్ధాంతము ననుసరించి ఒకట్లస్థానములోని 2 ను

పదులస్థానములోనికిని పదులస్థానములోని 1 ని, ఒకట్లస్థానములోనికిని మార్చుకొనవలెను. అప్పుడు 21 (ఇరువదియొకటి) అగును కీరవాణి 21 (ఇరువదియొకటవ) మేళకర్తయని తెలియవలెను.

ఞ, న అను అక్షరములు వచ్చిన (౦) సున్నయని తెలిసికొనవలెను. ఈ సున్న పదులస్థానములో వచ్చినదానికి విలువ లేదు. ఒకట్ల స్థానములోవచ్చిన విలువగలదు.

ఉదాహరణ :—గానమూర్తి-గా అను అక్షరము కాదినవకములో 3 అయినది. న=౦. 30 అయినది. సూర్యసిద్ధాంతమునుబట్టి అంకెలను తిరుగవేసిన ౦ 3 అయినది. పదులస్థానములో సున్నకు విలువలేదు గాన 3 (మూడవ) మేళకర్తయైనది. ఈ ప్రకారమే మిగత రాగము లూహింపదగును.

ఉదాహరణ :—షణ్ముఖప్రియ. షయాద్యష్టములో 6 (ఆరు)ణ్ములో ణు విడిచిపెట్టి మ (మ) నే తీసికొని లెక్కించిన 5 (అయిదు)అయినది. 6 5 సూర్యసిద్ధాంతము ప్రకారము అంకెలను తిరుగవేసిన 5 6 (యాబదియారు) మేళకర్తయైనది.

అయితే పై లెక్కప్రకారము 72 మేళములలోను ఐదు రాగములు మాత్రము చేరుటలేదు.

అవి వెవ్వియనిన:—

కటపయాది సంఖ్యాప్రకారము

| | | | |
|---|---|---|---|
| 1. చక్రవాకము — | 26 మేళము (తప్పు)— | 16 మేళము (రైటు) |
| 2. దివ్యమణి— | 18 ,, | 48 ,, |
| 3. విశ్వంభరి— | 44 ,, | 54 ,, |
| 4. చిత్రాంబరి— | 26 ,, | 66 ,, |
| 5. ఋషభప్రియ— | 60 ,, | 62 ,, |

అయితే పై నాలుగు మేళములలోను ప్రాణాక్షరమును విడిచి పెట్టి మొదటిహల్లును దీసికొనినేగాని సరియైన మేళసంఖ్య వచ్చుట లేదు. 'చక్ర' అనునపుడు ్ర(ర) విడిచి 'క' అనే అక్షరమునే ప్రధానముగా దీసికొనవలెను. ఈలాగుననే

2. దివ్యలో ్య (య) ను విడచి 'వ' నే తీసికొనవలెను.

3. విశ్వంలో ్వం (వం) ను విడచి 'శ' నే తీసికొనవలెను.

4. చిత్రాంలో ్రాం (రాం) ను విడచి 'తా' నే తీసికొనవలెను.

ఇక 5. ఋషభప్రియలో ఋ అనే అక్షరము కటపయాదిలో చేరదుగనుక (౦) సున్న. అయితే ఉచ్చారణలో రు లేక రి అని పలుకుచున్నది గాన రి ష తీసికొనిన 62 అగుచున్నది.

# సంగీతరచనలు—వాని వివరములు.

## (MUSICAL TYPES)

సంగీతరచనలు రెండురకములు.

1. శాస్త్రనియమములుకలవి (టెక్నికల్)

2. శాస్త్రనియమములు లేనివి (నాన్ టెక్నికల్)

1. శాస్త్రనియమములు కలవి :— ఈ రచనలో ధాతువే ప్రధానముగా నుండును. మాతువంత ప్రధానముగాక ధాతువును బాగుగా జ్ఞాపకముంచుకొనుటకుమాత్ర ముపయోగపడుచున్నది.

ధాతువు :— అనగా సంగీత రచనలలోను స్వరావయము. సంగీతమునకు ఈ స్వరసముదాయములే ప్రధానము.

మాతువు :— అనగా సాహిత్యము. ధాతువులోని ప్రతి స్వరమునకు ఒక సాహిత్యాక్షరముండును. అనగా రచనలోని ధాతువు క్రింద వ్రాయబడు సాహిత్యమునకు మాతువని పేరు.

పైనచెప్పబడిన ధాతు ప్రధానరచనలలో ముఖ్యమైన రచనలు వర్ణములై యున్నవి.

ఇట్టిరచనలలో చేరునవి గీతములు, తిల్లానాలు, అలంకారములు, లక్షణగీతములు. ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క సంగీతశాస్త్రవిషయమును బోధించుచున్నవి. ఇందుకుదాహరణగా :—అలంకారములు కేవలము వివిధతాళములగూర్చి బోధించు చున్నవి. లక్షణగీతములు కేవలము రాగము దాని లక్షణములగూర్చి బోధించునవియైయున్నవి.

1. ఈ టెక్నికల్ సంగీతరచనలు సంగీతశాస్త్రసంబంధమైన జ్ఞానమును మిక్కిలి వృద్ధిచేయుటకు తోడ్పడుచున్నవి.

2. నాన్ టెక్నికల్ రచనలైన కృతులు మొదలైనవి హృదయరంజకములై యున్నవి. ఈ నాన్ టెక్నికల్ రచనల సంగీతము మిగుల మాధుర్యముగా నుండుటయేగాక ధాతుకంటె మాతు (సాహిత్యము) వున కెక్కువ ప్రాముఖ్యమున్నది. ఈ రచనలలో మంచి కవిత్వమేర్పడి భక్తిరస ప్రధానమైనదిగాను నున్నది. ఇందు కుదాహరణములు :— జయదేవుని యష్టపదులు, త్యాగరాజు మొదలగువారు రచించిన కృతులు.

మఱియు ఇట్టిరచనలు విని నేర్చికొనుటకు దగియున్నవి.


సంగీతరచనలు.
టెక్నికల్ (Technical)
నాన్ టెక్నికల్ (Non-Technical or Melodic)
1. స్వరావళులు
2. అలంకారములు
3. గీతములు
4. స్వరజితులు
5. వర్ణములు
6. తిల్లానాలు
త్యాగరాజు మొదలగువారి కృతులు
జయదేవుని అష్టపదులు
నారాయణతీర్థుల తరంగములు.

# గీతములు.

సంగీతరచనలలోకెల్ల గీతములు చాల సులభగ్రాహ్యములు. సంగీతమునభ్యసించు విద్యార్థులకు ప్రారంభదశయందు సాధకము చేయుటకెంతయు తగియున్నవి. రాగముయొక్క సంచార క్రమమును సులభముగ గ్రహించుటకు వీలుగా నుండులాగున ఈరచనలు రచియింపబడి వినుటకు మాధుర్యముగ నుండును.

ఇట్టి గీతములు రెండు రకములు

1. మామూలు గీతములు :— (a) ఘనరాగ గీతములు :— ఇవి నాట, గౌళ, ఆరభి, శ్రీరాగము మొదలగు ఘన రాగములలో రచియింపబడిన మామూలు గీతములు. (b) పిళ్లారి గీతములు :— ఇవి మొట్టమొదట నభ్యసింపబడు 5 గీతములై యున్నవి. ఇవి పురందర విఠలదాసుచే రచియింపబడినవి. ఈ గీతములు విఘ్నేశ్వరుడు, మహేశ్వరుడు, మహావిష్ణువుల మహిమలస్తుతించునవియై కన్నడభావయందు రచింపబడియున్నవి. ప్రప్రథమమున సంగీతవిద్యను (ఇప్పటి స్వరావళులు, అలంకారములు, గీతములు మొదలగు) ఒకనియామకమైన క్రమపద్ధతిలో బోధించుటకేర్పాటుచేసిన మహాపురుషుడీతడే. మన హిందూ సంగీతమును క్రమపద్ధతిలో బోధించు నేర్పుగలిగిన మహానుభావుడును ఆదర్శకప్రాయుడు నైయున్నాడు.

(c) రాగమాలిక గీతములు:—ఒక్కొక చరణమొక్కొక రాగమందు రచింపబడి పెక్కు చరణములు గలిగియుండును. ఇప్పుడివి పాడుకలో అంతగా గనబడవు.

(2) లక్షణగీతములు:— ఈగీతములందలి సాహిత్యము ఏదేవతను స్తుతించునదైయుండదు. ఏరాగమందాగీతము రచింపబడినదో అట్టిదొక మేళకర్తరాగము గాని జన్యరాగము గాని అయియుండి

ఆరాగలక్షణములను పూర్తిగావివరించునదైయుండును. మేళకర్తరాగమైనచో దానియొక్క గ్రహన్యాస, అంశస్వరములను ఔడవ, షాడవ, సంపూర్ణ భేదములను, జన్యరాగమైనచో వర్జ, వక్రములను దాని జనక రాగమును, భాషాంగరాగమైనచో దాని యన్యస్వరము మొదలగు వివరములను గలిగియుండును. అచ్చొత్తుయంత్రసాధనము లేనికాలమున నీలక్షణగీతములు సంగీతవిద్యార్థులకెంతయో యుపయుక్తముగానుండెడివి. అనేక రాగముల లక్షణములను కంఠస్థముజేశికొని జ్ఞప్తియందుంచుకొనెడివారు. వెంకట మఖిగారిచే రచింపబడిన రాగాంగలక్షణ గీతములు ప్రత్యేకతనుగాంచి విశేషములగనుటకెంతయు తగియున్నవి.

ఈలక్షణగీతము సాధారణముగా మూడుభాగములుగానున్నవి. (1) అందుమొదటిభాగములో మేళకర్తరాగము దాని స్వరజాతి తెలుపబడును. 2. రెండవ భాగములో అమేళకర్తనుండి జనించు ఉపాంగ రాగముల వర్ణన గలిగియుండును (3) మూడవభాగములో ఆమేళకర్త నుండి బుట్టుచున్న భాషాంగరాగ వివరముగలిగి యుండును. ఈలక్షణ గీతములు దక్షిణ హిందూస్థానముకంటె నేటికిని ఉత్తర హిందూస్థానమందే ఎక్కువ అమలులోనున్నవి.

ఇట్టి లక్షణగీతముల రచించినవారిలో నగ్రగణ్యులు 1. వెంకటమఖి 2. గోవిందదీక్షితార్.

## గీతము — దాని ముఖ్య లక్షణములు

1. గీతమేరాగమందురచింపబడినదో ఆరాగముయొక్క మూర్ఛనాదులతో రాగభావము స్పష్టీకరింపబడి రాగస్వరూపము బాగుగా జూపబడియుండును.

2. రాగ తాళములకు చక్కని లయ కుదిరియుండును.

3. రచనయందలి సాహిత్యము సామాన్యముగా దేవతాస్తుతిపై యుండును.

4. గీతమందు పల్లవి, అనుపల్లవి, చరణము అను భాగములుండక అన్ని చరణములు ఒకేవిధముగా నుండును.

5. వక్రమైన క్లిష్టమైన స్వర సముదాయములుండక సంగీతము సులభశైలిలోనుండును.

6. సంగతులు లేనటువంటివిన్ని మధ్యమకాలరహితమైనటువంటివిన్ని సంగీతముగలిగియుండును. గీతములెప్పుడును విళంబితము అనగా ప్రథమ కాలసంగీతమునే కలిగియుండును.

# స్వర జతులు.

గీతముల నభ్యసించినపిమ్మట స్వరజతుల నేర్చుకొందురు. ఇవి గానమాధుర్యముగలవి. ధాతు, మాతులలో వర్ణములఁబోలియుండును. స్వరజతియందు 1. పల్లవి, 2. అనుపల్లవి, 3. చరణము — అని మూడంగముల గలిగియుండును. ఈవిషయములో కీర్తనను బోలియున్నది. స్వరజతియందలి సాహిత్యము ఇష్టదేవతాస్తవమో లేక ఒక జాతీయవీరుని సాహసౌదార్య కార్యములను, కీర్తిని వెల్లడించునదియో అయియుండును.

ఉదా॥ ఆనందభైరవి స్వరజతి — ఆనందగజపతి మహారాజు గుణగణంబుల వెల్లడించుచున్నది.

# గీతమును, స్వరజతిని, పాడు పద్ధతి.

అంగములేనియు లేనటువంటి గీతము క్రమముగా మొదటినుంచి చివరవరకును విడవకుండ పాడబడును. ఒక్కొక్కప్పుడు ప్రారంభమందలి భాగము గీతమును ముగించునపుడు తిరిగి పాడబడును. ఇందుకు ఉదాహరణములు — ఆరభి, ఆనందభైరవి గీతములు.

స్వరజతి పాడునపుడు మొట్టమొదట పల్లవిపాడి పిమ్మట అను పల్లవి, చరణములు క్రమముగా పాడవలెను. అనుపల్లవి ఆఖరునను, ప్రతి చరణము ఆఖరునను పల్లవి తిరిగి పాడబడుచుండును.

# సాహిత్యము (మాతు)

సంగీత రచనలోని ధాతుక్రింద వ్రాయబడియుండు భాషాక్షరము లకు (మాతు) సాహిత్యమందురు. సర్వసామాన్యమైన పద్ధతియేమనగా ఒక్కొక్క స్వరముక్రింద సరిగా ఒక్కొక భాషాక్షరము వ్రాయబడి యుండును. కృతులలోని చిట్టస్వరములకును, తానవర్ణములలోని ముక్తాయి స్వరమునకుగాని, ఎత్తుగడ స్వరములకుగాని సాహిత్యముండదు. కాని ఇటీవలకొందరు నవీనులుకొన్ని తానవర్ణములలో ముక్తాయి స్వర ములకును, ఎత్తుగడస్వరములకును గూడ సాహిత్యమును కల్పించి యున్నారు.

# సాహిత్యములకుదాహరణలు

గీతము:—పురందరవిఠలుని మలహరిగీతము — శ్రీగణనాథ అనుదానిలో:— రి మ ప ధ మ ప — ప్రతి స్వరమునకు సరిగా ఒక్కొ

క రు ణ సా గ ర — క సాహిత్యాక్షరమున్నది.

ఈప్రకారము సాహిత్యముతో కూడిన సంగీతము సులభగ్రాహ్య ముగానేయుండును. కాని ఎల్లప్పుడును ఒక్కొక స్వరమునకు సరిగా అక్షరములుండక ఒక అక్షరములోని అచ్చుస్వరములక్రింద పొడుగింప బడును. అదెట్లనిన:—

మ ప ధ స స రి రి స ధ ప మ ప
శ్రీ ఇ గ ణ న ధ సింధుర అవర్ణ } శ్రీ తరువాత 'ఇ' కారమును

ర తరువాత 'అ'కారమును పొడుగింపబడిన అచ్చులు. ఆయాఅక్షర

ములందలి అచ్చులే ఇట్లు పొడిగింపబడినవి. కానిమాటల అర్థమెంత మా త్రమును చెడదు. మఱియు సంగీతమువ్రాయుటలో ఇట్టి అక్షరములందలి అచ్చులు పొడుగింపబడినపుడు ఆ అకార ఇకారములకు బదులు అక్షరము తరువాత ఒక చుక్కగాని లేక ఒక గీతగాని పెట్టబడుచున్నది. అట్టి చుక్కలనుగాని గీతలనుగాని చూచినతోడనే అకారమో ఇకారమో ఉకారమో పాడుకొనవలెను. ఎన్ని చుక్కలు లేక ఎన్ని గీతలుంటే అన్ని అకారములో ఇకారములో ఉకారములో ఉండును.

—◆ సంగీతరచన ◆—

(గీతము)

1. ధపమగరిసరిమపధమప
కుందగా — — ర గా — రి —వర
స్వరజతి.

2. పా; పమగమ పామా
రా; — — వె — — మే
పమగరిసా;;
మ — — గువా;;

(శంకరాభరణం తానవర్ణం)

3. సా; నిసదనిపామపగామా
పాసా; — — — — మీాన్ని — న్నే

(అటతాళవర్ణం-రీతిగౌళ)

సా, ని-గరిగమ — పామాగారీ
, — — — — — — వానాజా—సా; నిస
గరి—ససనిని—నిపనిని-క్షా; ని — — —
— — — —న్నె — — సని సగాగమా
గమపద-పమ — — — — — — — —
— కొ — — గమపపమమగరి—పమ
గరిసని, — — — రి — — — — — — న
— — — సగగమ॥

—◆ పాడవలసినవిధము ◆—

దపమగరిసరిమపధమప
కుందగాఉఉరగాఉరిఇవర
పా; పమగమ పామాపమగరిసా;;
రా; అ అ వె ఎ ఏమేమఅఅగువా;;

సా; నిసదనిపామపగామాపా
సా; అఅఅఅమీాన్ని ఇఈఈన్నే
సా, నిగరిగమ-పామాగారీసా; అ
అఅఅఅఅ-వానాజాఅక్షా; నిసగరి
ససనిని—నిపనిని. సనిసగానిఇఇఇ ఇఇ
ఇఇన్నెఎఎఎఎఎఏగమా। గమపద
పమగమపపమ ఎ ఏ। ఎ ఎ ఎ కొ
ఒఒఒఒఒరిఇమగరి—పమ — గరిసని—
సగగమ॥ ఇఇఇ-ఇఇనఅఅఅఅఅఅ

మన హిందూసంగీతములో యీ విధముగా అకార ఇకార ఉకార ఎకార ఒకార ఔకార అంకారములచే సంగీతమును పొడు గించి పాడుటవలన అర్థము చెడదు సరిగదా గానమెంతో మాధుర్య ముగానుండుటచే ఘనత వహించి యున్నది. సంగీతమును వ్రాయుట కూడ యీ అచ్చులకుబదులు గీతలుగాని చుక్కలుగాని పెట్టుటవలన ఎంతో సౌకర్యముగా నున్నది. త్యాగరాజుగారి కీర్తనలలో కొన్నిటి యందు సాహిత్యము చాల చిన్నదిగా నున్నను పైనజెప్పిన విధమున అకార ఇకార ఉకారములు వ్రగెరాలతో రంజిల్లి గానమాధుర్యము వెదజల్లబడుచున్నది. అట్టి కీర్తనలలో భైరవిరాగములోని 'కొలువై యున్నాడె' బిలహరిరాగములో 'నాజీవాధారా' యనునవి యిందు కుదాహరణములు.

మఱియు స్వరము ఎన్నిఅక్షరకాలమో సాహిత్యాక్షరముకూడ అన్ని అక్షరకాలము అయియుండును. సా అను రెండక్షరకాలస్వరము నకు సాహిత్యాక్షరముకూడ సరిగా రెండక్షరకాలములోనే దీర్ఘాక్షర ముగా నుండును.

గీతములో ఒక్కొకస్వరము ఒక అక్షరకాలముగా నుండి ప్రథమకాలములో అక్షరకాలమై యున్నది.

స్వరజతులు, వర్ణములు, కృతులు అట్లుగాక ఒకఅక్షరకాలము లో నాల్గు స్వరములను గలిగియుండి ప్రథమ కాలములో పాడబడు చున్నవి.

ఉదాహరణ :—గీతములో ఆదితాళమైతే ఒక ఆవర్తమునకు (8) ఎనిమిదక్షరము లుండును. కృతులు, వర్ణములు, స్వరజతులు ఆవర్తము నకు 32 అక్షరముల గలిగియుండును.

ఇదివరలో రాగాంగలక్షణ గీతము—దాని భాగములగూర్చి వివ రింపబడినది. రాగాంగలక్షణగీతములును, జన్యరాగలక్షణగీతములును

కూడ సంగీతవిద్యార్థుల కెంతయో నుపకరించునుగాన ముఖ్యముగా నభ్యసింపదగును. అయితే వెంకటమఖి కాలమునాటి రాగముల లోని లక్షణగీతములు కొన్ని ప్రస్తుతము అమలులో లేవు. మరికొన్ని ఉపాంగ రాగములు భాషాంగరాగములుగ మార్పుచెందియున్నవి.

జన్యరాగలక్షణగీతము :: అంజలి సాహిత్య వివరము

1. జన్యరాగములోని స్వరములు క్రమపద్ధతిలో నున్నవో లేక వక్రముగ నున్నవో తెలుపబడును.

2. ఆరోహణమందుగాని, అవరోహణమ దుగాని లేక రెంటి యందుగాని వర్జింపబడు స్వరముల వివరము తెలుపబడును.

3. రాగములోని స్వరములరకము అనగా శుద్ధ, కోమల, తీవ్ర రకములు తెలుపబడును.

4. ఈ జన్యరాగముయొక్క మేళకర్తరాగము తెలుపబడును.

5. రాగముయొక్క గ్రహ, అంశ, న్యాసస్వరములనుతెలుపును

6. జన్యరాగము పేరును తెలుపును.

జన్యరాగలక్షణగీతములోని సాహిత్యము పై వివరముల తెలుపునదై యుండును.

వెంకటమఖియును, గోవిందదీక్షితారు అనువారు లక్షణగీతముల రచించినవారిలో నెట్లు ప్రాముఖ్యము గాంచిరో అట్లే ఘనరాగగీతముల రచించినవారిలో పురంధర విఠలదాసును గురుమూర్తి శాస్త్రియును ప్రముఖులు. మఱియు స్వరజతులు రచించిన రచయితలలో శ్యామశాస్త్రియును చిన్నికృష్ణదాసును ప్రముఖులు.

జతిస్వరము :— జతిస్వరము టెక్నికల్ గ్రూపులో చేరిన మరి యొకజాతి రచన. ఇందు సాహిత్యముండక ధాతువును మాత్రమే కలిగియుండి, పల్లవి, అనుపల్లవి చరణములు అను భాగములు గలదై

తానవర్ణము వలెనే మధ్యకాలములో పాడబడును. సంగీతము సులభముగ పట్టుబడునదై మాధుర్యముగను ఆకర్షణీయముగను నుండును. శబ్దమువంటి యీరచన ముఖ్యముగా నృత్యము (Dance) కొరకే నిర్ణయింపబడినది. బిలహరిరాగములోని సా,రిగాపాధా'పానీధా| పాధపమగరిస| రిసనిధ-సా,|| అనునది కేవలము జతిస్వరమే. దీని సాహిత్యము—రారవేణుగోపబాల—యనునది ఇటీవల నెవరిచేతనో కల్పింపబడి దీనికి జతపరచబడినది.

చిట్టతానము :— పూర్వీకులు దీనినే కటకమనిరి. ఈరచన కేవలము వీణ వాయించువారి యభ్యాసముకొరకే నిర్దేశింప బడినది. ఇది ధాతువును మాత్రమే కలిగియుండును. అన్ని ముఖ్యమైన రాగములలోను చిట్టతానములు గలవు ఈ చిట్టతానములం దనేకవిధములైన స్వరకల్పన లుండును.

జతి :— తక, తరి, కిట, నక, తతింగిణతోం—అను. తాళసంబంధమైన శబ్దములు గల రచనకు 'జతి' యందురు. ఇటువంటి జతులు తిల్లానాలో, కొన్ని శ్రీకృష్ణ లీలాతరంగములలోను గూడ గానవగును.

ఉ :—సౌరాష్ట్రరాగము. ఏకతాళము :- తకఝ్ఝుంతకధీ||

శబ్దము :— తాళము, పాట సాహిత్యములతో గూడిన ఈ రచన నృత్యంబున కెంతయో ప్రయోజనముగానుండి భరతనాట్యమందెక్కువ వాడుకలో నున్నది.

తిల్లాన :— ఇది యొకవిధమగు రచన. దీనికే తిరితిల్లానయనియు అందురు ఇది సాధారణముగా మధ్యమకాలములోనే పాడబడును సంగీతమెంతయు రంజకముగా వేగగతిగలిగి సజీవముగా నుండును. దీనికని 1 పల్లవి 2 అనుపల్లవి 3 చరణములు అని మూడు భాగములుండును దీనియందలి మాతు (సాహిత్యము) జతులలోని సాహిత్యమువలెనే స్వరశబ్దములు గలిగియుండును.

ఉదాహరణ :— 1. హిందూస్థానీ కాఫీరాగములోని తనది
రినధీం తనధీం॥
2. కానడరాగములోని నాదిరినా తోందిరి
నాదిల్లిల్లానతనదిరి.

వర్ణము :— సంగీతరచనలలో చాల ప్రాముఖ్యమైన రచన వర్ణము. ఈరచన సంపూర్ణమైన రాగభావమును, స్వరసంచారమును గలిగి పాండిత్యమును వెల్లడించునదై యున్నది ఈ రచనల రచించుటకు గొప్ప పాండిత్యము, అనుభవము, నేర్పరితనము గావలెను. ఇందు మూలముననే వర్ణముల రచించినవారి సంఖ్య బహుతక్కువ. అట్టి వారిచే రచింపబడిన వర్ణరచనలు మొత్తముమీద (200) రెండు వందలకు మించి లేవు. కృతులు, కీర్తన లన్ననో వేలాదిగలవు.

వర్ణములోని సాహిత్యము బహుకొద్దిగానే యుండి అంత ప్రాముఖ్యముగానుండక భక్తిరస ప్రధానముగానో లేక శృంగారరస ప్రధానముగానో యుండును. ఒకవర్ణములో పూర్వాంగమనియు, ఉత్తరాంగమనియు రెండు అంగములు గలవు.

1. పూర్వాంగము :— పల్లవి, అనుపల్లవి, ముక్తాయిస్వరము కలిసి పూర్వాంగ మనబడును.

2. ఉత్తరాంగము :— చరణము, చరణస్వరములు అనగా యెత్తుగడస్వరములు కలిసి ఉత్తరాంగ మనబడును.

వర్ణములు :— 1 తానవర్ణములనియు 2 పదవర్ణములనియు రెండు రకములు.

1. తానవర్ణములు :— ఇవి ప్రత్యేకము సంగీత విద్యార్థులచే నభ్యసింపబడును. ఇందు పల్లవి, అనుపల్లవి, చరణములు మాత్రమే సాహిత్యమును గలిగియుండును. స్వరరాగజ్ఞానములు కలుగుటకు అనగా మనోధర్మసంగీతము అబ్బుటకు ఈ వర్ణములే ప్రాతిపదిక.

2. పదవర్ణములు :— వీనినే చౌకవర్ణములందురు. ఈవర్ణములు ప్రత్యేకము భోగముమేళములవారి (Nautch parties) భరతనాట్యము కొఱకే యుద్దేశింపబడినవి. తానవర్ణమువలె గాక ఈ వర్ణములోని ప్రతిభాగమునకు సాహిత్యముండును. సంగీతము చౌకముగా (Slow) నుండి భావముల బాగుగా వెల్లడించుటకే ప్రాధాన్యమును వహించియుండును, అనగా నిందలి సాహిత్యములోని పదములు అభినయముతోగూడి ఒకపదమునకే అనేక అర్థములు వచ్చులాగున అభినయింపబడును. అయితే పదవర్ణము, పల్లవి, అనుపల్లవి, ముక్తాయి స్వరము, చరణము, చరణస్వరములు గలిగియుండును. గాని ప్రతిదానికిని సాహిత్య ముండును. పాట చౌకముగా నుండినను విళంబిత, మధ్య, ద్రుతకాలములగూడ గలిగియుండును. సాహిత్యము సర్వసామాన్యముగా శృంగారరస ప్రాధాన్యముగానే యుండును. కొన్ని చౌకవర్ణములు భక్తిరసప్రధానముగా నుండును.

ఉదాహరణ :— 1. తోడిరాగము—చ. రూపకం.

ప॥ దానికే తగుజాణరనీవు దయయుంచరయీవేళ

2. ఖమాసు—ఆది.

ప॥ సామిని రమ్మనవే ! సఖియరో ! సామాన్యదొరగాడే॥

పైనజెప్పిన పదవర్ణముల రచించినవారిలో 1 కార్వేటినగర సంస్థాన విద్వాంసులైన గోవిందసామయ్యగారు 2 పల్లవి శేషయ్యరు 3 మైసూరు సదాసివరావు 4 వడివేలు నట్టువనారు 5 రామస్వామి శివన్ 6 కుండ్రకుడు కృష్ణయ్యరు మొదలగువారు ప్రముఖులు.

తానవర్ణముల రచించినవారు:—1 పట్నం సుబ్రహ్మణ్యయ్యరుగారు 2 తిరువత్తియూరు త్యాగయ్యరు 3 వీణ కుప్పయ్య 4 పల్లవి గోపాలయ్య 5 పచ్చిమిరియం ఆదియప్పయ్య 6 తిరువాన్కూరు మహారాజావారైన కులశేఖర మహారాజావారు.

రాగమాలిక :— ఇదియొక చక్కని సంగీతరచన. ఈ రచన యందును పల్లవి, అనుపల్లవి. చరణములు లేక పల్లవిచరణములు కలిగి యుండును. పల్లవి, చరణములు వేరు వేరు రాగములలో రచింపబడి యుండును. రాగముపేరుకూడ అర్థము చెడకుండ సాహిత్యములో నిమిడింపబడి యుండును సర్వసామాన్యముగా అనుపల్లవి అంతమునను, లేక పల్లవి అంతమునను, ప్రతి చరణముకు చివరను చిట్టస్వరముండును. చాలరాగముల మాలికయైనచో అది కొన్నిభాగములక్రింద విభజింపబడియుండి సాహిత్యమందలి విషయము భక్తిరస ప్రధానము గానో లేక శృంగారరసప్రధానముగానో యుండును. ప్రతి రాగమాలిక చివరనో లేక రాగమాలిక పెద్దదైనచో నొకభాగము చివరనో విలోమక్రమముగా రాగతాళములననుసరించి ఆవర్తి లేక అర ఆవర్త స్వరములుండును. ఈస్వరములను విలోమముగా పాడినపిమ్మట పల్లవి పాడబడును ఈవిధముగ పాడబడినప్పుడా రాగమాలిక యెంతో మనోహరముగా నుండును. కొన్నిరాగమాలికలు 8, 9, 14, లేక 16 రాగములలోకూడ రచింపబడినవి. సీతారామయ్యగారిచే రచింపబడిన 'నిత్యకల్యాణి' రాగమాలిక యొక చక్కని యుదాహరణము. ముద్దుస్వామి దీక్షితులవారి 14 రాగముల రాగమాలిక యింకొక యుదాహరణము. ఇంతేకాక 72 మేళకర్తరాగముల మహారాగమాలికను వరుసక్రమములో మహావైద్యనాథయ్యరుగారు రచించి వారు శాశ్వత కీర్తి నొందుటయేగాక సంగీతమునకొక మహాదానమును శాశ్వతముగా జేసినవారైరి.

శాస్త్రనియమములుగల రచనలలో మరికొన్ని గలవు. Technical group) – ప్రబంధము, కైవారప్రబంధము, సంచారి సూళాది మొదలగునవి. గ్రంథవిస్తరభీతిచే వాని నిచట వ్రాయలేదు.

## —: శాస్త్ర నియము లేని రచనలు :—

## (Non Technical or Melodic compositions.)

1. కృతి :— ఈజాతి రచనలలోకెల్ల సుప్రసిద్ధమైన రచన కృతి. ఇప్పటి సంగీతరచనలలోకెల్ల కృతులసంఖ్యయే చాలగొప్పది. వేలకొలదిగా రచింపబడినవి. కొందరు కృతులనే కీర్తన లందురు. కీర్తనలనే కృతులందురు. కాని యీ రెంటికిని భేదమున్నది.

1. కీర్తన 2. కృతి. ఈ రెంటిలో కృతి కేవలము సంగీతమే ప్రధానముగాగల భక్తిపరమైన రచన.

కీర్తన కేవలము భక్తిరసప్రధానముగలిగి సంగీతమంత ప్రాధాన్యము వహించక ఒకేవిధముగా పాడబడు పెక్కుచరణముల సాహిత్యమును గలిగియుండును.

కృతియున్ననో సాహిత్యము బహుతక్కువగా నుండును. ఇందలి సంగీతము పెక్కుసంగతులను. గమకములను, అనేక శాస్త్రసంబద్ధమైన అందచందముల గలిగియుండును.

కృతియందలి అంగములు :— 1. పల్లవి 2. అనుపల్లవి 3. చరణము అను మూడంగములు కలిగియుండును.

కీర్తనలోగూడ ఈ మూడంగము లుండును. కాని కొన్నికీర్తనలలో అనుపల్లవి యుండదు. పల్లవి, చరణములు మాత్రమే యుండును. త్యాగరాజుగారి దివ్యజ్ఞానకీర్తనలు యీ తరగతికి జెందినవై యున్నవి. కృతిలో అంత ప్రాధాన్యము వహించని అంగములు మరికొన్ని గలవు.

1. చిట్టస్వరము :— ఇదియుక స్వరరచన. ఈ స్వరరచన అనుపల్లవి తరువాత నుండును. దీనిని చిట్టస్వర మందురు. ఈ చిట్టస్వరము అనుపల్లవి పాడినపిమ్మటను, ప్రతిచరణము చివరను పాడుదురు.

ఇట్టి చిట్టస్వరములు కొన్నికీర్తనలలో మొదట అనులోమము గాను పిమ్మట విలోమముగాను రాగభావ మెంతమాత్రము చెడకుండ పాడబడును. ఇందుకుదాహరణ :—ముద్దుస్వామిదీక్షితులవారి రెండవ నవావరణకృతి కల్యాణిలోని 'కమలాంబాంభజరే' యనునది మంచి యుదాహరణ.

—: మంచి చిట్టస్వరముగల కృతులు :—

1. ఆనందభైరవికృతి 'నీమదిచల్లగ' యనునది.
2. నీలాంబరిలోని 'శృంగారలహరి' యనునది.
3. కదనకుతూహలము రాగములోని 'రఘువంశసుధాంబుధి' యనునది.

**N. B:**—(వర్ణములోని యెత్తుగడ పల్లవినే చిట్టపల్లవనియు యెత్తుగడ స్వరములనే చిట్టస్వరములనియు కూడ అందురు.)

2. స్వర సా హి త్య ము :— కృతిలోని చిట్టస్వరమునకు తగి నటువంటి సాహిత్యముకూడ రచింపబడియున్నచో అట్టి స్వరసాహిత్య ముల రెంటికి కలిసి స్వరసాహిత్యమందురు. ఇదియును చిట్టస్వరము వలెనే అనుపల్లవి పాడినపిమ్మటను, ప్రతిచరణము పాటినపిమ్మటను పాడుదురు. స్వరసాహిత్యములోని మాటలు (సాహిత్యము) పల్లవి, అనుపల్లవు లోని సాహిత్యమునుచేరి, అర్థముచెడకుండ యుండులాగు ననే రచింపబడును. ప్రతిచరణము ఆఖరున పాడినప్పుడుకూడ దీనియర్థ ము చెడకుండులాగుననే యుండును.

ఇందుకు మంచి యుదాహరణ :— మైసూరు సదాశివరావు గారిచే రచింపబడిన అఠాణారాగములోని 'వాచామగోచరుడని' యను కృతిలోని స్వరసాహిత్య మిందుకు చక్కని యుదాహరణ.

సుబ్బరాయశాస్త్రిగారి కృతులలో చాలవరకు యిట్టిస్వరసాహి త్యములగలిగియున్నవి.

3. మధ్యమకాల సాహిత్యము :— మధ్యమకాల మనగా విళంబిత (చౌక) కాలమునకు రెట్టింపు దురితముగా నుండును. ఈమధ్యమ కాల సాహిత్యము అనుపల్లవి, చరణము వీని చివరనుండును. కృతి లోని యితర భాగముకంటె యీమధ్యమకాలసాహిత్యము రెట్టింపుదురితములో పాడబడును. దీని ధాతు మాతువులు రెండునుమధ్యమకాలము లోనేయుండును. ఇందలి సంగీతము ధారాళముగాను గాంభీరముగాను నుండును.

ఇది కృతిమొత్తములో నొకభాగమై యున్నది. కొన్ని కృతులలో చరణమంతయు మధ్యమకాల సాహిత్యమై యుండును. ఇందుకు మంచి యుదాహరణ :— త్యాగరాజుగారి దర్బారురాగము లోని కృతి 'యోచనా కమలలోచనా' లోని చరణమంతయు మధ్యమకాల సాహిత్యమై యున్నది.

ముద్దుస్వామిదీక్షితులవారి కృతులలో చాలవరకు ఇట్టి మధ్యమ కాల సాహిత్యమును గలిగియున్నవి.

పైనజెప్పిన 1. చిట్టస్వరము 2. స్వరసాహిత్యము 3 మధ్యమ కాల సాహిత్యము—అను నీ మూడంగములు కృతిలోని అప్రధానమైన అంగములని యనుటకు కారణ మేమన ఈమూడంగములు లేకపోయినను కృతికి యేమాత్రమును భంగములేదు. ఇవి లేకపోయినను కృతి, కృతియే యనిపించుకొనును. అయితే ఈ అంగములు శాస్త్రసంబంధమైన అందచందముల మెప్పును గనపరచుటకు కృతికర్తయొక్క హృదయపూర్వకమైన ప్రయత్నాఫలితములని వెల్లడిచేయు చున్నవి. మఱియు నిట్టి యంగములవలన కృతికెంతో శాస్త్రసంబంధమైన శోభ కలుగు చున్నది.

## ❖ కృతులు రచించినవారిలో నీక్రిందివారు ప్రముఖులు ❖

జీవితకాలము

1. త్యాగరాజుగారు :— (1759—1847) వీరు తెలుగులోను సంస్కృతములోనుగూడ రచించిరి.
2. ముత్తుస్వామి దీక్షితులవారు :— (1775—1835) వీరు తెలుగున, సంస్కృతమున, అరవమున రచించిరి.
3. శ్యామశాస్త్రిగారు :— (1763 – 1827) వీరు సంస్కృతాంధ్రముల రెంటియందును రచించిరి.

N. B:— వీరి ముగ్గురకును సంగీత త్రిమూర్తులని పేరు.

4. పట్నం సుబ్రహ్మణ్యయ్యరుగారు :— వీరు తెలుగున, అరవమున రచించిరి.

తెలుగుభాషలో మాత్రమే రచించిన కృతికర్తలు.

(1) సుబ్బరాయశాస్త్రిగారు:—(1803—62)
(2) గర్భపురివారు.
(3) వీణ కుప్పయ్యగారు.
(4) పల్లవి గోపాలయ్యరుగారు.
(5) మైసూరు సదాశివరావుగారు.
(6) పల్లవి శేషయ్యరుగారు.

కీర్తనలు కృతులకంటె పురాతనముగా రచింపబడినవి. ఉజ్జ్వితమైన కన్నడభాషలో ప్రప్రథమమున కీర్తనరచించినవారు పురందర విఠలదాసుగారు. వీరికి పూర్వము కీర్తనలు సంస్కృతమున మాత్రమే రచింపబడియున్నవి. దేవుని భజించుటకు భజనలలో నీకీర్తనలపాడుదురు.

కీర్తనల రచించినవారిలో ముఖ్యులు:—1. పురందర విఠలదాసుగారు 2. భద్రాచల రామదాసుగారు 3. అరుణాచల కవిరాయరు:—రామాయణకీర్తనల కర్త. 4. గోపాలక్రిష్ణ భారతిగారు:—నందనారు చరిత్రకీర్తనల కర్త 5. కవికుంజర భారతిగారు:—స్కాందపురాణ కీర్తనలకర్త.

పదము:—ఇది పాండితీ ప్రతిభను వెదజల్లు రచన. ఇందలి సంగీతముయొక్క నడక చౌకముగానేయుండి వినువారి హృదయము లందలి భావములను గాఢముగా రేకెత్తించును సాహిత్యముపైకి శృంగారరస ప్రధానముగాను నాయకా నాయికీ లక్షణముల గలది గాను నుండును. కాని అంతరార్థము సుబోధకమైన వేదాంతార్థము గలిగి భగవత్పరముగనే యుండును. ప్రతిపదమును సంపూర్ణమైనరాగ భావమును గలిగి సంగీతము, మాటలు ఒకదానినొకటి యనుసరించి యుండి మంచి సామరస్యమును గలిగియుండును, పదముకూడా పల్లవి అనుపల్లవి, చరణము అను మూడుభాగములుగానే యుండును. ఇట్టి పదముల రచించినవారిలో నగ్రగణ్యుడు క్షేత్రజ్ఞుడు. వీరినే క్షేత్రి యులు అనియు నందురు. వీరు సుమారు 2000 పదములు రచించి శాశ్వతకీర్తిని బొందియున్నారు. ఉ॥ ఆనందభైరవి రాగములోనిమంచి దినము నేడే యను పదము వీరు రచించినదే. ఇట్టి పదములను రచించి పేరుగాంచిన ప్రముఖులలో మరికొందరు ఘనం సీమయ్య, గోవిందసామయ్య, సారంగపాణి, పరిమళరంగుడు మొదలైనవారు.

జావళి:—ఈ రచనయును పదమునే పోలియుండును గాని ఇందలి సాహిత్యము గ్రామ్యముగానుండి కేవలము శృంగార రసప్రధా నమై నాయకా నాయకీ లక్షణముల ననుసరించి యుండును. ఇందలి సంగీతము మనోహరముగాను సులభముగా బట్టుపడునదిగాను వేగ గమనము గలదిగాను నుండును. ఇట్టి జావళీల రచించిన వారిలో 1. ధర్మపురి సుబ్బరాయర్ 2. పట్టాభిరామయ్య 3. పట్నం సుబ్ర హ్మణయ్యరు 4. రామనాథపురం శ్రీనివాసయ్యంగారు మొదలైన వారు ప్రముఖులు.

స్వర మాధుర్యముగలిగి శాస్త్ర నియమములేని రచనలలో మరికొన్ని రకములు గలవు. అవి 1. అష్టపదులు-జయదేవ విరచిత ములు. ఇవిసంస్కృతమందే రచింపబడినవి.

2. తరంగములు:—తీర్థ నారాయణస్వామి, విజయ గోపాల స్వామి గార్లచే రచియింపబడినవి.

3. అభాంగములు, డోహరాలు, ఓవీలు—మహారాష్ట్ర ప్రముఖులచే రచింపబడినవి.

4. తేవారములు:—తమిళ భాషలో తిరుజ్ఞాన సంబాధస్వామి తిరునవుకసుస్వామి, అప్పర్ స్వామి, మొదలగు వారలచే రచింప బడినవి.

5. తిరువాచకము:—మాణిక్యవాచకరు గారిచే రచింప బడినది.

6. తిరుప్పుఘజ్:—అరుణగిరి నాదారుకర్త.

7. అరుత్పా—రామలింగస్వామి కర్త.

8. సిద్ధారుల పాటలు, పద్యములుకూడ ఇట్టిరచనలే.

ఫోక్ మ్యూసిక్—లోకగీతములు:—అనగా సంగీతజ్ఞాన విహీనులైన జనసామాన్యముచే పాడబడు పాటలు.

వీనిలక్షణములు:—1. ఈ పాటల సంగీత సంచారము ఒక స్థాయిని (ఆక్టేవ్) మించియుండదు. ఎందుచేతననగా సంగీత విద్య నభ్యశింపని జనుల కందుబాటులో నుండుటకొరకే అట్లుండును. మరియు వీరు శాస్త్రనియమముల ననుసరించి తమ గాత్రముల సాధకముచేయుటకు వీలుకూడ నుండదు, ఇష్టపడరు.

2. ఈ పాటలు ప్రతి మధ్యమ రాగములలోగాని అపూర్వ రాగములలోగాని యుండవు.

3. ఈ పాటలలో కవిత్వమనునది కనపడదు.

4. ఈపాటలలోని కథాసందర్భము సర్వసాధారణముగాజరుగు విషయమై యుండును.

5. సంగీతము స్వల్పముగాను. సులభముగాను అదరముగాను, నుండును.

6. పాటలు సర్వసాధారణముగా చరణములు గలిగి అన్ని చరణముల సంగీతము ఒక్కలాగుననే యుండును. ఒకానొకప్పుడు కొన్నిపాటలలో మాత్రము, పల్లవి, అనుపల్లవి, చరణముఅను భాగములుండును.

7. ఈపాటల సంగీతములో సంగతులుగాని గమకములుగాని యుండవు.

8. ఈపాట లెప్పుడును సులభమైన తాళములను గలిగి సంకీర్ణ (లేక సంకర) రాగములందే యుండును.

సాధారణ జనులుకూడ నేకవిధమైన నాట్యపద్ధతిని గలిగి యున్నారు. ఈ నృత్యమునకు దగినపాటలను గలిగియున్నారు. ఇట్టి నృత్యములలో కోయజాతివారి నృత్యము చూడదగినది.

సంగీత శాస్త్రము విద్యావంతులకును, ధనికులకును మాత్రమే అందుబడిలో నుండును. మామూలు కూలినాలిచేసుకొని జీవించు జనులకిది దుర్లభము.

శాస్త్రోక్తమైన సంగీతవిద్యం బఠసినవారు బహుతక్కువ. ఈ విద్య నభ్యసించుటకు మిక్కిలి తెలివిగలవారై కూడ నుండవలెను.

వేనవేలుగనుండి కూలినాలిచేసుకొని జీవించే మామూలు ప్రజా సమూహము తమ దినచర్యలోని కష్టములమరచి ఆనందముగా జీవయాత్ర గడపుటకు, ముసలివారికి పడుచువారికిగూడ యీ లోకపాటలెంతో ప్రయోజనకారులుగా నున్నవి. శాస్త్రోక్తసంగీతము పెద్దనగరములలోను పట్టణములలోను మాత్రమే కాననగును. లోకగీతములన్నినో ప్రతిపల్లెయందును. గ్రామమందునుగూడ గాననగును.

## లోకగీతములవలని ప్రయోజనములు.

శరీరమును కష్టపెట్టి కూలినాలి చేసుకొని జీవించు ప్రజలకీ సంగీతము అమృతధారవలె వారి శరీరకష్టముల దొలగించి విశ్రాంతి

నిచ్చును. వ్యవసాయదారులు, కుమ్మరి, కమ్మరి, చాకలి, వడ్రింగి మొదలగు కృషీవలు లందరికిని వారివారి దినచర్యలోని కష్టముల దొలగించి యుత్సాహశక్తి నుత్పన్నము చేయునవి లోకగీతములే. శరీరముల మైమరచి యెంతకష్టమైన పనులనైనను జేయునట్లు ద్బోధించు శక్తిగలవి లోకగీతములు బరువైన పనులజేసే కూలివారు గ్రామ్యపాటలపాడుచునే యెంతెంత బరువునైన నవలీలగ మోయుచున్నారు. చాల మైళ్ల దూరము పడవలాగే పడవవాండ్రు పాటలపాడుచూ కష్టమును మరచి యెంతదూరమైన రాత్రియనక పగలనక పడవల లాగుకొని పోవుచున్నారు. లక్షలకొలది ప్రజలు—(ఆడ మగకూడా) వారువారు చేసేపనులు స్వగృహమందుగాని బయటగాని యీపాటల బాడుచు నవలీలగ కష్టమను తలంపులేకయే కష్టించి పనిచేయుచున్నారు. ప్రతి ఇంటియందును ఆడువారు తమ పిల్లలేడ్చునపుడు జోలపాటలు మొదలైనవి పాడి తమపిల్లల నూరడింపగలుగుచున్నారు. వేయేల లోకగీతములే సామాన్య ప్రజాసమూహమునకు ప్రాణదానము చేయుచున్నవి.

అంతేకాదు భక్తిని, నీతిని, జ్ఞానమును బోధించునవియై ప్రవర్తనలను జక్కజేయునవియై యున్నవి. మనోభావముల పెంపొందజేయునవియై యున్నవి.

ఇట్టి (ఫోక్‌సాంగ్సు) లోకగీతములు రెండురకములుగా నున్నవి.

1. నింద్యగ్రామ్యగీతములు:— ఇవి కొంచెము మోటుగానుండును. ఇవి హీనజాతులవారిచే పాడబడునవి. ఉదాహరణ:—1. వ్యవసాయపు పాటలు:—వరిచేలు వూడ్చేటప్పుడు కూలీలు పాడే పాటలు- వృత్తిపాటలు చేతిపనుల పాటలు.

2. అనింద్యగ్రామ్యగీతములు :— ఇవి మొదటిరకపు పాటలకంటె శుద్ధమైనవి. ఇందుకుదాహరణములు :— పురాణసంబంధమైనవి-రామాయణ - భారతగ్రంథముల విషయమైన పాటలు-వివాహాదులగూర్చిన పాటలు.

మొదటిరకపుపాటలు గ్రామాదులలో కూలినాలిచేసుకొనేవారు పాడుదురు ఈపాటలలోని సంగీతము బహుమోటుగా నుండినను విను వారి నాకర్షించునవియై యున్నవి. రెండవరకపు లోకగీతములు మొదటి రకముకంటె చాల నాగరికతనుగాంచి కొన్ని శాస్త్రసమ్మతమైన రాగ ములలోనే యున్నవి. ఇట్టివి లాలిపాట (జో అచ్చుతానంద) తోలు బొమ్మలపాటలు (పురాణసంబంధమైనవి) బొబ్బిలిపాట మొదలగునవి.

ఈలోకగీతములోని అంశమునుబట్టి పదునాల్గు రకములుగా విభజింపనగును. అవి యెయ్యవియన :—

1. నీతిదాయకమైన పాటలు:— ఇవి సంఘములో మనుజుడేవిధ ముగా బ్రవర్తించవలెనో బోధించునవిగా నుండును. మరియు అనేక నీతుల బోధించునవిగా నుండును.

2. వేదాంతమును, లోకసామెతలను బోధించు గీతములు :— ఇవి జన్మముయొక్క పరమావధి భగవంతుని దెలిసికొనుటనుగూర్చియు ఋషివాక్యములగూర్చియు, పెద్దలచే నుడువబడి సామెతల గూర్చియు బోధించును.

3. శుభకార్యములందు పాడబడుగీతములు :— వివాహాది శుభ కార్యములందు పాడబడు పాటలు.

4. కూలివారిపాటలు :— వృత్తిపాటలు, గొల్లవారిపాటలు, బండి వాండ్రపాటలు, నీరుతోడువారి పాటలు, పడవవాండ్రపాటలు మొదల గునవి. ఈపాటలే చాల మోటుభాషలో నుండును. సవారీ బోయీల పాటలు, తిరుపతికొండ నెక్కునపుడు డోలీలు మోసేవారిపాటలుకూడ నిట్టివే. ఆదిమకాలపు వారి పాట లిట్లుండునని తోచించును.

5. వ్యవసాయపుపాటలు :— ఈ పాటలు వర్షపాతమును గూర్చియు ఋతువులగూర్చి దెల్పును. విత్తనముల జల్లునపుడు, వరిచేలు పూచు నప్పుడు పాడేపాటలు యిందుకు సంబంధించినవే.

6. జోలపాటలు లేక లాలిపాటలు :— ఈపాటలు చంటిపిల్లల నూరడించుటకై తల్లులచే పాడబడును: ఇట్టిపాటలు దక్షిణహిందూస్థానమందలి ప్రతిభాషలోను గలవు. ఈపాటలు సాధారణముగా నీలాంబరి రాగములోను, ఆనందభైరవిరాగములోను నుండును.

7. దేవతాస్తుతి. దైవప్రార్థన పాటలు :- ఈపాటలు ఆయా గ్రామములలోని దేవతలను స్తుతించునవిగా గాని ప్రార్థించునవిగా గాని యుండును.

8. కొండజాతుల పాటలు :— దక్షిణ ఇండియాలో నొక్కొక కొండజాతిన నొక్కొక ప్రత్యేకమైన పాటను గలిగియుండును. ఈపాటలోని యంశము ఆజాతివారి పూర్వీకులనుగూర్చియు, వారిముఖ్యవృత్తినిగూర్చియు, వారి చరిత్రనుగూర్చియు పెక్కుస్తాంజాలలో పాడబడును. సంవత్సరాది పండుగ మొదలగు పండుగ దినములలో ఆజాతివారిట్టి పాటను తప్పక పాడుదురు. ఇట్టి పాటయందు వారు ప్రత్యేకాభిమానమును గలిగి యుందురు.

9. చరిత్రాత్మకమైన పాటలు :— ఈపాటలు చరిత్రాత్మకముగ గొప్ప ప్రాముఖ్యమును బడసిన విషయములకు సంబంధించి యుండును. బొబ్బిలిపాట, బ్రిటీషువారు ఇండియాను జయించినవిధమును గూర్చిన పాట మొదలగునవి యిట్టిపాటల కుదాహరణములు.

10. పురాణములకు, కావ్యములకు సంబంధించిన పాటలు :—

ఈ పాటలు ఇండియాలోని జనసామాన్యమందు ప్రసిద్ధముగా నున్నవి. రాముడు, బలరామకృష్ణులు, కౌరవపాండవులు - మొదలగు మహావీరుల చరిత్రలగూర్చి దెల్పుపాటలై యున్నవి. ఈరకపు పాటలు లెక్కలేనన్ని గలవు.

1. స్థానికవీరులగూర్చిన పాటలు:— ఒక గ్రామమునకు జెందిన సుప్రసిద్ధనాయకుని లేక వీరునిచరిత్రను గూర్చినపాటలు. ఇట్టి పాటలు ప్రతిగ్రామమందు గలవు.

12. జనసమూహములచే పాడబడు పాటలు :— భజనకీర్తనలు, దివ్యనామ సంకీర్తనలు, కుమ్మి, కోలాటపు పాటలు యీతరగతికి జెందినవి.

13. ఛిందుపాటలు :— సంస్కృతపదమైన 'ఛందస్సు' అను పదమునకు జెందినదై యుండవచ్చును. ఛిందు అనుమాట. ఈ రకపుపాట పెక్కు ఖాంజాలు గలిగి యుండును. ప్రతిఖాంజా యొక్క సంగీతము ఒక్కతీరుననే యుండును. ఇందుకుదాహరణములు :— కావడిఛిందు నందిఛిందు మొదలగునవి.

14. చిల్లరభట్టీయపుపాటలు :— ఈపాటలు సర్వసాధారణముగా హాస్యరస ప్రధానములుగా నుండును. పగటివేషములవారి పాటలు మొదలైనవి యీరకమునకు జెందును.

పల్లకీబోయీలపాటలు, 'శ్రీరామచెందురనే' 'అందిపందరం' మొదలగు పాటలు యిట్టివే.

# సంగీత వాద్యములు.

సంగీతవాద్యములు మూడు తరగతులుగా విభజింప బడినవి. 1. తంత్రీవాద్యములు 2. గాలివాద్యములు 3. సంఘట్టనవాద్యములు అని మూడు తరగతులు.

1. తంత్రీవాద్యములు :— ఇవి తిరిగి మూడురకములు.

(ఎ) కమాను (బా) తో వాయింపబడు వాద్యములు.

ఉదాహరణ :— వయోలిన్(ఫిడేలు), సారంగి, దిల్‌రూబా, బాలసరస్వతి లేక మయూరి(తావూజ్), ఇస్రాజ్,

(బి) వ్రేళ్లతో మీటుటచే వాయింపబడు వాద్యములు.

ఉదాహరణ :— వీణ, రుద్రవీణ, గోటువాద్యము, సితార్

స్వరగత్, సారోడ్, గైటార్, మాండలీన్, హార్పు, శృతివాద్యములైన తంబురా, ఏక్తార్, కూడ యీ రకముసకే చెందును.

(సి) ఒక సుత్తెతోగాని లేక రెండుపుల్లలతోగాని వాయింపబడు వాద్యములు.

ఉదాహరణ :— పియానో ఫోర్టు, స్వరమండల, గెత్తువాద్యములు.

తంత్రివాద్యములలో కొన్ని కేవలము తంత్రులు మీటబడి వాయింపబడుచున్నవి. అట్టివి, తంబుర, ఏక్తారు, గెత్తువాద్యము.

కమాను లేక విల్లువంటి సాధనముచే వాయింపబడు, వేళ్లచే వాయింపబడు, తంత్రివాద్యములు తిరిగి మూడురకములుగా నున్నవి.

1. కేవలము చేతివ్రేళ్లుఆనించి వాయించుటకు చదునైనబల్ల(ఫింగర్ బోర్డు) గలవి. ఉ॥ ఫిడేలు (వయోలిన్) సారోడ్.

2. మెట్లుగలిగి చేతివ్రేళ్లచే వాయింపబడునవి. ఉ॥ వీణ, సితార్, మయూరి (తావూజ్)

3. ఫింగరుబోర్డుగాని, వీణవలె మెట్లుగాని లేక గోటువాద్యములోవలె తంత్రుల నొక పుల్లచేనాపి వాయించు వాద్యములు.

ఉదా॥ గోటువాద్యము.

2. గాలివాద్యములు :— ఈ రకపు వాద్యములు మూడురకములుగానున్నవి,

(ఎ) కీబోర్డు గలిగి గాలితిత్తి (బెల్లోస్) చే గాలి కల్పింపబడి వాయింపబడు వాద్యములు. ఉ॥ ఆర్గన్, హార్మోనియం.

(బి) వాద్యగానిచే గాలియూదబడి రంధ్రములగలిగి వాయింపబడు వాద్యములు. ఇవి తిరిగి రెండు విధములు.

1. రెండుపాయలుగల నాలుకవంటి సాధనముగలిగి నోటితో నూదబడువాద్యములు. ఉ. సన్నాయి, ముఖవీణ, దక్షిణఇండియా నాగస్వరం

2. వాద్యములోనే గాలి నూదుట కేర్పాటు గలిగిన రంధ్రములు గల వాద్యములు. ఉ॥ ఫ్లూట్, (పిల్లనగ్రోవి)

(సి) వాద్యగాని యూపిరిచే గాలి సప్లయిచేయబడి వ్రేళ్లరంధ్రములు లేకయుండెడి వాద్యములు. ఉ॥ గౌరికాలం, తిరుచిన్నం, ఎక్కాలం, కొంబు, శంఖము, డల్సిమెరు మొ॥

3. సంఘట్టన వాద్యములు :—(పెర్కషన్ వాద్యములు) ఈ రకపు వాద్యములు కొన్ని కాలమును సూసించునవిగను మరికొన్ని యుద్ధ సమయములందును, వివాహాది శుభకార్యములు మొదలగు కార్యములందును వాయింపబడు వాద్యములు (నగారా, భేరి) గా నున్నవి.

ఉ॥ మృదంగం, (మద్దెల) తబల, నగారా, డోలు, డోలక్, డమరు, మర్దళం, శుద్ధమ మద్ధలం, ఉడుక్క, ఉడాల్, దవాండై, పాంబై, కంజిరా మొదలగునవి.

ఘనవాద్యములు (—లోహసంబంధమైన జాల్రా, (కంచుతాళపుచిప్పలు) బ్రహ్మతాళము (దేవాలయోత్సవములు—ఆర్కెష్ట్రాలలోను వాడబడును.) ఇందులో జేరిన వే.

ప్రయోజనమునుబట్టి సంగీతవాద్యములనన్నిటిని మూడు తరగతులుగా విభజింపనగును

శృతి వాద్యములు(—'Drones) ఈవాద్యములు గానమునకాధారశృతిని గలిగియుండుటకుపయోగించుచున్నవి.

ఉ॥ తంబుర, ఏక్తారు. తంతినా. ఒత్తు మొదలగు వాద్యములు.

2. లయవాద్యములు:—తాళవాయిద్యములుగానుపయోగించునవి. ఉ॥ మృదంగము (మద్దెల), ఘటము, కంజిరా. తబల, ఢోలక్, మోర్సింగు, గెత్తువాద్యము, జాల్రా. ఛిప్లా, సిలాంబు మొదలగునవి.

3. సంగీతవాద్యములు :— నోటితో పాడనవశరము లేకుండ

వాద్యముల మూలమున సంగీతమును ప్రదర్శించుట కుపయోగించు వాద్యములు.

ఉ॥ వీణ, వయొలిన్ (ఫిడేలువాద్యము) ఫ్లూట్, నాగస్వరము, జలతరంగిణి మొదలగునవి.

## సంగీత వాద్యముల ఉత్పత్తి.

1. తంత్రీ 2. గాలి 3. సంఘట్టన వాద్యముల మూడింటిలోను సంఘట్టనవాద్యములే (Percussion instruments) చాలపురాతనమైనవిగా కనుపించుచున్నవి. మానవచరిత్రలో మరికొంత కాలమునకుగాని గాలి, తంత్రీ వాద్యములుత్పన్నములు కాలేదు. సంఘట్టనవాద్యములలో అత్యున్నతమైన వాద్యము ఉత్పన్నము కాకమునుపే అనేక రకముల గాలివాద్యములు మానవునిచే సృష్టింపబడి అమలులోనికి, వచ్చినవి. ఈలాగుననే గాలివాద్యములలో నత్యున్నతమైన వాద్యము సృష్టింపబడకుండగనే అనేక రకముల తంత్రీవాద్యములు కనిపెట్టబడి అమలులోనికి వచ్చినవి.

ఈ దిగువజూపబడిన వాద్యములు క్రమముగా నొకదాని తరువాత నొకటి సృష్టింపబడి సర్లుగా మూడు రకముల వాద్యములలోను జూపబడినవి.

1. సంఘట్టన వాద్యములు (Percussion Group) :— ఇవి రెండురకములు (1) లోహవాద్యములు (2) చర్మ వాద్యములు.

1. స్టోన్ గాంగ్సు మోగైనక్యాట్సనెట్సు.

2. లోహతాళములు.

3. ఒకకునైవుమూయబడిన తంబటం, కంజిరాలవంటి సాధనములు. (చర్మ)

4. ఒకవైపు తోలుతో మూయబడిన కుండ, కర్ర వాద్యములు (డ్రమ్ములు) (చర్మ).

5. రెండువైపుల చర్మముతోమూయబడిన, డోలు, వీరణముల వంటి డ్రమ్ములు. (చర్మ)

6. శృతిననుసరించి మార్పులుచేసికొనుటకు వీలైన డ్రమ్ములు: ఉ॥ మృదంగం (చర్మ)

2. గాలి వాద్యములు (Wind Group) :—

(1) వ్రేలి రంధ్రములు లేని పొడవైన పైపులు, కొంబులు, హారనులు.

(2) గోర్డుపైపులు.

(3) గోర్డు ఆర్గన్ పైపు, రీడ్ డల్సిమరు.

(4) కొద్దివ్రేలి రంధ్రము లుగల మ్యూజికల్ పైపులు.

(5) సప్త లేక అష్ట 7 or 8 వ్రేలి రంధ్రములు Finger—holes) గల ఫ్లూటుమాదిరి సంగీత వాద్యములు.

(6, నోటితో నూదు నాగస్వరము సన్నాయివంటి సంగీత వాద్యములు.

(7) కీబోర్డులను గలిగిన హార్మోనియము, ఆర్గను మొదలైన గాలివాద్యములు ఆధునికముగా ఐరోపీయులచే సృష్టింపబడి మనదేశములోగూడ ప్రస్తుతము అమలులోనున్నవి.

3. తంత్రీ వాద్యములు:—(Stringed Group)

ఈ తంత్రీవాద్యములలో వ్రేళ్లతోమీటి వాయింపబడు వాద్యలే ముందుకనిపెట్టబడినవి. పిమ్మట కమానులేక విల్లు (Bow)తో వాయింపబడు సాధనములు కనిపెట్టబడినవి.

(1) ఏకతారు, తంతినా (2)బాప్ట్రింగు, పినాక, హార్పు (3) స్వరమండల (4) మహానాటకవీణ (గోటువాద్యము), కొన్నికదలికకు వీలు

గానుండు మెట్లుగల వీణ. (5) స్థిరముగా సమర్చబడిన మెట్లుగల రుద్ర వీణ, సరస్వతి వీణ. (6) కమాను లేక విల్లుతో వాయింపబడు, వయొలిన్ (ఫిడేలు) అండ్ సారంగ మొదలగునవి.

సినిమాలోకూడ తంత్రీవాద్యములలో చాలనవీనస్థానమిచ్చినది. కీబోర్డు గలయీ తంత్రీవాద్యము నవీనముగా యూరోపియనులచేకనిపెట్టబడినవి.

# శాస్త్రసంబంధమైన మఱికొన్ని శబ్దములు వాని యర్థములు.

సంగీత సాధనము :— (మ్యూజికల్ ఇన్స్ట్రుమెంట్సు)

సంగీత సంబంధమైన స్వరమును లేక స్వరములను జనింపజేయు శక్తిగల యేదైననొక సాధనముగాని లేక యంత్రముగాని లేక సాధన సామగ్రిగాని సంగీత సాధనమనబడును.

ఉ॥ ట్యూనింగుఫోర్కు ; గ్రామఫోను, జలతరంగిణిలోని ప్రతి పాత్ర, మనుష్యగాత్రము, వీణ, వయొలిన్, ఫ్లూటు, మొదలగునవన్నియు మ్యూజికల్ ఇన్స్ట్రుమెంటులనబడును.

డ్రోన్ :—(శృతిసాధనము) శృతిపెట్టె లేక తంబుర గానమున కాధారమైన ఆధారశృతిని ధ్వనింపజేయు సంగీతసాధనమునకు డ్రోన్ అని పేరు ఒకపాటకచ్చేరి ప్రారంభించి ముగియుపర్యంతము ఈశృతి సాధనము వాయింపబడుచునేయుండును ఈయాధారశృతి ఒకేమోస్తరు ధ్వనిని పుట్టించునదై యుండినను,యీ నాదమువినుటకు విసుగు గలిగించుటకు బదులు గానమునకంతయు ప్రాతిపదికగానుండి గానమున కెంతయో అందమును ఇచ్చునదై యున్నది. ఇట్టి శృతి సాధనములలో ఏక్తారా, ఒత్తు మొదలగునవి నాగస్వరమేళములోని ఆధారశృతి సాధనములు, ఇవి ఒక్కషడ్జస్వరమునే పలుకును. ఈ యాధారశృతి సాధనము

లన్నిటిలోను 'తంబుర' ఒక్కటియే ఉత్తమోత్తమమైనది. ఈ సాధన మందు నాలుగు తంత్రులుండి 'ప సా సా స' అని పలుకును పాటకచ్చేరీల కిది యొంతయో సింగ్గైన ఆధార శృతిగానున్నది.

ఆక్సిడెంటల్సు (అన్యస్వరములు) :—

ఒక రాగములోని నియామకమైన స్వరములుగాక అదనముగా వచ్చుకోవలలేక తీవ్రస్వరములే ఆక్సిడెంటల్సు అనబడును.

ఉ॥ ఆనంద భైరవిరాగములో ($గ_1$) సాధారణగాంధార, ($ని_1$) కైశికి నిషాదములే శాస్త్రనియమమునకనుసరించి వాడవలసి యుండును. కాని కొన్ని ప్రయోగములలో అంతరగాంధార ($గ_2$) ($ని_2$) కాకలీనిషాదములు వాడబడుచున్నవి. కాబట్టియీ అంతరగాంధార, కాకలీ నిషాదములు ఆనందభైరవిరాగములో (ఆక్సిడెంటల్సు) అన్యస్వరములై యున్నవి. ఇట్టి ఆక్సిడెంటల్సును సంగీతవ్రాతలో పువ్వుగుర్తుపెట్టిసూచింపవలెను. (పువ్వుగుర్తు Asterisk)

ఈ యన్యస్వరములు లేక ఆక్సిడెంటల్సు జన్యరాగములందు మాత్రమేవచ్చును గాని 72 మేళకర్త రాగములలో నెన్నడును రావు.

సిమెట్రికల్ రాగములు :—ఒక రాగము యారోహణమందే స్వరములుండునో అవరోహణములో ఆస్వరములేవచ్చినచో అట్టిరాగమునకు సిమెట్రికల్ రాగము (శుద్ధరాగము) అని పేరు. 72 మేళకర్త రాగములును సిమెట్రికల్ రాగములే. మోహన, హంసధ్వని. మధ్యమావతి మొదలగు జన్యరాగములును సిమెట్రికల్ రాగములే.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మోహనరాగము :— | ఆరోహణ :— | స | రి | గ | ప | ద | సా | |
| | అవరోహణ := | సా | ధ | ప | గ | రి | స | |
| హంసధ్వని ,, :— | 1 ,, | స | రి | గ | ప | ని | సా | |
| | 2 ,, | సా | ని | ప | గ | రి | స | |

నాన్ సిమెట్రికల్ రాగములు :— ఆరోహణావరోహణములందు ఒకటే

గాని ఒకటికంటె ఎక్కువగాగాని అన్యస్వరములే రాగములందువచ్చునో అట్టిరాగములు నాన్ సిమెట్రికల్ రాగములనబడును.

ఉదాహరణ :—బిలహరి రాగము.

మ్యూజికల్ ప్రైప్సు :— ఇవి రెండు రకములు (1) టెక్నికల్ (2) నాన్ టెక్నికల్ లేక మెలోడిక అని రెండు రకములు.

అలంకారములు :— సంగీతరచనలోని స్వరముల అందచందములు మరియు తాళము బోధించు శాస్త్రీయ రచనలు.

## అకౌస్టిక్సు (శబ్దశాస్త్రము)

హార్మోనిక్ సీరీస్ :—దగ్గర సంబంధముగల స్వరములు వరుస క్రమములో వాని వాని వేపనముల సంఖ్యననుసరించి యీదిగువ ప్రపోర్షనులోనుండును :—

1 2 3 4 5 6

ఈవిధమున ఆధారస్వరము 'స' అయినచో హార్మోనిక్ సీరీసులోని యితర స్వరములు ఈ క్రిందివిధముగానుండును :—

స ṡ ప̇ స̈ గ̈ ప̈
1 2 3 4 5 6

స్థాయిలు 1, 2, 4, 8 ఈ విధమైన రేషియోలో నుండును. ఈలాగుననే ఒక స్థాయిలోని ఒకస్వరముయొక్క వేపనముల సంఖ్య మరియొక స్థాయిలోని అదేస్వరము యొక్క వేపనముల సంఖ్య ఆ రేషియోలోనే యుండును. ఇందుకుదాహరణగా అన్నిస్థాయిలలో గాంధారస్వరము ఈదిగువవిధముననుండును :—

| మంద్రస్థాయి — | మధ్యస్థాయి — | తారస్థాయి — | అతితారస్థాయి. |
|---|---|---|---|
| గ̣ | గ | గ̇ | గ̈ |
| 1 | 2 | 4 | 8 |

యాంటినోడ్ :—ఒకతంబురలోనిగాని వీణలోనిగాని తంతిని మీటినపుడు తంత్రియొక్క మధ్యభాగమే ఎక్కువకదలికల (ఎక్కువ వేపనముల) గలిగియుండును. అట్టిఎక్కువ వేపనములుగల తంత్రి యొక్క మధ్యభాగమునకే యాంటినోడ్ అనిపేరు.

నోడ్సు :—పైవిధమున మీటబడిన తంత్రియొక్క మధ్యభాగమింకను కదలుచుండగనే ఆతంత్రియొక్క కొనభాగములు రెండును కదలికనిలచిపోయియుండును. ఇట్లుకదలిక లేకయుండు ఆతంత్రియొక్క కొనభాగములరెంటిని నోడ్సుఅనిపేరు. నోడ్ అనగా చలనములేనిచోటు.

అణూరణాత్మక ధ్వనులు :—(హార్మోనిక్సు) లేక స్వయంభూ స్వరములు) :—

తంబురలోగాని, వీణలోగాని రెండువైపుల గట్టిగ బిగింపబడిన యొకతంత్రినిమీటినపుడు మొదటనాతంత్రి మొదటినుండి కడవరకును (అనగా తీగఅంతయును) మిక్కిలి కదలును పిమ్మట రెండుభాగములుగా కదలును అటుపిమ్మట మూడుభాగములుగాను దరిమిలాను నాల్గు భాగములుగాను ఈవిధమున పెక్కుభాగములుగా కదలును. ఈ కదలికల ఫలితముగా నొకదానివెంబడినొకటి యతి శీఘ్రముగా కొన్నిధ్వనులు వినబడును. తంత్రియంతయు కదలినప్పుడే ప్రధానధ్వని అన్నిటికంటె విస్పష్టముగా జనించివినబడును. తక్కిన ధ్వనులీ ప్రధాన ధ్వనికి సహచరులుగా నుండును. తంత్రియంతయు కదలినప్పుడు పుట్టినమిక్కిలి తగ్గు స్వరమే మిక్కిలి ఎక్కువ ధ్వనితో వినబడును. దీనినే ప్రధానమైన (ఫండమెంటల్ లేక ప్రైమరీ) ధ్వని (టోన్) అందురు. దీని సహచరులైన ధ్వనలను స్వయంభూ స్వరములనియు లేక అణూరణాత్మక ధ్వనులనియు (ఓవర్‌టోన్స్, అప్పర్‌పార్షల్‌టోన్సు) లేక హార్మోనిక్సు అనియు అందురు.

* సోమనాధుడను పూర్వాచార్యులు తమ రాగవిబోధమను గ్రంథములో హార్మోనిక్సునే స్వయంభూస్వరములని పేరిడిరి.

హిందూ సంగీతము (ఇండియన్ మ్యూజిక్):—

ఇండియా దేశములో నాచరణలోనున్న సంగీతపద్ధతికి (ఇండియన్ మ్యూజిక్) హిందూసంగీతమని పేరు. ప్రపంచమందలిలోను విదితమై చాల పురాతనమైన సంగీతపద్ధతి. ఈ యిండియన్ మ్యూజిక్కును సంబంధించిన గ్రంథములు క్రీస్తుకు పూర్వము కొన్నివందల సంవత్సరములనుండి యాచరణలోనున్నవి. మనోరంజకమైన రాగపద్ధతిలోనైతేనేమి, తాళపద్ధతిలోనైతేనేమి, బహుసూక్ష్మవిశ్రాంతులతో గూడిన క్లిష్టగమకపద్ధతిలోనైతేనేమి మనహిందూసంగీత పద్ధతియే నేటికిని అన్నియితరసంగీత పద్ధతులలోను సత్యున్నత స్థానమును బొందియున్నది ఇదియే పురాతన ఆర్యుల సంగీత పద్ధతి.

కాలక్రమమున నీయార్యుల సంగీత పద్ధతి రెండు ప్రధానమైన సంగీతపద్ధతులుగా బరిణమించినది.

అవి:— 1. కర్నాటక సంగీత పద్ధతి 2. హిందూస్థానీ సంగీత పద్ధతి అయియున్నవి.

1. కర్నాటక సంగీత పద్ధతి :— ఇండియా ద్వీపకల్పములో దక్షిణ భాగమందాచరణలోనున్న సంగీతపద్ధతికే కర్నాటక సంగీత పద్ధతియనిపేరు. ఈ కర్నాటక పద్ధతియే ఆర్యుల సంగీత ప్రత్యేకతను సంపూర్ణముగ సంరక్షించుకొని నేటికిని నిలచియున్నది. మరియు నీపద్ధతియే మిక్కిలి సక్రమమైనదిగాను, సంపూర్ణముగాను, శాస్త్రనియమములగలిగి శుద్ధముగాను నున్నది.

2. హిందూస్థానీ సంగీత పద్ధతి:—ఉత్తర ఇండియాలో నాచరణలోనున్న సంగీతపద్ధతికి హిందూస్థానీ సంగీత పద్ధతియని పేరు.

గాంధర్వవేదము :— సంగీత విద్యనుగూర్చి బోధించు శాస్త్రమునకు గాంధర్వవేదమనిపేరు. ఇదివేదభాగములలోనొకటి. నాల్గువేదములకు నాల్గు ఉపవేదములు గలవు. అట్టి ఉపవేదములలో గాంధర్వవేదమొకటి మిగతవి:—ధనుర్వేదము, ఆయుర్వేదము, అర్థశాస్త్రము.

మధ్యమ కాలము లేక తానము :— (దీనిని ఘనము అనియు అందురు) గాయకుడు తనస్వశక్తిచే కల్పించి పాడు సంగీతములోనొక భాగము. రాగమును పెంపుచేసి స్వశక్తిచే పాడు విధానములో నిదియొకటి. ఇందలి సంగీతము ఇన్ని సరియైన ఆవర్తములని లేకయున్నను, కొలచి నట్లుండును. రాగాలాపనలో 'తతారినంతోం' అనియెడు పదముల నుపయోగించునట్లే తానంలో అను 'అనంతం' శబ్దప్రయోగము చేపాడబడును. (లోగడ దీనిని గూర్చి విపులముగా వ్రాయడమైనది.)

మనోధర్మ సంగీతము;— అనగా స్వశక్తిచే గాయకుడు అప్పటికప్పుడు కల్పించి పాడు సంగీతము. (క్రియెటివ్ మ్యూజిక్)

ఒక పాటకచ్చేరీలో గాయకుడు పాడు సంగీతము రెండు రకములుగా నున్నది

(1) ఇదివరలో పూర్వాచార్యులచే రచియింపబడి ఆచరణలో నున్న సంగీత రచనలను గాయకుడు తిరిగిపాడిచూపు సంగీతము.

(2) గాయకుడు తనస్వశక్తిచేతను బుద్ధిచాతుర్యముచేతను అప్పటికప్పుడు సృజించిపాడు సంగీతము. ఇది జంత్రమైననుగావచ్చును, గాత్రమైననుగావచ్చును. ఇట్టి రెండవరకపు సంగీతమునకే మనోధర్మ సంగీత మనిపేరు.

ఈమనోధర్మ సంగీతము నాల్గు విధములు :—

(1) రాగాలాపన (2) మధ్యమకాలము లేక తానము, (3) పల్లవి పాడుట (4) స్వరము పాడుట.

* కృతులు మొదలగు రచనలలోగల సాహిత్యమును ప్రస్తరించిపాడుటకు అరవములో నెరవులందురు. ఇట్టినెరవులు పాడుటకూడ మనోధర్మ సంగీతములోనే చేరును.

సంగీతరచనలు కూడ మనోధర్మసంగీతమే కాని ఇట్టిరచనల రచించువారికి బాగుగానాలోచించుటకును, ఒకనిధానమునకువచ్చిరచన

లలోనేవిధమైన లోటుపాట్లు లేకుండ చూచినోనుటకును, తమబుద్ధికుశల తను, నేర్పరితనమును జూపుటకును తగినంత కాలము వారి స్వాధీన మందుండును. పైనచెప్పబడినరీతిని గానకచ్చేరీలలో మనోధర్మసంగీత మును ప్రదర్శించుటకు కొద్దికాలము మాత్రమేయుండును. ఆసుకవిత్వ మువలె సంగీతము సంతతధారగా బ్రవహించవలెను.

పల్లవిపాడు క్రమము ;— సంపూర్ణమైన సంగీతజ్ఞానముకల వారే పల్లవినిపాడగలరు. పదావయవము, లయ, విన్యాసము అనువీని సంయోగమే పల్లవి యనబడును. ఈ పల్లవిపాడుపద్ధతి సుమారు 200 సంవత్సరములనుండి ఆచరణలోనున్నట్లు గాన్పించును. పల్లవిలోసాహి త్యాక్షరములు మాత్రమే యుండును. (అనగా మాతు మా త్రమే) మాతువైన పల్లవి యే తాళము లో నున్నను మొదటి యక్ష రమును అతీత, అనాగత, సమగ్రహములలో దేనిలోనెత్తినప్పటికిని అది తప్పకుండగను, నోటిలో మొట్టమొదట పల్లవియొక్క యేయే అక్షరము తాళవయవాక్షరములుగా నమర్చి పాడుదురో ఆయాయక్ష రములు నిలుచుచోటును తప్పకుండ కల్పనలు సేసి తాళము ననుసరిం చి ఒకటి, రెండు, మూడు లేక నాలుగావర్తములుపాడుటలో మొదట పాతిగావర్తము, పిమ్మట అరావర్తము, అటుపిమ్మట ఒక ఆవర్తము, తదనంతరము రెండు, మూడు, నాల్గు ఆవర్తములుగా గాయకుని శక్తి ననుసరించి పెంచుకొని పాడవలెను. అట్లు పాడుటలో పాడిన సంగతి పాడకుండగను రాగముయొక్క, తాళముయొక్క నియమములు తప్ప కుండగను, వినువారికి మనోరంజకముగాను పాడవలెను. పిమ్మట (సా హిత్యమువలెనే) స్వరము పాడవలెను. స్వరము పాడుటలో పాతిగ, అర, ఒకటి, రెండు, మూడు నాలుగావర్తముల వరకు విచిత్ర కల్పనల తో స్వరమును పాడేటప్పుడు పల్లవిలోని ఎడుప్పు అక్షరమును దప్పక నెత్తవలెను. ఈ ప్రకారము స్వరకల్పనలతో పాడునపుడు మధ్య మధ్య

పాటములు (శబ్దములు) నిమిడించి రాగమునకు దగిన గ్రహస్వరముల జేర్చి మధ్యమకాలములోనే పాడుచూ మధ్యమధ్య ద్రుతకాలము నిమిడించి పల్లవిపాడుట సాంప్రదాయమై యున్నది. అతివిళంబముగా గాని అతి ద్రుతముగాని పాడుట కూడదని పెద్దల యభిమతము.

మాతృ అనగా సాహిత్యమునుగూర్చి మఱికొన్ని విషయములు:—

సంగీతరచనలలో మాతు నాల్గువిధముల గన్పట్టుచున్నది.

1. కృతి. పదము, జావళీలలోని సాహిత్యము మామూలుగా మాట్లాడే భాషాపదములై యున్నవి.

2. మామూలు భాషాపదములలో అర్థముచెడకుండ స్వరాక్షరములైన 'సరిగమపధని' యను స్వరములు మధ్యమధ్య నిమిడింపబడి యున్నవి. ఇటులనే జతులుకూడ నిమిడింపబడి యున్నవి.

3. తాళశబ్దములైన జతులు అనగా "తక, తరి, కిట, నక, తోం, ఝణు" వంటివి సాహిత్యముగా నున్నవి. ఉ:- తిల్లానాలు, కైవార ప్రబంధములు.

4. కొన్ని ఘనరాగగీతములలోని 'అఇయ్యా, తిఇయ్యా, అఇయ్యాం, విఇయ్య' వంటి సాహిత్యము

ఒక్క జతిస్వరములుతప్ప తక్కిన సంగీతరచనల కన్నిటికిని సాహిత్యముండుట తప్పనివిధి.

మ్యూజికల్ ఫ్యాక్టు:—సప్తస్వరము లున్నవి అను మ్యూజికల్ఫ్యాక్టు (Musical fact) షడ్జపంచమములవేపనముల సంబంధము 2 : 3 అనుట మ్యూజికల్ ఫ్యాక్టు.

పద్ధతి:— ఒక సంగీతరచనను పాడు విధానమునకు పద్ధతి యని పేరు.

ఉదాహారణ: తానవర్ణమును పాడుపద్ధతి:—

తానవర్ణములోని పూర్వాంగమైన పల్లవి, అనుపల్లవి,

ముక్తాయిస్వరము—వీనిని వరుసక్రమములో పాడినపిమ్మట తిరిగి పల్లవి పాడవలెను. దీనితో పూర్వాంగము ముగియును.

అటుపిమ్మట ఉత్తరాంగములోని చరణమును సంగతులతో సహా పాడినపిమ్మట యెత్తుగడ స్వరములను వరుసక్రమములో పాడవలెను. ప్రతియెత్తుగడ స్వరము పాడినవెనుక తిరిగి చరణమును పాడుచుండవలెను.

పిడిప్పు :—ఒకరాగమును పాడునప్పుడు ఆ రాగస్వరూపమును బాగుగాదెచ్చు రాగరంజక స్వరముల సంచారమునకు పిడిప్పు అని పేరు.

ప్రయోగము :—సంచారము లేక చేరిక.

స్వరాక్షరము :— ఇదియొక సంగీత రచనలోని శాస్త్రనియమముతో గూడిన యందము. రచనలోని ధాతువునకు క్రింద సరిగా అక్షరమునకు అక్షరముగా వ్రాయబడు మాతులోని అక్షరము సరిగా ధాతువులోని స్వరాక్షరమే అయియుండి సాహిత్యములోని పదముల అర్థ తాత్పర్యముల కెట్టిలోపము ను గలుగకుండునట్లు వ్రాయబడు మాతుఅక్షరమును స్వరాక్షరమందురు.

ఉదాహరణ :-రామస్వామిశివన్ గారిచే రచింపబడిన కాంభోజి రాగములోని 'పంకజాక్షిపైనీకు' అను ఆదితాళవర్ణములో చక్కని స్వరాక్షరములు గాననగును. స్వాతి తిరునాల్ మహారాజావారి రచనలలోగూడ నిట్టి స్వరాక్షరములు అనేకములు గాననగును.

ట్రాన్సిలియంట్ స్కేలు :—అనగా వర్జరాగము.

విశ్రాంతి :— ఒక సంగీతరచనలో పాటను ఆపి విశ్రాంతి తీసుకొను కాలము.

రాగవర్ణన :—ఏదైన నొకరాగమును గూర్చి వర్ణించునపుడు యీక్రిందివిషయములు గమనించవలెను.

1. జనకరాగమా? జన్యరాగమా?

2. జనకరాగమైనచో మేళకర్త (కటపయాది) సంఖ్య. ఆరాగము లోని స్వరములరకము. జన్యరాగమైనదానిపేరు దాని మేళకర్తపేరు (కటపయాది) నంబరు.

3. రాగముయొక్క ఆరోహణా వరోహణములు భేదాలు యేమైన నుండిన శాస్త్రజ్ఞుల అభిప్రాయభేదములు.

4. వర్జమా? వర్జరహితమా? వక్రమా? వక్రరహితమా వక్రమైనచో యేరకముకు జెందును?

5. ఔడవమా? షాడవమా? సంపూర్ణమా? నిషాదాంత్యమా? ధైవతాంత్యమా? పంచమాంత్యమా?

6. ఉపాంగమా? భాషాంగమా? భాషాంగమైనచో అన్యస్వరము లెవ్వి? ఎట్టిప్రయోగములలో నా యన్యస్వరములు వచ్చును?

7. ఆరాగముయొక్క గ్రహ, అంశ, న్యాసస్వరములు.

8. పిడిప్పు లేక రాగరంజక స్వరకల్పనలు.

9. జంటస్వర, దాటుస్వరప్రయోగము లుండవచ్చునా?

10. గమక, వరికరాగమానా? కాదా?

11. రాగములో రాదగు గమకములు.

12. ఘన, నయ లేక రక్తి, దేశీయ రాగములలో నేరకముకు జెందును

13. ఆరాగము నవరసములలో నేరసమును ప్రధానముగా గలది?

14. ఏదైన రోగమును నశింపజేయగల రాగమా? లేక ఆరాగము వలన నేదైన ప్రయోజనము లున్నవా?

15. రాగము పాడదగిన కాలనిర్ణయము.

16. ఆరాగము యెక్కువ ఆచరణలో నున్నదా? ఎక్కువగావాడ బడునదా అందలి రచనలు.

17. రాగచరిత్ర.

18. ఏదైన విశేషవిషయములు.

## మరికొన్ని వాడుకలోనున్న తాళముల వివరము.

ఇదివరలో ప్రధానమైన తాళసప్తకమునుగూర్చియు, లఘు జాతిభేదముల ననుసరించి తాళములు ముప్పదియైదు అయిన విధమును గూర్చి వివరించడ మైనది. ఈ ముప్పదియైదు తాళములును గతిభేదముల ననుసరించి 35 × 5 = 175 తాళము లగుచున్నవి.

దేశాదితాళము :— ఈ తాళఅంగములు ఒక విసర్జితము, మూడు ఘాతలు. (తట్టులు లేక దెబ్బలు) దీనిగతి చౌకముగానే యుండును. విసర్జితములో ముప్పాతిక (¾) అక్షరకాలమైనతరువాత పాట ప్రారంభమగును. అనగా విసర్జితములో ముప్పాతిక అక్షర కాలము విశ్రాంతిగలదు. ఈ విశ్రాంతికాల మైనవెంటనే పాట ప్రారంభమగును.

ఉదాహరణ :—సరస్వతి మనోహరి రాగములోని 'ఎంతవేడు కొందురాఘవ' శ్రీరంజని రాగములోని "భువినిదాసుడని" యనుకీర్తన లీతాళమునకు చక్కని యుదాహరణలు.

మధ్యాదితాళము :— దేశాదితాళమువలెనే యిదియును ఒక విసర్జితము, మూడు దెబ్బలు అను అంగములు గలది. ఈ తాళములో పాట అంతచౌకముగా నుండదు. విసర్జితములో అరఅక్షరకాలమైన వెంటనే పాట యెత్తబడును

శ్రీరాగములోని 'నామకుసుమముల' మాయామాళవగౌళ లోని 'మేరు సమానధీర' అను కీర్తన లిందుకుదాహరణములు.

—: ఛాపు తాళము :—

ఈతాళము అక్షరకాలభేదములుగల రెండు తట్టులుగలది. ఈ ఛాపుతాళము మూడురకములుగా నున్నవి.

1. మిశ్రఛాపు :—ఇందు మొదటితట్టు (దెబ్బ లేక ఘాత) మూడక్షరకాలముగలది. రెండవతట్టు నాలుగక్షరకాలము గలది.

2. ఖండచాపు :—ఈతాళమందు మొదటిఘాత రెండక్షర కాలము రెండవ ఘాత మూడు అక్షర కాలము.

3. తిశ్రచాపు :—ఈ తాళమందు మొదటిదెబ్బ ఒక అక్షర కాలము మాత్రమే. రెండవ దెబ్బ (ఘాత లేక తట్టు) రెండక్షర కాలముగలది.

సౌకర్యముకొరకు ఈచాపుతాళము రెండుఘాతలకుబదులు ఒక విసర్జితము (వ్రుసి) గాను ఒక దెబ్బగాను లెక్కించబడు చున్నది.

పైన జెప్పిన మూడుచకములలో నుండక మామూలుగా 'చాపు తాళము' అని యొక సంగీతరచన పైభాగమునుండిన నది మిశ్రచాపు అనియే యెరుంగునది. లోకగీతములలో (Folk songs) ఈ చాపు తాళపు భేదములన్నియు గాననగును.

సంయోగము :— అనగా హస్తములను జేర్చుట.

వియోగము :—(విసర్జితము లేక వ్రుసి) చేతులను విడదీయుట.

మాత్రము :—లఘువునకు మాత్రమే మాత్రము అనిపేరు.

తాళోద్ధాత్తము :— తాళము వేయునపుడు ఘాత యే స్వరము మీాద పడునో అట్టిస్వరమునకు తాళోద్ధాత్తమని పేరు.

స్వరోద్ధాత్తము :—తాళఘాతపడిన స్వరము తప్ప ఒక్కనమటి యేస్వరమునైనను నొక్కి పలికినదానికి స్వరోద్ధాత్తమని పేరు

—: తాళసప్తకము :—

1. ధృవతాళము :—అనిన మామూలుగా చతరశ్రజాతి ధృవ తాళము అనియే అనుకొనవలెను.

2. మఠ్యతాళము ('చతురశ్రజాతి మఠ్యతాళము')
3. రూపకతాళము ('చతురశ్రజాతి రూపకతాళము')
4. ఝంపెతాళము ('మిశ్రజాతి ఝంపెతాళము')
5. త్రిపుటతాళము ('త్రిశ్రజాతి త్రిపుటతాళము')
6. అటతాళము ('ఖండజాతి అటతాళము')
7. ఏకతాళము ('చతురశ్రజాతి ఏకతాళము')

# సప్త ప్రధానతాళముల అంగసంజ్ఞలు.

| నంబరు | తాళముపేరు | అంగసంజ్ఞ లేక గుర్తు | అక్షరములు |
|---|---|---|---|
| 1. | ధ్రువతాళము | I O I I | 14 |
| 2. | మఠ్యతాళము | I O I | 10 |
| 3. | రూపకతాళము | O I | 6 |
| 4. | ఝంపెతాళము | I ◡ O | 10 |
| 5. | త్రిపుటతాళము | I O O | 7 |
| 6. | అటతాళము | I I O O | 14 |
| 7. | ఏకతాళము | I | 4 |

# 35. తాళములు.

| తాళము పేరు | చతురశ్ర జాతి | త్రిశ్ర జాతి | మిశ్ర జాతి | ఖండ జాతి | సంకీర్ణ జాతి | అంగసంజ్ఞ |
|---|---|---|---|---|---|---|
| 1. ధ్రువ | 14 అక్షరాలు | 11 అక్షరాలు | 23 అక్షరాలు | 17 అక్షరాలు | 29 అక్షరాలు | I O I I |
| 2. మఠ్య | 10 ,, | 8 ,, | 16 ,, | 12 ,, | 20 ,, | I O I |
| 3. రూపక | 6 ,, | 5 ,, | 9 ,, | 7 ,, | 11 ,, | O I |
| 4. ఝంపె | 7 ,, | 6 ,, | 10 ,, | 8 ,, | 12 ,, | I ◡ O |
| 5. త్రిపుట | 8 ,, | 7 ,, | 11 ,, | 9 ,, | 13 ,, | I O O |
| 6. అట | 12 ,, | 10 ,, | 18 ,, | 14 ,, | 22 ,, | I I O O |
| 7. ఏక | 4 ,, | 3 ,, | 7 ,, | 5 ,, | 9 ,, | I |

# తాళముల అక్షర కాల వివరము.

(1) 3 అక్షర కాల తాళములు: 1 తిశ్రయేక 2 త్రిశ్రఝాపు,

(2) 4 అక్షర కాలతాళములు: 1 చతురశ్రయేక 2 దేశాది 3 మధ్యాది.

(3) 5 అక్షరకాలతాళములు: 1 ఖండయేక 2 ఖండఝాపు 3 త్రిశ్రరూపక.

(4) 6 అక్షరకాలతాళములు: 1 చతురశ్ర రూపక 2 తిశ్ర ఝంపె.

(5) 7 అక్షరకాలతాళములు: 1 ఖండరూపక 2 చతురశ్ర ఝంపె 3 తిశ్రత్రిపుట 4 మిశ్ర యేక 5 మిశ్రఝాపు.

(6) 8 అక్షర కాలతాళములు: 1 త్రిశ్రమఠ్య 2 ఖండఝంపె 3 చతురశ్రత్రిపుట (లేక ఆది)

(7) 9 అక్షరకాలతాళములు: 1 మిశ్రరూపక 2 ఖండత్రిపుట 3 సంకీర్ణయేక.

(8) 10 అక్షరకాలతాళములు: 1 చతురశ్రమఠ్య 2 మిశ్ర ఝంపె 3 తిశ్రఅట.

(9) 11 అక్షరకాలతాళములు: 1 త్రిశ్రధృవ 2 సంకీర్ణరూపక 3 మిశ్రత్రిపుట.

(10) 12 అక్షరకాలతాళములు: 1 ఖండమఠ్య 2 సంకీర్ణఝంపె 3 చతురశ్రఅట

(11) 13 అక్షరకాలతాళము: 1 సంకీర్ణత్రిపుట.

(12) 14 అక్షర కాలతాళములు: 1 చతురశ్రధృవ 2 ఖండఅట.

(13) 16 అక్షరకాలతాళములు: 1 మిశ్రమఠ్య.

(14) 17 అక్షరకాలతాళములు: 1 ఖండధృవ.

(15) 18 అక్షర కాలతాళములు : 1 మిశ్రఅట.
(16) 20 అక్షరకాలతాళము : 1 సంకీర్ణమఠ్య.
(17) 22 అక్షరకాలతాళము : 1 సంకీర్ణఅట.
(18) 23 అక్షరకాలతాళము : 1 మిశ్రధృవ.
(19) 29 అక్షరకాలతాళము : 1 సంకీర్ణధృవ.

35 తాళములలో నీసంకీర్ణజాతి ధృవతాళమే మిక్కిలి ఎక్కువ అక్షరములుగల తాళము.

## 1. వీ ణా వా ద్య వి వ ర ము

ఈ వాద్యము తంత్రీవాద్యములలోకెల్ల ప్రధానమైనది. బహు పురాతనవాద్యమనియు దెలియుచున్నది. ఎందుచేతనన ఎల్లవిద్యల కధిష్ఠానదేవతయైన సరస్వతీదేవిచే నీ వీణావాద్యమభ్యసింపబడినట్లును, త్రిలోక సంచారియు, దేవఋషియు, గానవిద్యాకౌశలుడును నైననారద మహామునియే ప్రప్రథమమున నీవీణవాద్యమును భూలోకమునకు దెచ్చియిచ్చినట్లును దెలియుచున్నవి. మనుజుని గాత్రమందిరువది రెండు శృతులెట్లు పలుకుచున్నవో అలాగుననే యీ వీణావాద్యమందును 22 శృతులు బలుకుచున్నవి గాన నీ వీణావాద్యమే ప్రశస్తమైన వాద్యమై నేటికిని వెలయుచున్నది. ఇయ్యది మానవ శరీరము ననుసరించి నిర్మింపబడిన వాద్యమగుటచే లక్ష్యలక్షణయుక్తమైన సంగీతవిద్య నామూలాగ్రముగ నీవాద్యమునభ్యసింప వీలగుచున్నది.

ఈ వీణలు నిర్మాణమందు అనేక రకములుగానున్నవి. ఉత్తర హిందూస్థాన వీణల తయారుచేయు విధము వేరు. దక్షిణహిందూస్థాన మందువీణలు తయారగు విధము వేరు.

ఉత్తరహిందూస్థానమున 4 అంగుళల పొడవుగల వెదురుకఱ్ఱ మీదమెట్లు అమర్చబడియుండి యీకర్ర కిరువైపుల చెక్కలతోతయా

రుచేసిన బుఱ్ఱల నతుకుదురు. ఈబుఱ్ఱలే నాదమునిచ్చునవి. వెదురు కఱ్ఱయే చేతిౘ్రేళ్ళనానించి వాయించుటకు చదునై యుండును. ఇదియే ఫింగర్ బోర్డు, ఈ రకపు వీణలను సుతారి లేక రుద్రవీణ లేక రస్బిన్ అందురు.

దక్షిణహిందూస్థానమందు తయారగు వీణలు ఆకారమందును, గానమాధుర్యమందునుగూడ చాలప్రశస్తమైనవి. ఈ వీణలను పనస కఱ్ఱ (జాక్‌వుడ్) మొదలైన కఱ్ఱలతో జేయుదురు. పనస కఱ్ఱమంచి నాదమునిచ్చును. వీణలో నొక వైపున ఒక గుండ్రమైన పెట్టె లేక బుఱ్ఱయుండును. ఇది గుల్లగానుండుటచే మంచి ధ్వనిని జనింపజేయును. ఈబుఱ్ఱలోతు తొమ్మిది అంగుళములు మొదలు పదిన్నర (9—10½) అంగుళములుండును. ఈ బుఱ్ఱనే కుండ (కొడమ్) యనియు అందురు. దీనిలోతు ఎంత ఎక్కువగానుండిన నంత గంభీరమైన నాదమువచ్చును ఈ కుండ ననుసరించియే వేళ్ళు ఆనుకొనే చదునైన దండము (ఫింగర్ బోర్డు) ఉండును. ఈ దండముకూడ చదునైన చెక్కలచే నమర్చబడియుండును. కుండయొక్క వ్యాసము 9½ అంగుళములు మొదలు 13 అంగుళముల వరకునుండును. ఈకుండను, దండమును కలిపి యాళి (Yali) యొక్కకంఠ, ముఖములకు జతచేయుదురు. ఈయాళియొక్క ముఖము త్రాచుపాము ముఖమువలెనుండును. దండముమీద వేరుగా తయారుచేయబడిన మైనముతో 25 మెట్లమర్చబడి యుండును. ఈమెట్లు ఉక్కుతోచేయబడిన కడ్డీలు.

వీణకు మొత్తము 7 తంత్రులుండును, తంత్రియనగా తీగ. ఈ తంత్రులలో నాలుగువీణాదండముమీద మెట్లమీదనుండి యమర్చబడి యుండును. వీనినే మీది తంత్రులందురు. మిగిలిన మూడుతంత్రులును వీణాదండమున కెడమవైపున నమర్చబడియుండును వీనినే ప్రక్కతంతులందురు. కుండమీద బ్రిడ్జియును, లోహపురేకునుగలిగిన కఱ్ఱ పీట

యొకటి అమర్చబడియుండును. కుండ మీదనతుకబడి యున్న లోహపు గోళ్ళములకు బిగింపబడి మీది తంత్రులు బ్రిడ్జిమీదనుండి మెట్లమీద నుండి యమర్చబడి యాళి యొక్క కంఠమున నుండు బిరడాలకు చుట్టబడి బిగింపబడియుండును. ఈ బిరడాలు శృతి హెచ్చించుకొనుటకుగాని తగ్గించుకొనుటకు గాని సాధనములుగా నుండును.

ప్రక్క మూడు తంత్రులును కుండమీద బ్రిడ్జి ప్రక్కన నుండు అర్ధ చంద్రాకారముగ నుండు లోహపు పీట మీద ఆనుకొని యుండులాగున నమర్చబడి దండము ప్రక్కననుండు మూడు బిరడాలకు మూడు తంత్రులును బిగింపబడి యుండును. ఈ ప్రక్క బిరడాలకును పైన జెప్పిన మీదితంత్రుల బిరడాలకును మధ్యముగా దండమునకు క్రింద యమర్చబడి మరియొక బుఱ్ఱయున్నది. ఈ బుఱ్ఱ 1 వీణను క్రిందపెట్టునపుడు సమమట్టముగా నానించును. 2 ఇదియును వీణానాదమును, మాధుర్యమును వృద్ధిచేయుటకు తోడ్పడును.

వీణలో నీస ప్తతంత్రులను ప్రారంభమగు స్థానమునకు 'కుండలి' యని పేరు. 4 బిరడాలమర్చబడియుండినవైపు సర్పముఖమును బోలిన ముఖమున్న భాగమే వీణయొక్క శిరోభాగము. ఈ కుండలి మొదలు శిరోభాగమువరకును వీణను ఆరు ఆధారములుగా విభజించిరి.

1. మూలాధారము :— కుండమీద అన్నితంత్రులు ముడివేయబడినచోటు(ఇదియేకుండలియనబడును.)
2. స్వాధిష్ఠానము :— కుండమీద బ్రిడ్జి (పీట) యమర్చబడినచోటు.
3. మణిపూరము :— వీణాదండముమీద 24 వ మెట్టుఅమర్పబడిన చోటు.
4. అనాహతము :— వీణాదండముమీద 19 వ మెట్టుఅమర్పబడిన చోటు.

5. విశుద్ధము :— వీణాదండముమీద 12 వ మెట్టుఅమర్ప బడిన చోటు.

6. ఆజ్ఞ (అజనాయ) : — వీణాదండముమీద 7 వ మెట్టు అమర్ప బడిన చోటు.

N. B:— ఈ ఆరు ఆధారములనే షడాధారములనియు (Nerve Centres) షట్చక్రములనియు అందురు. ఈ ఆరుచక్రములును శరీర మందున్నవి. వానిననుసరించియే వీణలోని యాధారముల యేర్పాటు యున్నది. వీణయందలి ఆరు ఆధారములకును ఒక్కొక్క ఆధారమునకును 12000 నాళములుండుటచే ఆ నాళములద్వారా 6 ఆధారములకు $12000 \times 6 = 72000$ రాగములను సృష్టింపగలశక్తి వీణకున్నదని పెద్దలు చెప్పుదురు. ఇందుమూలముననే వీణ సంపూర్ణమైన సర్వశక్తులు గల సంగీతవాద్యముగా నాదికాలమునుండి నేటివరకును అత్యున్నత స్థానమును బొందియున్నది.

## శృ తి జే యు ప ద్ధ తి .

వీణాదండము మీదనుండు మీటెడు తంత్రుల నాల్గింటికిని వరుసగా 1 అను మంద్రపంచమము 2 మంద్రషడ్జము 3 మంద్రపంచమము 4 మధ్యషడ్జము (సారణి) యని పేరులు.

ప్రక్కతంత్రుల 3 తంత్రులకు 1 మధ్యషడ్జము లేక ప్రక్కసారణి 2 మధ్యపంచమము (ప్రక్కపంచమము) 3 తారషడ్జము లేక తీవ్రసారణి యని పేళ్లు.

వీణను శృతిజేయునపుడు మొదట మీది తంత్రులలోని 4 వ తంత్రియైన సారణిని (మధ్యషడ్జము) గాయకుని యనుభవమును బట్టి శృతిజేసుకొని పిమ్మట యీసారణి శృతిననుసరించి మంద్రపంచమతంత్రిలో మంద్రపంచమమును, మంద్రషడ్జమతంత్రిలో మంద్రషడ్జమును, పిమ్మట అనుమంద్రపంచమతంత్రిలో అనుమంద్రపంచమమును శృతి

జేసికొనవలెను. పిమ్మట ప్రక్కసారిణిని మీఁది మధ్యషడ్జమతంత్రి శృతినే జేసికొని, ప్రక్క పంచమతంత్రిలో మధ్యపంచమమును, ప్రక్క తీవ్రసారణితంత్రిలో తారషడ్జమును శృతిజేసికొనవలెను. ఈ వాద్యము వాయించు విధమును సద్గురు ముఖముననే నెరుంగవలెను.

## వయోలిన్ వివరము (ఫిడేలు)

ఈ వాద్యము మనదేశమందు నిర్మింపబడినదికాదు. ఇది పాశ్చాత్యదేశములో (యూరపు) కనిపెట్టబడిన యొకవిధమైన నవీన తంత్రీవాద్యము. (నవీన మనగా వీణకంటె నవీనము) ఈ వాద్యము మనదేశమునకు గొనిరాబడినపిమ్మట యిది మన కర్నాటక సంగీతమున కెంతయో తగియున్నటుల దెలిసికొనబడినది. గాత్రపాట యెంతయో రమ్యముగా ప్రదర్శించుటకీ వాద్యము అతి ముఖ్యమైన ప్రక్కవాద్యముగా నున్నది. గాత్రపాటేకాదు, వీణ మొదలగు వాద్యకచ్చేరీలకుగూడ నిది ప్రక్కవాద్యముగా నున్నది. ఇంతేగాక నోటితో పాడకుండ యీ వాద్యముతో సోలోకచ్చేరీలు చేయబడుచున్నవి. కర్నాటక, హిందూస్థానీ, యూరోపియను సంగీతములు సంపూర్ణముగా నీ వాద్యమందు ప్రదర్శించుట కెంతయో తగియున్నదిగాన యీ తంత్రీవాద్యముకూడ మిగుల ప్రముఖ్యతను గాంచియున్నది.

ఈ వాద్యము ఒకవిధమైన తేలిక కర్రతో చేయబడు చున్నది. ఇది పలుచని చెక్కలతో సందముగా నమర్చబడియున్న ఒకగుల్లపెట్టెయై యున్నది. ఈ పెట్టె ననుసరించి యొకదండము కొంచెము పొడుగుగా నుండును. ఈ దండముచివర వంపుతిరిగియున్న భాగమే దీని శిరోభాగము. దీని దిగువను ప్రక్కకు రెండుచొప్పున నాలుగు బిరడాలున్నవి. ఇవియే దాని చెవులు. ఈ చెవులకు దిగువనుండు భాగము పెట్టెవరకునుండు భాగమునకు కంఠమని పేరు. ఇక్కడనుండి దీని పెట్టెభాగము కొంచెము చిన్నదిగానుండి పోను పోను చివరభాగము దీని

కంటె వెడల్పుగాను పెద్దదిగాను నుండును. దండముపెట్టెమీదకూడ కొంతవరకుండును. ఈ పెట్టెకు మధ్యమున నొక్కి వేసినట్లుండును. ఈ పెట్టె చివరను బట్టను వుండును. ఈ బట్టనునుండి కొంత దూరములో పెట్టెమీద నాల్గు తీగలను ముడివేయు గొళ్ళెములుండును. ఈ గొళ్ళెములకు కొంచెముముందు వీణలోవంటి బ్రిడ్జి యుండును. ఈ బ్రిడ్జి కిరువైపులను ( ) యీ గుర్తువంటి రెండురంధ్రము లుండును. ఈరంధ్రములనుండి వాయువు పెట్టెలోనికి ప్రవేశించుట వలననే గంభీరమైన నాదము పుట్టుటకు కారణమగు చున్నది. ఈ వాద్యమునకు నాలుగు తంతులుమాత్రమే గలవు. తంత్రులను వీణలోని కుండలిస్థానమందు వలెనే యీవాద్యములో బ్రిడ్జికి వెనుకనుండు రింగులకు ముడివైచి బ్రిడ్జిమీదనుండి వరుసగా దండము (ఫింగరుబోర్డు) మీదనుండి గొంపోబడి చెవులకు (Pegs) చుట్టబడి బిగింపబడును. ఈ తంత్రులను వాయించుటకు కమాను అని చెప్పబడు మరియొక సాధనమున్నది. అది యొక సన్నని కర్ర. దానికి వెండ్రుకలు (hairs) దారములవలె దగ్గరగా కర్రపొడవున నమర్చబడి యుండును. ఈ వెండ్రుకలుగల కమానుచే వయొలిన్ తీగలమీద రాచిన ధ్వనిపుట్టును. ఫింగర్ బోర్డుమీద వ్రేళ్లతో తంత్రులను చెప్పబడినవిధముననొక్కుచు కమాను తంత్రులమీద లాగిన స్వరములు మంచినాదముతో బయలు వెడలును. వయొలిన్ చదునుగానుండి తేలికగా నుండును.

## వయొలినుకు వేయు తంత్రుల వివరము.

ఈ వాద్యమునకు నాలుగు తంతులుగలవు. ఇందు (1) ఒకటవ తంత్రి పట్టు, లేక నరము, లేక ఉక్కుమీద జల్తారుచుట్టబడి యుండును, వీనిలో పట్టుతంత్రి మిగుల శ్రేష్టము.

(2 × 3) రెండుమూడుతంత్రులు నరముతో చేయబడియుండును ఈ రెంటిలో మూడవది కొంచము సన్నముగా నుండును.

(4వ) నాల్గవతంత్రి కేవలము ఉక్కుతో చేయబడి యుండును.

## శ్రుతి చేయు విధము.

ఈతంత్రుల నాల్గింటికి వరుసగా: 1 మంద్రము 2 పంచమము 3 సారణి 4 హెచ్చుపంచమము అని పేరులు శ్రుతిజేయునపుడు మంద్ర తంత్రిలో మంద్రస్థాయిషడ్జమును, పంచమతంత్రిలో మంద్రస్థాయి పంచమమును, సారణితంత్రిలో మధ్యస్థాయి షడ్జమును, హెచ్చు పంచమతంత్రిలో మధ్యస్థాయి షడ్జమును, పలుకునటుల జేసి, మంద్ర స్థాయిస్వరములను మంద్రపంచమతంత్రులలోను, మధ్యస్థాయి స్వరము లను సారణ హెచ్చుపంచమతంత్రులలోను, తారస్థాయి స్వరములను హెచ్చుపంచమతంత్రి పైభాగమందును వాయించవలెను.

ఈ వాద్యమందు పంచమశ్రుతి యనియు (2) మధ్యమశ్రుతి యనియు రెండువిధముల శ్రుతి చేయనగును.

పంచమశ్రుతి యందలి పంచమ స్వరములను శుద్ధమధ్యముగా జేసిన మధ్యమశ్రుతి యగును. ఈ మధ్యమము షడ్జమమై పంచమశ్రుతి లోని షడ్జమే దీనికి పంచమముగా బలుకును. పురుషులకు పంచమశ్రుతి యును, స్త్రీలకు మధ్యమశ్రుతియును గానమునకు జెప్పబడినది.

# గోటువాద్య వివరము.

ఈ గోటువాద్యమునే 'మహానాటకవీణ' యందురు. ఇది ఒక్క విషయములోతప్ప తక్కిన అన్నివిషయములందును వీణవాద్యమునే పోలియుండును. ఇది తంత్రీవాద్యములలో మీటువాద్యమై యున్నది. వీణకును గోటుకును వ్యత్యాసమేమన వీణవాద్యములో స్వరస్థానముల నిర్దేశించు మెట్లు గోటులో లేవు. ఈయొక్క విషయమందే యీ రెండును భేదించుచున్నవి. వయొలిన్‌లోవలెనే సంగీత విద్యాభ్యాసకులు స్వరస్థానముల నిర్ణయమును గురుముఖమున నెఱిఁగి యభ్యాసము చేయ

వలెను. వాద్యము లన్నిటిలో గోటువాద్య మభ్యసించుట చాల కష్ట తరము.

అయితే యీవాద్యము మిగుల సున్నితమై మంచి గంభీరనాద ము నుదయింపజేసి వినువారి మనముల సొక్కుడుగ రంజింప జేయును.

## తంత్రుల వివరము.

వీణవలెనే యీవాద్యమందును సప్త (7) తంత్రులుగలవు. వీణ వలెనే 4 తంత్రులు మీదితంత్రులు 3 తంత్రులు ప్రక్కతంత్రులు. వీణావాద్యనిర్మాణమే (మెట్లుతప్ప) గోటువాద్య నిర్మాణము.

ఈ తంత్రులనామములును వీణాతంత్రుల నామములే అయి యున్నవి. మీదితంత్రులు శృతి జేయునపుడు 1 అనుమంద్ర పంచమ తంత్రిలో అనుమంద్రపంచమమును, 2 మంద్రతంత్రిలో మంద్రషడ్జ మును, 3 మంద్రపంచమతంత్రిలో మంద్రపంచమమును, 4 సారణిలో మధ్యషడ్జమును పలుకునటుల శృతి జేసిపిమ్మట 1 ప్రక్క సారణి తంత్రిలో మధ్యషడ్జమును 2 ప్రక్క పంచమతంత్రిలో మధ్యపంచమ మును 3 ప్రక్క తీవ్రసారణిలో తారషడ్జమును బలుకునటుల శృతి జేయవలెను.

ఈ వాద్యమును మీటి వాయించుటకొరకు 2½ అంగుళముల పొడవుగల గుండ్రని, సన్నని, దూళ్లకర్రవంటి యొక కొయ్యముక్క యుండును. ఈ కొయ్యముక్కను యెడమచేతితో పట్టుకొని మీట వలెను. వీణవలెనే యీవాద్యమును, వయొలినునుగూడ గురువువద్దనే నభ్యసించి నేర్చుకొనవలెను.

## వేణువాద్యము (FLUTE)

వేణువు అనగా వెదురు గొట్టము. దీనికి రంధ్రము లుండును. ఇది నాగస్వరము, సన్నాయి మొదలగు రంధ్రములుగల గాలివాద్య

జాతిలో చేరినది. సంగీతవాద్యములన్నిటిలో రంధ్రవాద్యములే బహుపురాతన మైనవి. ప్రాచీన గ్రంథములబట్టి రంధ్రవాద్యము లనేకరకములుగానుండి వాడుకలో నున్నట్లు గాన్పించుచున్నది. అందు వేణువు ముఖ్యముగా నందరి యామోదమును బడసియుండి వాడబడుచున్నది. ఈజాతియందుకూడ పెక్కురకములు గల వు · నామము లును వేరు వేరుగా నున్నవి, అవి యెవ్వియన 1. వంశము 2. పావము 3 పావికా 4. మురళీ 5. మధుకరీ 6. కాహళము 7. తుండకినీ 8. చుక్కా 9. శృంగము 10. శంఖము— అని పది రకములుగా నున్నవి. ప్రస్తుత కాలమున వాడుకలోనున్న వేణువు— ఒకటవదైన వంశమును చాల వరకు బోలియున్నది.

## వేణువుయొక్క పరిమాణము.

శార్ఙ్గదేవుడు తనకాలమందే ఈ వాద్య పరిమాణమందు పెక్కుభేదాభిప్రాయములుండినట్లు వ్రాసియున్నాడు. నోటిరంధ్రము (mouth hole) నుండి వ్రేలి రంధ్రమువఱకుగల యంతరమునుగూర్చియే అభిప్రాయభేదములున్నవి

వేణువుయొక్క లోపలి వ్యాసము (diameter) సుమారొక యంగుళ ముండవలెననియు, వ్రేలిరంధ్రము లెనిమిదియుండవలెననియు ప్రతివ్రేలి రంధ్రమును రేగు గింజ చొరపడునంత యుండవలెననియు శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరమందు దెల్పియున్నాడు.

'శిలప్పధికార' మను ద్రావిడ గ్రంధమందు వేణువుయొక్క కొలత లీదిగువ విధమున నున్నవి :—

1. వేణువు పొడవు ఇరువది యంగుళములు.
2. మందము లేక పరిధి (Circumference) నాలుగున్నర అంగుళములు.

3. వ్రేలిరంధ్రపు వైశాల్యము వడ్లగింజ ప్రమాణము.

4. వేణువు వంకర లేకను, ఇరువైపుల గుణుపులు లేకను నుండవలెను.

5. నోటిరంధ్రమునుండి వ్రేలి రంధ్రమునకు ఏడంగుళముల దూరముండవలెను.

6. ప్రతి వ్రేలి రంధ్రమునకు ఎడము రెండంగుళములుండవలెను.

7. వ్రేలి రంధ్రముయొక్క ఎడమవైపు లక్కతోగాని మఱియే యితర పదార్థముతోగాని మూయవలెను.

8. వ్రేలిరంధ్రములు ఎనిమిది యుండవలెను. ఎనిమిదవ రంధ్రమునుండి వేణువుయొక్క చివర భాగమునకు రెండంగుళములుండవలెను. వ్రేలి రంధ్రములన్నియు ఒక వరుసగా నొకేమోస్తరుగా నుండవలెను.

ఇట్టి వేణువుయందు సహజముగా హరికాంభోజి రాగముత్పన్నమగును. అని చెప్పబడియున్నది.

మరియు సప్తరంధ్రముల నెడమచేతి మూడువ్రేళ్ళతోను, కుడిచేతి నాలుగువ్రేళ్ళతోను, మూయవలెనని, సంగీత గ్రంథములన్నియు నేకీభవించుచున్నవి.

వేణువును తయారుచేయుట కుపయోగించు పదార్థములు :—

1. వెదురు 2. కేదార (యూపస్తంభమునకుపయోగించుకఱ్ఱ) 3. దంతము 4. శ్రీగంధపు కఱ్ఱ 5. చందనపు కఱ్ఱ 6. రక్తచందనపు కఱ్ఱ 7. ఇనుము 8. కంచు 9. వెండి 10 బంగారము మొదలగువానితో వేణువాద్యములు తయారగును. కాని వీని యన్నిటిలోను వెదురుతో తయారగు వేణువాద్యమే మిక్కిలి శ్రేష్ఠమైనది. ఎందుచేతనన వెదురు గొట్టమునుండి జనించుధ్వని మిక్కిలి మాధుర్యమైనది. మఱియు

వెదురునుండి చక్కని యుచ్చారణాత్మకమైన ధ్వనులు పుట్టి గానయోగ్యముగా నుండటయే వెదురు వేణువు యొక్క ప్రాశస్త్యమునకు గారణము.

## వేణువుయొక్కయుత్పత్తి.

ఒకప్పుడు మానవుడరణ్య ప్రాంతముల సంచరించుచుండ వెదురునందు తుమ్మెదలు తమ నివాసముకొరకు జేసిన రంధ్రములందు వాయువు ప్రసరించుటచే ధ్వని వినబడినదట. ఆ ధ్వని గానమాధుర్యమునకవకాశమున్నటుల మానవునకుదోచగా మానవుడు వెదురుగొట్టము తయారుచేసి యందు రంధ్రములనియమించి బలముగా వాయువునూది గానమాధుర్యముగల స్వరముల జనింపజేసెనట. క్రమముగా వెదురు లేక తత్సమానమైన యితరగొట్టముల తయారుచేసి సప్తరంధ్రములనిర్మించి సప్తస్వరముల బలికించెనని తెల్లమగుచున్నది.

ఈ సప్తరంధ్రముల కుడినుండి యెడమకు నొక్కొక్కటి వరుసగా వక్త్రరంధ్రము (mouth hole) వైపు తెఱచుటచే సప్తస్వరముల యారోహణక్రమమును యెడమనుండి కుడికి తెఱచుటచే నవరోహణ క్రమమును యేర్పడెను. కాలక్రమమున స్థాయిల వివరమును, శృతిభేదములను, మేళకర్త రాగలక్షణములను గ్రహించినపిమ్మట వేణువుయొక్క నిర్మాణమందు నోటిరంధ్రమునుండి వ్రేలిరంధ్రముల వరకుగల యంతరముల నేర్పరచుటలో మార్పులు గావించు ప్రయత్నములు గావింపబడి నిర్ధారణ చేయబడెను. ఇందుమూలమున స్థాయిభేదముల ననుసరించి పలువిధములగు వేణువు లుత్పన్నమయ్యెను. అయితే రాగముల భేదముల ననుసరించి వేర్వేరు వేణువుల నుత్పత్తి జేయుట కష్టమనితోచి మానవుడు ఒక్కవేణువునందే రంధ్రములను కొంచెము మూయుటవలనను తెఱచుటవలనను. గాలినూదుటలో మార్పులనుగమ

సించి స్వరభేదముల మార్పుల గ్రహింప గలిగెను. ఇట్లు చేయుటలో మంద్రస్థాయిస్వరముల బలికించుటకు 8 రంధ్రము లవసరమనియు గని పెట్టి యెనిమిదవ రంధ్రమునేర్పరచి మనుజ గాత్రమందువలెనే 2½ స్థాయిల స్వరములు పలికించుటకు వ్రేళ్ల నుపయోగించువిధమును గూడ దెలిసికొని వేణువును సంపూర్ణగాన యోగ్యముగ బ్రస్తుతస్థితికి మానవుడు తేగలిగెను.

ఇట్టి వేణువాద్య మభ్యసించువారు అభ్యాసవిషయముల గురుముఖముననే తెలియదగును.

## తంబుర వాద్యము.

ఈ వాద్యము తంత్రీవాద్యములలో జేరినది యయ్యును శృతి వాద్యము (డ్రోన్) గా మాత్రమే వాడబడుచున్నది. ఇయ్యదియు వీణ వలెనే బహుపురాతన మైనది. పాటకచ్చేరీలయందిప్పటికిని ఈ వాద్యమునే శృతివాద్యముగా వాడుచున్నారు. దీనిని విశేషముగా పనసకర్ర తో తయారుచేయుదురు. ఏగిసకర్రతోను జేయుచున్నారు. పనసకర్ర తో చేసినదే శ్రేష్టమని యెంచబడుచున్నది. తంజావూరు తంబురలు చాల ప్రసిద్ధము లైనవి.

తంత్రుల వివరము :— తంబుర వాద్యమునకు ముఖ్యముగానాలుగు తంత్రులుండును. వానిలో మొదటిమూడుతంత్రులును ఉక్కుతంత్రులు నాల్గవతంత్రి యిత్తడితంత్రియై యుండును. ఈ నాలుగుతంత్రులకును వరుసగా 1 పంచమము 2 సారణి 3 అనుసారణి 4 మంద్రము అని పేరు.

శృతిజేయుపద్ధతి :—దీనియందును 1 పంచమశృతి 2 మధ్యమ శృతి యని రెండురకముల శృతి జేయవచ్చును.

1 సారణి 2 అనుసారణి తంత్రుల రెంటిలోను తారస్థాయి షడ్జమును, మంద్రతంత్రిలో మధ్యస్థాయి షడ్జమును బలుకునటుల జేసి పిమ్మట పంచమతంత్రిలో మధ్యస్థాయి పంచమము పలుకునటుల జేసిన చో నిది పంచమశృతియగును. ఈపంచమమునకు బదులు మధ్యస్థాయి శుద్ధమధ్యమము పలుకునటుల జేసినయెడల మధ్యమశృతి యగును. పంచమశృతి పసాస అనియు మధ్యమశృతి సపసమ అనియు పలుకును.

తంత్రులను వేయు విధము :— తంబురయొక్క నాలుగు తంత్రులను మూలాధారమునద్ద వెడ్డివెచి కుండమీద నమర్పబడిన పీట (బ్రిడ్జి) మీదుగా తంబుర చివరనుండు బిరడాలకు చుట్టి బిగించవలెను.

జీవాళి దాని ఉపయోగము :—పీటమీద (బ్రిడ్జిమీద) తంత్రుల యడుగున నమర్పబడు ఉన్నిసంభంధమైన దారము కు జీవాళి యందురు. ఈ దారము నమర్చుట వలన తంత్రుల మీటునపుడు ఒక విధమైన గంభీరనాదము బయలు వేరి జీవముగల ధ్వనిగాపరిణమించును. అనగా జీవాళివలన స్వయంభూస్వరము లుత్పన్నమై నియతస్థానము జేరి యాధారశృతిలో లీనమగుటవలన నాదము గంభీరముగా జీవము గలదై యుండును. ఇదియే జీవాళియొక్క యుపయోగము.

ఈ గ్రంథములో జెప్పబడిన స్వర సాధకములన్నియు మొట్ట మొదట మాయామాళవగౌళ రాగమందు సంగీతవిద్యార్థులుప్రారంభించి సాధకముచేయవలెను. ఈరాగమందలి స్వరములు (ఆరోహణమందు:— స రి గ మ ప ధ ని స—అవరోహణమందు:— స ని ధ ప మ గ రి స) షడ్జము. శుద్ధరిషభము, అంతర గాంధారము, శుద్ధమధ్యమము, పంచమము, శుద్ధధైవతము, కాకలి నిషాదము—అని జ్ఞప్తియందుంచుకొని సాధకముచేయవలెను. స్వరసాధకమును బాగుగా నీరాగమం దభ్యసించిన పిమ్మట విద్యార్థులు ఈ స్వరసాధకములనే 1. శంకరాభరణము 2. హరికాంభోజి 3. ఖరహరప్రియ 4. కల్యాణి 5. హనుమత్తోడి— యీరాగములలో బాగుగా సాధకముచేయవలెను.

మాయామాళవగౌళరాగముతో స్వరసాధకము ప్రారంభించుటకు కారణములేమన 1. ఈ రాగము చాల శుభప్రదమైనది. 2. ఇది శుద్ధరాగముగాన స్వరస్థానములు నిష్పేచీర్యైనవి. 3. పురందరవిఠలునిచే సంగీతవిద్యాభ్యాసకులకీ విధముగా నేర్పాటుచేయబడి ఆయనకాలమునుండీ యింతవరకును మన కర్నాటక సంగీతమందు ఈ రాగముతో ప్రారంభించుట యనుశ్రుతముగా నున్నది. 4. ఈ రాగముతో ప్రారంభించుటచే విద్యాభ్యాసకులకు స్వరసాధకము సులభగ్రాహ్యమగుచున్నది. అంతేగాక శీఘ్రముగను శుద్ధముగను విద్యార్థు లభ్యసించ గలిగి యభివృద్ధిగన చున్నారు. పిమ్మట తక్కిన రాగములలోని స్వరస్థానములు సులభముగ గ్రహించి యభ్యసింప గలుగుచున్నారు. ఈ కారణములచే మాయామాళవగౌళరాగమే చాల శ్రేష్ఠమైనదని కర్నాటక సంగీత విద్వాంసుల యభిప్రాయమై యున్నది.

# శ్రుతిసాధకస్వరములు.

## 1. పాఠము.

1. సా సా — పా పా — సా సా
   సా సా — పా పా — సా సా॥

2. స స స స — ప ప ప ప — స స స స
   స స స స — ప ప ప ప — స స స స॥

3. సా స స — పా ప ప — సా స స
   సా స స — పా ప ప — సా స స॥

4. సా స స — స స పా — స స పా — స ప సా
   సా స స — స స పా — స స పా — స ప సా॥

## 2. పాఠము

1. స రి గ మ — ప ధ ని స̇ — స̇ా ; — స̇ా ;
స̇ ని ధ ప — మ గ రి స — సా ; — సా ;॥

2. స రి గ మ — ప ధ ని స̇ — స̇ా ; — పా ;
స̇ ని ధ ప — మ గ రి స — సా ; — పా ;॥

3 స రి గ మ — ప ధ ని స̇ — స̇ా ప̇ా — పా పా
స̇ ని ధ మ — మ గ రి స — సా సా — పా పా॥

4. స రి గ మ — ప ధ ని స — సా పా — సా పా
స̇ ని ద ప — మ గ రి స — సా పా — సా పా॥

5. స రి గ మ — ప ధ ని స — స̇ స̇ స̇ స̇ — ప ప ప ప
స̇ ని ద ప — మ గ రి స — స స స స — ప ప ప ప॥

6. స̇ రి గ మ — ప ధ ని స — స̇ స̇ ప ప — స̇ స̇ ప ప
స̇ ని ధ ప — మ గ రి స — స స ప ప — స స ప ప॥



౨. ప్రథమ—ద్వితీయ—తృతీయ—చతుర్థకాలములలో సరళీస్వరములను సాధకము చేయు విధమును జూపు పథకము.

## మాయామాళవగౌళ రాగము — ఆదితాళము.

ఆరోహణ :— స రి గ మ ప ధ ని స̇

అవరోహణ :— స̇ ని ధ ప మ గ రి స ॥

| తాళము I=4 | ౦=2 | o=2 |
|---|---|---|
| స రి గ మ<br>స̇ ని ధ ప | ప ధ<br>మ గ | ని స̇<br>రి స |
| సరి – గమ – పధ – నిస̇ | స̇ని – దప | మగ – రిస |
| సరిగమ – పధనిస̇ – స̇నిదప – మగరిస | సరిగమ – పధనిస̇ | స̇నిధప – మగరిస |
| (1) సరిగమపధనిస–<br>(2) స̇నిధపమగరిస– | (1) సరిగమపధనిస<br>(2) స̇నిధపమగరిస | (1) సరిగమపధనిస<br>(2) స̇నిధపమగరిస |
| (3) సరిగమపధనిస<br>(4) స̇నిధపమగరిస | | |

2

| | | |
|---|---|---|
| 1=4 | ౦ | ౦ |
| స రి గ మ<br>ప్రథమకాలము | ప ద ని స<br>ద్వితీయ కాలము | ṡనిదప–మగరిస<br>తృతీయ కాలము |

3

| | | |
|---|---|---|
| 1=4 | ౦ | ౦ |
| ṡరిగమ–పధనిస<br>తృతీయకాలం – ననిధప<br>ద్వితీయ కాలం | మ – గ<br>ప్రథమ | రి – స<br>కాలము. |

ఈ విధముగ స్వరావళులు నన్నిటిని సాధకము చేయవలెను.

# సరళీస్వరములు.

## 4వ పాఠము.

1. సరిగమ – పధనిస – సనిధప – మగరిస॥

2. సరిగమ – సరిగమ – సరిగమ – పధనిస
సనిధప – సనిధప – సనిధప – మగరిస॥

3. సరిగమ – సరిసరి – సరిగమ – పధనిస
సనిధప – – సనిసని – సనిధప – మగరిస॥

4. సరిగమ – పాపా – సరిగమ – పధనిస
సనిధప – మామా – సనిధప – మగరిస॥

5. సరిగమ – పాసరి – సరిగమ – పధనిస
సనిధప – మాసని – సనిధప – మగరిస॥

6. సరిగమ – పమగరి – సరిగమ – పధనిస
సనిధప – మపనిని – సనిధప – మగరిస॥

7. సరిగమ – పమధప – సరిగమ – పధనిస
సనిధప – మపగమ – సనిధప – మగరిస॥

8. సరిగమ – రిగమప – సరిగమ – పధనిస
సనిధప – నిధపమ – సనిధప – మగరిస॥

9. సరిగమ – పాగమ – పా; – పా;
గమపధ – నిధపమ – గమప–గ – మగరిస॥
పానిధ – నీధప – ధాపమ – పాపా
గమపధ – నిధపమ – గమప–గ – మగరిస॥

11. సరిగరి – గా–గమ – పమపా – ధపధా
మపధప – ధనిధప – మపధప – మగరిస॥

12. సరిగమ – పాపా – ధధపా – మమపా
ధనిసా – సనిధప – సనిధప – మగరిస॥

### 5వ పాఠము.

1. సరిసరి – సరిగమ – సరిగమ – పధని**స**
   **స**ని**స**ని **స**నిధప – **స**నిధప – మగరిస॥
2. సరిగ–స–రిగ–సరి – సరిగమ – పధని**స**
   **స**నిధ––నిధస–**స**ని – సనిధప – మగరిస॥
3. సరిగమ – సమగరి – సరిగమ – పధని**స**
   సనిధప – **స**పధని – **స**నిధప – మగరిస॥
4. సరిగమ – పధసరి – సరిగమ – పధని**స**
   **స**నిధప – మగ**స**ని – **స**నిధప – మగరిస॥
5. సరిగమ – పధనీ – సరిగమ – పధని**స**
   **స**నిధప – మగరీ – **స**నిధప – మగరిస॥
6. **సస**నిధ – నినిధప – ధధపమ – పాపా
   గమపధ – నిధపమ – గమప–గ – మగరిస॥

### హెచ్చుస్థాయి వరుసలు

### 6వ పాఠము:

1. సరిగమ – పధని**స** – **సా**; – **సా**;
   ధని**సరి** – **స**నిధప – మగరిస॥
2. సరిగమ – పధని**స** – **సా**; – **సా**;
   ధని**సరి** – **ససరిస** – **సరిస**ని – ధపమప
   ధని**సరి** – **స**నిధప – **స**నిధప – మగరిస॥
3. సరిగమ – పధని**స** – **సా**; – **సా**;
   ధని**సరి** – **గరిసరి** – **సరిస**ని – ధపమప
   ధని**సరి** – **ససరిస** – **సరిగస**ని – ధపమప
   ధని**సరి** – **స**నిధప – **స**నిధప – మగరిస॥

4. సరిగమ – పధనిస – సా; – సా;
ధనిసరి – గమగరి – సరిసని – ధపమప
ధనిసరి – గరిసరి – సరిసని – ధపమప
ధనిసరి – సనరిస – సరిసని – ధపమప
ధనిసరి – సనిధప – సనిధప – మగరిస॥

5 సరిగమ – పధనిస – సా; – సా;
సరిగరి – రిసనిస – రిసనని – ధనిసని
నిధపధ – నిధధప – మపధప – పమగమ
పమమగ – మపధని – సనిధప – మగరిస॥

6. సరిగమ – పధనిస – సా; – సా;
సరిగా – రిసనిస – రిసని – ధనిపా
నిదపద – నిదప – మపధా – పమగమ
పామగ – మపధని – సనిధప – మగరిస॥

మంద్రస్థాయి వరుసలు.

7వ పాఠము.

1. సనిధప – మగరిస – సా; – సా;
గరిసని – సరిగమ – సరిగమ – పధనిస॥

2. సనిధప – మగరిస – సా; – సా;
గరిసని – ససనిస – సనిసరి – గమపమ
గరిసని – సరిగమ – సరిగమ – పధనిస॥

3. సనిధప – మగరిస – సా; – సా;
గరిసని – ధనిసని – సనిసరి – గమపమ.
గరిసని – ససనిస – సనిసరి – గమపమ
గరిసని – సరిగమ – సరిగమ – పధనిస॥

దాటువరుస ప్రయోగములు రంజకములు. ఈరాగమున మంద్ర స్థాయి నిషాదమునకు దిగువను, తారస్థాయి గాంధారమునకు పైనను సంచారము లేదు.

సంచారము :

గమపధనిస్తా - సానిధపమ - ధపమరిగమరిసా
రిరిసపామ - దధపమరిగమపదని - సాగరిసా
నిరిసాస - సాదాపమరిగమరీ - గమపదని
సారినిసాదనిపద - నిధపమపరిగమప - రిగమ
రిసన్నిసన్నిరిసా ॥

రచనలు :

తానవర్ణము :— ఇంతమోడిసేయ - ఆది.
కృతులు :— నీవాడనేగాన — ఆది } త్యాగరాజు
ఏమిదోవబల్కు-మా — ఆది } గారు
అరుణాచలనాథంస్మరామి - త్రిశ్రఏక
ముద్దుస్వామి దీక్షితులుగారు.

ధన్యాసిరాగలక్షణము.

ఇది 8 వ మేళకర్తయైన హనుమత్తోడిజన్యం.

ఆరోహణ :— స గ మ ప ని స
2 1 2

అవరోహణ :— స ని ధ ప మ గ రి స
2 1 1 2 1

ఉపాంగరాగము.

ఔడవ-సంపూర్ణరాగము. ఆరోహణమందు రిషభ, ధైవత ములు వర్జితములు. అవరోహణ సంపూర్ణము. ఈ రాగమునకు సాధా

రణగాంధార, కైశికీనిషాదములు రాగఛాయాస్వరములు. మొదటి యామమున పాడదగును. ఈరాగమందు 'గ గ మ మ ప ప ని ని' మొదలగు జంటవరుస ప్రయోగములున్ను, "సరినిసపప – దదమ" మొదలగు దాటువరుసప్రయోగములున్ను గలవు.

సంచారము:

గమపనీస్సా – సనిసగరిస్సా – నిదపమదప – మగరీసా
గామాపానీ – నీస్సారీస్సా – సనిగామగరిసరినిదప
నీస్సాసనిదపమగా – మపదపమగరీసా – సనిధపనీసా॥

రచనలు:

వర్ణము:— నెనరుంచి నన్నేలుకోరా – ఖండఅట.
పదవర్ణము:— ఏమగువబోధించెర – ఆది – మైసూరు సదా శివరావుగారు.

కృతులు:— రామాభిరామా — ఆది
ధ్యానమేవరమైన — ఆది
శ్యామసుందరాంగ —రూపకం
ఎందుబాయురాదయ — ,,
సంగీతజ్ఞానమున — ఆది
నీచిత్తము నిర్మలము — చాపు
శ్రీరామదాసదాసోహాం –చాపు
} త్యాగరాజుగారు

## సావేరిరాగలక్షణము.

15 వ మేళం మాయామాళవగౌళజన్యరాగము.

ఆరోహణ:— స రి మ ప ధ స
1 1 1

అవరోహణ:— స ని ధ ప మ గ రి స॥
3 1 1 3 1

ఔడవ-సంపూర్ణము. షడ్జగ్రామము. రక్తిరాగము. ఎల్లపుడు పాడదగును. అంతరగాంధార, శుద్ధమధ్యమ, శుద్ధధైవతము లీరాగము నకు జీవస్వరములు. ఈరాగమందు 'స రి మ గా' "ప ని స" యను నపుడు అంతర గాంధార కాకలీనిషాదములు శుద్ధముగా బల్కును. కాని 'స రి గా' 'ప ద నీ' అనెడి కొన్ని ప్రయోగములందు అన్య స్వరములైన సాధారణగాంధార, కైశికీనిషాదములు పలుకు చున్నవి. పూర్వాచార్యులు లక్షణగీతమందు సాధారణగాంధార, కైశికీ నిషాదములనే వాడినటుల గాన్పించుచున్నది. కాబట్టి యీరాగము భాషాంగ రాగ మనదగును.

స ం చా ర ము :

సరిమపధస్సా - పధారీసా - గరిస్సానిపధాసాసా
నిపధానిసరిసరీ - స్సనిదధా - నినిదమగరి
గరిగరిసా - సనిధారీసా - రిరిపమపాదారీస్సా
గరిస్సానిపదా - సరీగరిగా - రిసనిదధా - నినిధమగరి
సనిధారీసా ॥

ర చ న లు :

వర్ణము :— సరసుడా నిన్నేకోరి - ఆది.

కృతులు :— రామబాణత్రాణ - ఆది } త్యాగరాజు
దరిదాపులేక వేడితే - దేశాది } గారు.
దురుసుగకృపజూచి - ఆది - శ్యామశాస్త్రిగారు
ఎంతనేర్చిన సఫలమేమి - ఆది } పట్నం
ఎటునమ్మినావో మనసా - ఆది } సుబ్రహ్మ ణ్యయ్యగారు.
శ్రీరాజగోపాలబాల - ఆది - ముద్దుస్వామి దీక్షితులుగారు.

జయజయజనకసుతే – మిశ్రచాపు – కృష్ణ
సామయ్యగారు.

## నీ లాం బ రి రా గ ల క్ష ణ ము.

ఇది 29 వ మేళము ధీరశంకరాభరణజన్యరాగము.

ఆరోహణ :— స రి గ మ ప ధ ప ని స
2 3 1 2 3

అవరోహణ :— స ని ప మ గ రి గ స॥
3 1 3 2 3

వక్రసంపూర్ణ–షాడవరాగము. రక్తిరాగము. సాయంకాలము గానము సేయదగినది. షడ్జగ్రహము. ఈరాగమునకు మధ్యమము మిగుల రంజకమయిన జీవస్వరముగా నున్నది. "ప ద ని పా" అను ప్రయోగమున కైశికినిషాదము పలుకుటచే నిది భాషాంగరాగమునై యున్నది. ఇాదు కైశికినిషాద మన్యస్వరము. మందస్థాయినిషాదము నకు దిగువ సంచారములేదు.

స ం చా ర ము :

సారిసనిసరిగమమా – రిగమపమామా – గమపధ
పమామా – గమపమాగ – రిగరిమాగసా – నీని
నిసరిగమామ – గమపస్సానినిపామామ – గమపని
పస్సా – సరీసనిపామా – గమపనిసీస్సా – నినిధనిస్సా
నిపా – మాగరిగసా – సస – పప – సస – రీస్సానిదని
పదని – పనిదని – పామాగరిగసా – రిసనినీసా ॥

ర చ న లు :

కీర్తనలు :— అంబా నీలాయతాక్షి – ఆది
సిద్ధీశ్వరాయ నమస్తే – మిశ్రఏక
త్యాగరాజం భజేహం – రూపకం
} ముద్దుస్వామి దీక్షితులుగారు.

కరుణానంద — ఆది - కుమార ఎట్టప్ప మహారాజుగారు

మాటాడవేమి — ఆది } త్యాగరాజు గారు
ఎన్నగమనసుకురాని — ఆది

స్ఫంగారలహరి — ఆది - శింగరాచార్యులుగారు.

(కామవర్ధని)=పంతువరాళిరాగలక్షణము.

ఈరాగము ప్రస్తుతకాలమున పాడు 51 మేళకర్తయైన కామవర్ధని రాగమే అయియున్నది.

ఆరోహణ :— స రి గ మ ప ధ ని స
1 3 2 1 3
అవరోహణ :— స ని ధ ప మ గ రి స
3 1 2 3 1
} కామవర్ధని ఆరోహణావరోహణములు.

కామవర్ధని సంపూర్ణరాగము షడ్జగ్రహము. ఎల్లపుడును గానముసేయుదగును. ఇందు షడ్జపంచమములుగాక శుద్ధరిషభ, అంతరగాంధార, ప్రతిమధ్యమ, శుద్ధధైవత, కాకలినిషాదములు వచ్చును. ఈరాగము సర్వస్వరగమకవరికరక్తిరాగము. గాంధార, మధ్యమ, ధైవత, నిషాదములు రాగఛాయాస్వరములు.

సంచారము :

గమపధనిసాసా - సనిధనిధపమపా - ధనిసరిగమగరిసా
సనిరిసనిసధనిధపా - పమపధనిసరిసా - సనిసరిగరిసనిధపా
మగమపా - పమగమగా - గరిసనిసా - సనిధనిపధానిసా॥

రచనలు :

కృతులు :— రఘువరనన్ను — ఆది } త్యాగరాజు గారు.
వాడేరాదైవము — ఆది

Note :- ఈ కామవర్ధని రాగములోవచ్చు అంతరగాంధారమునకు బదులు సాధారణగాంధారము వాడినచో పంతువరాళి రాగమగుచున్నది. పంతువరాళి రాగములో సాధారణగాంధారమునే వాడినచో నిది 45 వ మేళమైన శుభపంతువరాళిరాగమగుచున్నది.

## ప్రసిద్ధ వాగ్గేయకారకులు

# 1. జయదేవులు.

ఈయన యుత్తరదేశ బ్రాహ్మణుడు. సంగీత సాహిత్యములందసమాన పాండిత్యము గలవాడు. గోవర్ధనాచార్యులవారి శిష్యుడు. పరమభాగవతోత్తముడు. సంస్కృతభాషలో పెక్కుగ్రంథముల రచించిన మహాకవి. ప్రసన్నరాఘవము అను నాటక మీతడు రచించిన గ్రంథములలో ప్రాముఖ్యమైనది. అదియుగాక నితడు 'గీతగోవింద' (అష్టపది) యను సంగీతప్రబంధమును రచించి ప్రసిద్ధికెక్కెను. ఈ గ్రంథము శ్రీరాధాకృష్ణుల నాయకీ నాయకులుగ భావించి శృంగార రసప్రధానమై యొప్పునట్లు పండ్రెండు సర్గలుగా సంస్కృతమున రచింపబడినది. జయదేవుని యష్టపదులనబడు యీగ్రంథము నేటికిని సంగీత సాహిత్యములకు మహోపకారియై యెందరో భక్తులు శ్రీకృష్ణ భగవానుని సంకీర్తనము చేయుట కుపయుక్తమై విలసిల్లుచున్నది. ఈ గ్రంథమున యిరువదినాలుగు అష్టపదులున్నవి. ఈ యష్టపదుల రాగములును గేయఘటితులును సంగీతరత్నాకరములోని రాగవివేకాధ్యాయములోని రాగములవలె నెందుమూలముననో వాడుకలో లేకయున్నవి. సుమారు 300 సంవత్సరములకు పూర్వము దాక్షిణాత్య సంగీతవిద్వాంసు లెవరో యిరువదినాలుగు అష్టపదులకును రాగతాళముల నేర్పాటు చేసియుండిరి. ఆయా రాగతాళముల ననుసరించి యేర్పరుపబడిన గేయఘటితులే యిప్పుడును వాడుకలో నున్నవి.

జయదేవులు పందొమ్మిదియవ అష్టపది వ్రాయ బూనినపుడు "స్మరగరళఖండనం మమశిరసిమండనం, దేహిపద పల్లవముదారం" అని స్ఫురించినదట. అపుడు జయదేవులు వెంటనే తాళపత్రమున వ్రాయక యా తాళపత్రమును భార్యయైన పద్మావతిచేతికిచ్చి తల నంటుకొని స్నానమునకై నది కేగెనట. అంతట శ్రీకృష్ణభగవానులు

జయదేవరూపముగవచ్చి పద్మావతిని యడిగి తాళపత్రమును లేఖినిని దీసికొని జయదేవునికి స్ఫురించినట్లే పందొమ్మిదియవ అష్టపది యొక్క సాహిత్యము లిఖించి తిరిగి తాళపత్రమును లేఖినిని పద్మావతి కిచ్చి పోయెను. వెంటనే నిజమైన జయదేవులు నదినుండివచ్చి భార్యను తాళపత్రమును లేఖిని నిమ్మని యడుగగా యిప్పుడేకదే యడిగి వ్రాసి యిచ్చితిరి యని తెచ్చి యిచ్చెనట. ఆతాళపత్రమును జూచుకొని జయదేవులు బ్రహ్మానందభరితుండై యో పద్మావతీ! నీవెంతధన్యురాలవు భగవంతుడు నీకు దర్శనమిచ్చి యేగెను. నీసుకృతము చాల మంచిదని పొగడి యీ యష్టపది యడుగున "జయతు పద్మావతీరమణ జయదేవ కవి భారతీ ఫణితమితిగీతం" అని తనపేరుకు ముందు భార్యపేరుపెట్టి లిఖించెను. ఇరువదియొకటవ అష్టపదియందు నిట్లే లిఖించెనట. దీనిని బట్టియే పద్మావతికి భగవద్దర్శన మయినట్లు నిరూపింప బడినది. జయదేవులు సంగీతరత్నాకర గ్రంథకర్తయైన శార్ఙ్గదేవుల కాలమువాడనియే యూహింపబడు చున్నది. జయదేవులు యష్టపదుల రచించి సంగీతవిద్యార్థుల కెంతయో మహోపకారియై చిరకీర్తి వడసెను.

## 2 రామామాత్యులు.

ఈతడు నియోగిబ్రాహ్మణుడు. తోడర మల్లకులమునందు బుట్టిన తిమ్మామాత్యుని పుత్రుడు విజయనగర సామ్రాజ్యమునేలిన ఆంధ్రభోజుడని కీర్తివడసిన శ్రీకృష్ణదేవరాయలు యల్లుడు రామదేవరాయలు. ఈరామదేవరాయలు మామగారియనంతరము విజయనగర సామ్రాజ్యమునేలెను. రామదేవరాయల సోదరుడు వేంకటాద్రిరాజు. వీరికాలములో రామామాత్యులు ఆస్థానకవీంద్రుడు. రామామాత్యులు పెక్కుగ్రంథముల రచించెను. అందు ముఖ్యమైనవి ఏలా, రాగకదంబము, గద్యప్రబంధము, పంచతాళేశ్వరము, స్వరాంకము, శ్రీరంగవిలాసము మొదలగునవి, రామదేవరాయలును, వెంకటాద్రిరాజును

సభదీర్చియుండునపుడెల్ల రామామాత్యులచే రచింపబడిన ప్రబంధములు శ్రావ్యముగా వినుచుండెడివారట. ఒకనాడుసభలో వెంకటాద్రిరాజు సంగీతశాస్త్రములో లక్ష్య లక్షణములందనేక విరోధములు గాన్పించు చున్నవియనియు వానినన్నిటిని సమంజసము జేసి సంగీతశాస్త్ర గ్రంథము నొకదానిని రచింపుమని రామామాత్యుని వేడెనట. అందుమీదట రాజైన రామదేవరాయలు సోదరునివాక్యమున కనుగుణంబుగా కర్పూర తాంబూలాది యనేక బహుమతులచే రామామాత్యుని బహూకరించి సంగీతగ్రంథము రచింపుమని వేడెనట. అందుమీదట రామామాత్యులు "స్వరమేళకళానిధి" యను యేడుప్రకరణముల సంగీతగ్రంథమును రచించి రామదేవరాయల కంకితముచేసి చదివి వినిపించెను. ఈయనకు అభినవ భరతాచార్యుడని బిరుదు.

పై విషయమునుబట్టి రామామాత్యులు గొప్ప సంగీతజ్ఞులని దెలియుచున్నది. తనస్వరమేళ కళానిధిలో యీగ్రంథమును రచించిన కాలమునొక శ్లోకపూర్వకముగా వ్రాసెను. ఆశ్లోక మెద్దియనిన,—

శ్లో॥ శాకేనేత్రి ధరాధరాబ్ధి ధరణీగణ్యే ౽ సాధారణే
వర్షే శ్రావణమాసి నిర్మలతరే పక్షేద శంమ్యాంతిథౌ
రామామాత్య వినిర్మితస్స్వరత తే ర్నిర్మథ్యరత్నాకరం
సోయంమేళకళా నిధిర్మతిమతా మాకల్పమాకల్పతాం ॥

అని వ్రాసియున్నాడు. దీనినిబట్టి శాలివాహనశకము 1472, క్రీస్తుశకము 1550లో నీగ్రంథరచన జరిగినట్లు తెలియుచున్నది. శాలివాహనశకములో సాధారణ సంవత్సర శ్రావణశుద్ధ దశమినాటికీ గ్రంథమును రచించినట్లు పైశ్లోకమువల్ల తెలియుచున్నది. ఈతడీ స్వరమేళ కళాధియను గంధమునురచించి సంగీతవిద్య కెంతయో మహోపకారముచేసియున్నాడు. కర్నాటక సంగీతమునకు ఈగ్రంథమొక గొప్ప ప్రమాణ గ్రంథమైయున్నది.

## 3 సోమనాథుడు.

ఇతడు ఆంధ్రుడు. సంగీతసాహిత్యము లందసమాన పాండిత్యముగలవాడు. ఈయన 1609 ప్రాంతమున "రాగవిబోధము" అను విఖ్యాతిగాంచిన సంగీతలక్షణగ్రంథమును రచించెను. ఇతడు తనకాలమందు 23 మేళములు వాని జన్యరాగములుమాత్రమే యున్నట్లు తన గ్రంథమందు వ్రాసెను. వికృతిస్వరముల విషయమై సోమనాథుని మతము వేరుగానున్నది. ఈతనిమతము ప్రకారము వికృతిస్వరములు 15 గానున్నవి. ఈపదునైదు వికృతస్వరముల నాధారముచేసికొని సోమనాథుడు 960 రాగములను చేర్కొనెను. ఈతని రాగవిబోధమను గ్రంథమును కర్నాటక సంగీతమునకొక గొప్పప్రమాణ గ్రంథముగా వెలసియున్నది.

## తీర్థనారాయణస్వామి (నారాయణతీర్థులు)

ఈ యతీంద్రులు కృష్ణజిల్లావాస్తవ్యుడు, ఆంధ్రుడు. పదియారవ శతాబ్దమునాటివాడు. గొప్పభక్తుడు. మహిమగలవాడు. జయదేవుడు అష్టపదులరచించి యెట్లు ప్రఖ్యాతిగాంచెనో యట్లే ఈమహానుభావుడు తరంగములరచించి ప్రఖ్యాతిగాంచెను. ఈతడు రచించిన గ్రంథము "కృష్ణలీలాతరంగిణి" యనుభక్తిరస ప్రధానమైన 12 సర్గలుగల సంగీతగ్రంథము. ఇది కేవలము భగవన్నామసంకీర్తనమున కెంతయో తగియున్నది. ఈగ్రంథమును సంస్కృతములోవ్రాసి తానుతరించుటయేగాక వినువారిని యభ్యసించినవారిని గూడ తరింపజేసి యశఃకాముడయ్యె. తానురచించిన తరంగములను బెక్కుమంది శిష్యులకు బోధించెనట. వరాహపురియందలి వీరి సమాధియందు నేటికిని వీరి ఛాయాపటమునుంచి వేనవేలు భక్తులు శ్రీకృష్ణజయంతినాడు వీరు రచించిన తరంగములబాడుచు భజనలు సేయుచున్నారు. కాబట్టి యీమహానుభావుడు రచించినతరంగములు కర్నాటక సంగీతమున కెంతయో వన్నెదెచ్చినవిమైయున్నవి.

# భద్రాచల రామదాసు.

ఇతడును 16 వ శతాబ్దమువాడే. తెలుగు నియోగిబ్రాహ్మణుడు. ఇతడు పరమభాగవతోత్తముడు. సంగీతసాహిత్య విశారదుడు. శ్రీరామభక్తుడు. ఈతని మేనమామలైన అక్కన్న, మాదన్నగార్లు హైదరాబాదు నైజామైన తానీషాయొద్ద మంత్రులుగా నుండుటచే వారి ప్రాపకమున భద్రాచలమునకు ఇతడు తహసీల్దారుగా నియమింపబడెను. అయితే ఇతడు భక్తిపారవశ్యముచే జీర్ణస్థితియందున్న భద్రాచలరాముని దేవాలయమును గవర్నమెంటుతాలూకు ధనముతో బాగు చేయించుటయేగాక భక్తులకు సంతర్పణలుచేసి గవర్నమెంటుధనము నంతను తనదిగానే వినియోగించెను. శ్రీరామునకు కైంకర్యము చేయుచు భక్తులతోగూడి భజనలు సేయుచునుండెను. ఈసంగతి తానీషాకుదెలిసి పండ్రెండేండ్లు ఖైదువిధించెను. ఖైదులలోనుండి రామదాసు శ్రీరామునిగూర్చి హృదయరంజకములైన యనేకకీర్తనల తెలుగున రచించెను. వీనికే "రామదాసు కీర్తనలు" అనిపేరు. ఈగ్రంథమిప్పటికిని వర్థిల్లియున్నది. అనేకులీ కీర్తనల నిప్పటికిని పాడుచున్నారు. ఇతడు సతతము ఖైదులోనున్నప్పుడు శ్రీరాముని భజించుటచే కరుణామయుడైన భగవంతుడు రామలక్ష్మణుల యాకారమునుబొంది రామదాసు చెల్లింపవలసిన ధనమును అర్థరాత్రమందు తానీషాకుచెల్లించి రసీదు పుచ్చుకొనిరి. అందువలన తానీషా రామదాసును బంధవిముక్తునిగాజేసెను. ఈరామదాసుకీర్తనలు, జయదేవుని యష్టపదులవలెను, నారాయణతీర్థులవారి తరంగములవలెను కర్ణాటక సంగీతమున కెంతయో వన్నెదెచ్చినవి.

## వేంకటమఖి.

చోళమండలమునేలిన అచ్యుతప్పనాయకునికి మంత్రియును సకలశాస్త్ర పారంగతుడును, కర్ణాటక స్మార్తబ్రాహ్మణుడును అయిన

గోవింద దీక్షితులవారి ద్వితీయపుత్రుడు వెంకటేశ్వర దీక్షితులు లేక వెంకటమఖి. ఇతనియన్న యజ్ఞ నారాయణదీక్షితులు. మొదట యన్నయొద్ద సకలశాస్త్రముల నభ్యసించెనట. పిమ్మట ఉత్తరదేశ వాగ్గేయకారకులలో మేటియైన తానప్పాచార్యులవద్ద వెంకటమఖి తండ్రియనుజ్ఞచే సంగీతవిద్యను లక్షణ లక్ష్యములతో నభ్యసించి పేరు పొందెను. విద్య సంపూర్తియైన పిమ్మట వెంకటమఖి తనగురువైన తానప్పాచార్యునిమీద ఆరభి రాగములో "గంధర్వజనతా ఖర్వదుర్వార గర్వభంజనురే" యనుగీతమును బ్రథమమున త్రిఖండముగా రచించి తండ్రి గురువు యన్నగార్లకు పాడి వినిపించెనట. ఈగీతము ఇప్పటికిని ప్రసిద్ధినిగాంచి వాడుకలోనున్నది.

చోళమండలమునేలిన విజయ రాఘవ భూపాలుని ప్రేరణము వలన వెంకటమఖి, వీణ, శృతి, స్వర, మేళ, రాగ, ఆలాప, ఠాయ, గీత, ప్రబంధ, తాళములనెడి పది ప్రకరణములతో గూడిన "చతుర్దండి ప్రకాశిక" యను గొప్పసంగీతలక్షణ గ్రంథమునువ్రాసి చిర కీర్తి నొందెను. మఱియునితడు రాగాంగ, ఉపాంగ, భాషాంగ రాగములకు శ్లోకరూపకముగా లక్షణములను గీతరూపముగా లక్ష్యములను దెల్పియున్నాడు. వీనినే లక్షణగీతములందురు. ఇటుల వ్రాయుటచే సంగీత విద్యార్థులకెప్పటికిని మహోపకారముచేసిన వాడయ్యెను. ఈలక్ష్య గీతములలో ప్రతిదానియందును గల ధాతువుల చమత్కృతియును, శుద్ధవికృతిస్వరము లివియని దెలియుటకు వీలైన సంకేతాక్షరములును, చక్రము మేళము లివియని దెలియనగు సంజ్ఞలును, రాగాంగ గీత మాతవులం దమరియున్న చమత్కారమును చతుర్దండి ప్రకాశిక యందుగల రాగాంగ, ఉపాంగ, భాషాంగ రాగగీతములందు గాన నగును. కొన్నియుపాంగ రాగములు భాషాంగ రాగములుగా బరిణమించిన విధమునుగూడ వెంకటమఖి దెల్పియున్నాడు.

మఱియు వెంకటమఖి జయదేవుని యష్టపదులవలె త్యాగరాజును స్తుతించుచు ఇరువదినాలుగు అష్టపదులనుగూడ రచించెను. వెంకటమఖిగారి చతుర్దండి ప్రకాశిక సంగీతశాస్త్రమునకొక గొప్ప ప్రమాణగ్రంథముగ నేర్పడియున్నది.

## క్షేత్రజ్ఞ లేక క్షేత్రయ.

ఇతడు తెలుగుబ్రాహ్మణుడు మువ్వపురినివాసి. సంగీత సాహిత్యములందసమానపాండిత్య ప్రతిభగలవాడు. గొప్ప భక్తుడు. గోపాల మంత్రోపాసకుడై గోపాలదేవుని యనుగ్రహమునేగాక దర్శనలాభమునుగూడ బొందెను. భగవత్సాక్షాత్కారమైన వెంటనే "శ్రీపతి సుతు బారికినే నోపలేక నిను వేడితే గోపాలా మువ్వగోపాలా" యనిపదములు సేయ ప్రారంభించెనట. ఇతనిముద్ర "మువ్వగోపాల" యనునది. శృంగారరస ప్రధానములై నాయకీనాయక భావములు చెడకుండ యర్థపుష్టితోను రసపుష్టితోను రసానుగుణ్యమైన రాగములతోను ఈతని పదములు వెలయుచున్నవి. ఇట్టిపదముల నీవిధముగ రచించినవారు మరియెవరును లేరు. ఇతని మువ్వ గోపాలపదములు సుమారు వేయిపదములున్నవని తెలియుచున్నది. ధాతువువచ్చినదే వచ్చినట్లుండుట పద సాహిత్యములశైలి. కీర్తనశైలి వచ్చినధాతువు రాకయుండుట. ఈపదముల శబ్దార్థము నెఱిగి విళంబముగా రసానుభవముతో పాడవలెను. ఇతడు తెలుగుననే తనపదములనన్నిటిని రచించి సంగీతప్రపంచమునకు మహోపకారముచేసి చిరకీర్తి నొందెను.

క్షేత్రయ, మధుర, తంజావూరు గోల్కొండ యీసంస్థానాధీశుల సభలలో యేయేపదముల జెప్పియున్నాడో ఇతనిదేశీయ దేవగాంధారిరాగమున "వేడుకతో నడుచుకొన్న విటరాయడే" యను యొకపదమున రచించియున్నాడట. ఇతడు తంజావూరి విజయ రాఘవ భూపాలుని కోరికపై ప్రత్యేకము అయిదు పదముల జెప్పి రఘునాథ

చేసెనట. ఈపదములకు క్షేత్రయ పంచరత్నము లనిపేరు. కొన్నిపద ములలో "కంచి వరదుడు" "చెవ్వంది లింగడు" యని ముద్రిలున్నప్ప టికి నివి క్షేత్రియపదములేయని తెలియుచున్నది.

క్షేత్రియ విజయ రాఘవ భూపాలుని కాలమువాడు. రసికా గ్రేసరుడైన విజయరాఘవ భూపాలుడు తరుచు క్షేత్రయను బహూక రించు చుండుటచే యతని యాస్థానకవీంద్రులకు క్షేత్రియయం దీర్ష్య జనించెనట. వారు రాజుతో నొకప్పుడు ఇట్లనిరట. "ఏరా, రారా, పోరా" యనిసెప్పెడి క్షేత్రియయందు మహారాజావారికింత వ్యామోహ మెందుకు? అతనికంత బహుమానాద్యుపచార గౌరవమెందుకు?" అని యనిరట. ఈసంగతి రాజు క్షేత్రయతో జెప్పగా వారుచెప్పినది సరియా యని కాంభోజిరాగములో 'వదరకపోవే' యనుపదములో పల్లవి, యనుపల్లవి, రెండుచరణములను జెప్పి, మూడవచరణములో "భామరో శకునము లడిగితి మువ్వగోపాలుడు వచ్చునని, కామించినాధుల కలయు చెలులజూచి కరగి చింతనొందితి" యనిచెప్పి మిగతను ఆస్థానకవీం ద్రుల బూర్తిసేయుమనిచెప్పి సేతుయాత్రకు బోయెనట. ఆస్థానకవీం ద్రులు రాజాజ్ఞచే దానిని బూరింపనెంత ప్రయత్నించినను చేతగాక క్షేత్రియ తిరిగి రాగానేయాతని బూరింపుమని బ్రతిమాలిరట. అప్పుడు క్షేత్రియ "రామరామ యీమేనితో వానిమోము జూడవలెనా మొ దటిపొందే చాలు" అనిపదమును పూర్తిచేయగా కవీంద్రులందరును నీవు సాక్షాద్గోపాల దేవుడవేయని పొగడి యీసంగతి రాజుతోచెప్పి తమతప్పును దిద్దికొని క్షేత్రియనెంతో పొగడి గౌరవించిరట. ఏనూరు పదములుగల ప్రాచీనగ్రంథము సంప్రదాయప్రదర్శిని గ్రంధకర్తయైన బ్రహ్మశ్రీ శ్రీ శ్రీ సుబ్బరామ దీక్షితులవారియొద్ద శుద్ధప్రతియున్నట్లు వారిగ్రంధమున దెల్పిరి.

## పైడాల గురుమూర్తిశాస్త్రి.

ఇతడును తెలుగుబ్రాహ్మణుడే. మురికినాట్లు. తిరునల్వేలి జిల్లా లోని కయత్తారు గ్రామమీతని జన్మస్థానము. ఇతడు చతుశ్శాస్త్ర పండితుడు. సంగీతమునందు గొప్ప ప్రౌఢిమగలవాడు. ఇతడనేక గీతములను, కీర్తనలను, ప్రబంధములను రచించినమేటి. అనేకరాగములలో ప్రతిభగలవాడు. ఇతడు చిన్నతనమందే మదరాసులో మణలి చిన్నయ మొదలారువారిచే యనేక బహుమానములబొంది గొప్ప కీర్తినిబొందెను. ఇతడు రామస్వామి దీక్షితులవారి కాలములోని వాడై నప్పటికిని వారికంటె బహుచిన్న వయస్కుడు.

## శ్రీ శార్ఙదేవులు.

ఇతడు క్రీస్తుశకము 1210 మొదలు 1247 దేవగిరిరాజ్యము నేలిన సిహ్మళరాజు కాలములోవాడు. కాశ్మీరదేశస్థుడు. వర్షగణబుషి గోత్రుజుడైన భాస్కరుని పౌత్రుడు. సొఢ్ఢలదేవుని కుమారుడు. సంగీతమందును సంస్కృతమునందును అసమానపాండిత్యము గలిగి పేరు పొందెను. ఇతడు "అధ్యాత్మవివేకము" అను వేదాంతగ్రంథమును రచించెను. మఱియు "సంగీత రత్నాకరము" అను సంగీతగ్రంథమును సంస్కృతమున రచించి శార్ఙదేవుడు చిరస్థాయి యయ్యెను. ఇతనికి "నిశ్శంకుడు" అను బిరుదుకలదు. ఇతడు సంగీత రత్నాకరమును ఏడధ్యాయములుగా వ్రాసెను. 1. స్వరగతాధ్యాయము 2. రాగ వివేకాధ్యాయము 3. ప్రకీర్ణకాధ్యాయము 4. ప్రబంధాధ్యాయము 5. తాళాధ్యాయము 6. వాద్యాధ్యాయము 7. నృత్యాధ్యాయము అని ఏడధ్యాయములు.

ఈసంగీత రత్నాకరగ్రంథమునకు ఏడువ్యాఖ్యానము లున్నవి. అందునాలుగు వ్యాఖ్యానములు సంస్కృతమున వ్రాయబడినవి. సంస్కృతవ్యాఖ్యానకర్తలు సిహ్మళ శార్ఙ్గదేవ కుంభకర్ణనరేంద్ర కల్లినాథులు. గంగారాముని హిందూస్థానీ వ్యాఖ్యానము అయిదు, రెండు తెలుగు వ్యాఖ్యానములు. ఇందొకటి హంసభూపాలుడు జేసెనట. ఈ వ్యాఖ్యానము లన్నిటిలోను కల్లినాథుని వ్యాఖ్యానమే సుప్రసిద్ధముగా నున్నది.

ఈసంగీత రత్నాకరమందు జెప్పబడిన కొన్నిరాగములు ఈ కాలమునగల లక్ష్య లక్షణములకు సమన్వయించుటలేదని రామామాత్యులును, వెంకటమఖియుగూడ తమతమ గ్రంథములందు వ్రాసియున్నారు. వాడుకయందును ఆటులనేయున్నవని సంప్రదాయజ్ఞుల యభిప్రాయమై యున్నది.

## అహోబల పండితుడు.

ఇతడు సుమారు 400 సంవత్సరములకు పూర్వుడు. అహోబల ప్రాంతనివాసి వైదికబ్రాహ్మణుడు. గొప్పవిద్వాంసుడు. సంగీతశాస్త్ర కోవిదుడు. ఇతడు "సంగీత పారిజాతము" అనుగ్రంథమును రచించి కీర్తివడసెను. ఈగ్రంథము సంగీతశాస్త్రమునకు గల ప్రమాణగ్రంథములలో నొకటి. ఈగ్రంథములోని కొన్ని లక్ష్యలక్షణములు ఇప్పటి వాడుక ప్రకారమే యున్నవి.

## పురందర దాసు. (పురందర విఠల)

ఇతడు కర్నాటకబ్రాహ్మణుడు. మధ్వమతస్థుడు. కన్నడభాషలో గొప్పవిద్వాంసుడు. గొప్పభక్తుడు. మొదట పూనాలో కోటీశ్వరుడైయుండి పాండురంగవిఠలుని కృపచే సంసారమురోసి మహాభక్తుడై

సంగీతసాహిత్యములం దసమానపాండిత్యము గలవాడై యనేక కీర్తనల రచించి పాండురంగవిఠలుని యనుగ్రహమును బొందినవా డయ్యె. సంగీతశాస్త్ర సాధనమునకు బ్రథమమెట్టయిన సరళీస్వరములు, జంటస్వరములు, అలంకారములు, గీతములు ఈమహాత్ముడేర్పరచి సంగీతలోకమునకు శాశ్వతమైన మేలొనర్చి కీర్తి గాంచెను.

మధ్వమతాధిపతులు తమతమ సంస్థానము లందిప్పటికిని పురందరదాస విరచితమైన కీర్తనములచే దేవతాసన్నిధిని పాడించుట ఏర్పాటుగానున్నది.

మఱియు నీ మహనీయుడు "సూళాది" తాళములనేర్పఱచి యశఃకాముడయ్యె. వీరికీర్తనల యందనేక వేదాంత విషయము లిమిడియున్నవి. వీరురచించిన కీర్తన లెన్నియున్నవో లెక్కింపతరముగాదు. వీరు అహోబలపండితునకు బూర్వులయి యుందురు.

# త్యాగరాజస్వామి.

ఈమహనీయుడు 230 సంవత్సరములకు బూర్వము తిరువయ్యారులో రామబ్రహ్మమనెడి వేదశాస్త్రపండితుని తృతీయపుత్రుడుగా జన్మించె. చిన్నతనమందే వేదాధ్యయనముజేసి సంస్కృతములో పాండిత్యమును సంపాదించెను. వీరికి పదునాల్గవయేటనే తలిదండ్రులు స్వర్గస్థులైరి.

పిమ్మటవీరు తంజావూరియాస్థాన విద్వాంసుడైన శొంఠి వెంకటరమణయ్యగారిశిష్యులై యొక్కవత్సరములోనే సంగీతలక్షణము, రాగాలాపము, పల్లవి, తాళము మొదలగునవి యన్నియు నభ్యసించి పరిపూర్ణపాండిత్యము వడసిరి.

ఒకప్పుడు కాంచీపురమునుండి వచ్చినయొక పరమభాగవతోత్తమునియొద్ద జన్మతారకమైన రామతారకమంత్రము నుపదేశము

నొంది యిరువదియొక్క సంవత్సరములలో తొంబదియారుకోట్లు పురశ్చరణచేసి శ్రీరాముని ప్రత్యక్షము చేసికొనఁగలైనట. శ్రీరాముడు ప్రత్యక్షమై త్యాగరాజుని సాహిత్యరచనలు సేయునటుల యనుగ్రహించెనట. పిమ్మట వీరు రామాయణగ్రంథమందలి 24 వేల శ్లోకములకు సరిగా 24 వేల కీర్తనలను చేసిరని చెప్పుదురు. కాని యిప్పుడు వాడుకలో వేయికీర్తనలకు లోపుగనే కానుపించుచున్నవి.

సంగీత విశారదుఁడును, దేవమునియు, త్రిలోకసంచారియు నైన నారదమునీంద్రులు వీరిపాటకు మెచ్చుకొని ప్రపంచములో లేని "స్వరార్ణవము" అను గ్రంథమును ఏొసఁగిచ్చిరట.

త్యాగరాజుగారనేకములైన యద్భుతకార్యముల జేసియున్నారట. ఒకప్పుడొకచోట చనిపోయిన పిల్లవానిని బృందావనసారంగ యను రాగములో 'శ్రీరామపాదమా' యనుకీర్తనపాడి యాపిల్లవానిని బ్రదికించిరట. మఱియొకప్పుడు వీరు తిరుపతికి స్వామిదర్శనార్థమై పోగా స్వామికి తెరవేయబడియుండి దర్శనముకాలేదట. అప్పుడు వీరు 'గౌళపంతు' రాగములో 'తెరతీయగారాదా' యనుకీర్తన పాడినవెంటనే తెర తనంతటతానే లేచిపోగా స్వామిదర్శన మయ్యెనట.

ఒకప్పుడు త్యాగయ్యగారి అన్నగారు వీరియందసూయగలవారై వీరి శ్రీరామపట్టాభిషేక విగ్రహములను రహస్యముగా కావేరీనదిలో బారవైచెనట. అప్పుడు త్యాగయ్యగారి పరితాపమునకు దుఃఖమునకు మేరలేదయ్యె. వీరు దుఃఖించుచు అనేక కీర్తనములుచేసి శ్రీరాముని మొరబెట్టుకొనిరట. ఆసమయమున రచించినదే 'మార్గహిందోళ' రాగములోని 'చలమేలరా సాకేతరామ' యనుకీర్తన. అప్పుడు శ్రీరాముడు కరుణించిస్వప్నగతముగా కావేరీనదిలో ఫలానాచోటనున్నాను అనిచెప్పగా వెళ్లి వెతకగా విగ్రహములు దొరకినవట.

అనేకమంది రాజులీ మహాభక్తాగ్రేసరుడైన త్యాగరాజస్వామి ఘనతకు పాదాక్రాంతులై లక్షలకొలది ధనమియ్యబోగా నిరాకరించి బిచ్చమెత్తుకొనియే జీవించుచు నిరంతరము శ్రీరామ పాదారవింద ధ్యానతత్పరుడై యుండెను.

ఈయన తనయంత్యకాలము సమీపించుటను 10 నెలముందే యెరింగి తిరువయ్యారులో సన్యాసాశ్రమమును స్వీకరించి యాపంచనదక్షేత్రమున కావేరీతీరమున సిద్ధిపొందిరి. పుష్యబహుళ పంచమినాటికి ప్రస్తుతకాలమున యనేకమంది విద్వాంసులు తిరువయ్యారుచేరి వీరిపేరట త్యాగరాజోత్సవమును అతివైభవముతో జరుపుచున్నారు.

## ముద్దుస్వామి దీక్షితులు.

ఈమహానుభావుడు 1775 సంవత్సరములో రామస్వామి దీక్షితులవారి పుత్రుడై జన్మించి 16 వత్సరముల ప్రాయమునందే వేదాధ్యయనము, నాటకాలంకారములు, వ్యాకరణము జ్యోతిషము, ఆయుర్వేదము, మంత్రశాస్త్రము మొదలైనవి అభ్యసించి గొప్పపండితుడయ్యె. వీరి వాస్తవ్యము తిరువారూరు, వీరికి వివాహమైనపిమ్మట చిదంబరనాథుడను సిద్ధుడొకడువచ్చి వీరికి శ్రీవిద్యనుపదేశించి తనతో గంగాతీరమునకు గొంపోయి యచట నైదుసంవత్సరములు శ్రీవిద్యామంత్ర పురశ్చరణచేయించి సిద్ధి పొందినపిదప వేదాంతశాస్త్ర రహస్యముల నుపదేశించి తిరిగి వీని తిరువారూరుకుబంపివైచెను. తరువాత ముద్దుస్వామి దీక్షితులవారు తిరుత్తనిక్షేత్రమందు సుబ్రహ్మణ్య పంచాక్షరీ మంత్రానుష్ఠానముచేయగా భగవంతుడు ప్రత్యక్షమై వీరి నోటిలో చక్కెర వేసిరనియు, అప్పటినుండి వీరికి సంగీతసాహిత్యములందు మహత్తరమైన ప్రజ్ఞగలిగి యనేకరచనలు చేసినట్లును జెప్పుదురు.

ముద్దుస్వామిదీక్షితులు గీర్వాణభాషలో ననేకకీర్తనలు రచించి పేరువడసిరి. వీరిముద్రయే గురుగుహాముద్ర. సంగీతమందెక్కువ ప్రావీణ్యముగలవారుగాని వీరికీర్తనలం బాడలేరు. వీరుకూడ నొకప్పుడు ప్రయాణము చేయుచుండగా నొకప్రదేశమందు జనులు వర్షములేక బాధనొందుటగాంచి, వీరు 'అమృతవర్షిని' యనురాగమునుపాడి అమృతేశ్వరుని ధ్యానించి 'ఆనందామృతకర్షిణి అమృతవర్షిణి' యను కీర్తన పాడగా కుంభవృష్టి కురిసెనట.

అనేకమంది మహారాజులచే వీరుగొప్పగా గౌరవింపబడి పూజింపబడిరట. వీరు 'సంగీత సాంప్రదాయ ప్రదర్శిని' యనుగ్రంధమును రచించిన సుబ్బరామ దీక్షితులవారికి పెద్దతండ్రి.

## శ్యామశాస్త్రి.

తల్లిదండ్రులకు చాలకాలమువరకు సంతానము లేక శ్రీతిరుపతి వెంకటేశ్వరస్వామి కృపవలన శ్యామశాస్త్రిగారు పుట్టినట్లును, వీరితల్లిదండ్రులు తిరువారూరుక్షేత్రమున 35 సంవత్సరములు కామాక్షి దేవిని అత్యంతభక్తితో పూజింపగా 1763లో శ్యామశాస్త్రి పుట్టినట్లును ఇట్లు రెండువిధములుగా జెప్పబడుచున్నది. ఇతడు బాల్యమందే సంస్కృతాంధ్రములలో పాండిత్యమును సంపాదించెను. తంజావూరిలో తమ బంధువులలో నొకరియొద్ద నితడు సంగీతమభ్యసించి స్వరజ్ఞానమును బొందెను. శ్రీవిద్యోపాసకుడైన శ్యామశాస్త్రి మంత్రశాస్త్రమందును గొప్ప ప్రతిభకలవాడు.

ఉత్తరదేశమునుండి సంగీతమందెక్కువ ప్రావీణ్యతగలస్వామివారొకరువచ్చి మూడువత్సరములు శ్యామశాస్త్రిని తమయొద్దనుంచుకొని సంగీతలక్ష్య లక్షణ మర్మములనెల్ల వీరికి బోధించినపిమ్మట కాశికి వెడలిపోయిరి. తదనంతరము కొంతకాలమునకు శ్యామశాస్త్రిగారికి సంగీతమునకు తోడు సుకవిత్వధోరణికూడ కలిగెను.

తెలుగునందు వీరనేక స్వరజితులు, తానవర్ణములు, గొప్పకీర్తనములు రచించి శాశ్వతకీర్తినొందిరి. వీరిముద్ర 'శ్యామకృష్ణ'యనునది.

# అరుణాచల కవిరాయరు.

ఇతడు నల్లతంబిపిళ్ళెగారి కుమారుడు. తుళ్ళయూది గ్రామకాపరస్థుడు. ద్రవిడభాషలో పంచలక్షణములుదెలిసిన విచక్షణుడు. కంద రామాయణమును ప్రసంగముచేయుటలో నితడు బహుచతురుడు. ఇతడరవభాషలో ననేకకీర్తనల రచించెను. చిన్నతనమందే విద్యనభ్యసించుటయేగాక వివాహానంతరముకూడ ధర్మవరమందు విద్యనభ్యసించెను. బంగారు వెండివర్తకము వీరివృత్తి. ఒకప్పుడు ధర్మవరపు మతమునందు సంగీతముపాడగా నామతాధిపతి వీరికి 'శేఖాజీ' యని పేరుంచెను.

అరుణాచల కవిరాయరు మిత్రులలో నొకరగు చహాదాపురపు వెంకట్రామయ్యరు అను సంగీతవిద్వాంసుని కోరికపై శ్రీమద్రామాయణమును కథాసందర్భము చెడకుండ నాయారసములకు దగిన రాగములతో గేయఫణితులు వెలయ ఆరవకాండమువఱకు ద్రవిడకీర్తనలుగా రచియించినపిదప మణలిముద్దుకిష్ణ మొదలియారువారి శ్రీరామస్వామిదీక్షితులు మొదలుగాగల పండితసభలో పాడివినిపించి కనకాభిషేకమునుబొంది కీర్తికాముడయ్యె. తరువాత కొంతకాలమునకు వీరు శ్రీరంగము వెళ్ళగా నచటి దేవాలయపూజారి కోరికపై 'ఏనేపళ్ళి కొండేరయ్యా' అనుకీర్తనను మఱియు రామాయణకీర్తనల ననేకములబాడి వారిచే గొప్పసమ్మానములబొందెను. అరుణాచలకవి గొప్పరాగజ్ఞానమును సూక్ష్మబుద్ధిని గలవారు. వీరి కిరువదిమంది శిష్యులుండిరి. వీరు 1711 మొదల్గు 1778 వఱకు జీవించి ఖ్యాతిగాంచిరి.

# గోపాలకృష్ణ భారతి.

ఈబ్రాహ్మణుడు గొప్పశివభక్తుడు. సంస్కృత ద్రావిడభాష లందును సంగీతమందును విశేష ప్రజ్ఞాధురంధరుడు. ఇతను రక్తిరాగములందును దేశీయరాగములందును ననేక యపూర్వరాగములందును గూడ కల్పనాచమత్కారముల గనపఱచి కీర్తనల ననేకముల రచించి కీర్తినొందెను.

"నందన్" అను భక్తచరిత్రను, "నూమినాటకమును" వ్రాసి యున్నారు. వీరిముద్ర "గోపాలకృష్ణ" యనునది వీరు 1815 మొదలు డెబ్బదివత్సరములు బ్రహ్మచర్యమున జీవించి 1885 పరమపదించిరి. వీరురచించిన కీర్తనల నిప్పటికిని దక్షిణాది సంగీతవిద్వాంసులు పాడు చుందురు.

# ఆదియప్పయ్య.

ఈభూసురోత్తముడు మధ్వమతస్థుడు. కర్నాటకదేశస్థుడు. సంగీతాంధ్రములలో గొప్పవిద్వాంసుడు. తంజావూరునేలిన ప్రతాపసింహామహారాజుకాలమువాడు. అనేక రక్తిరాగములందును, దేశీయరాగములందును, 'శ్రీవెంకటరమణ'ముద్రతో బహుగమక విశేషములతో ననేక కీర్తనములజేసినవాడు. ఇతడును శ్రీవీరభద్రయ్యగారి మార్గమునే యనుసరించినాడు. రాగాలాపన, మధ్యమకాల పల్లవిపద్ధతుల నితడు పరిశుద్ధముచేసినాడని యందురు. వర్ణము లనేకములున్నను ఈ ఆదియప్పయ్యగారు భైరవిరాగములో రచించిన 'విరిబోణి' యను నట తాళవర్ణము గాత్రమున బాడుటకుగాని వీణమీద వాయించుటకుగాని బహుశ్రావ్యమైనదై యసమానమైనదై విలసిల్లుచున్నది.

ఇతని పుత్రుడు వీణకృష్ణయ్య. ఈకృష్ణయ్య వైణికులలో మేటి. ఇతడు మైసూరు, విజయనగ , కొత్తకోట సంస్థానాధిపతులమీద 'సప్తతాళేశ్వరము' అనుమూడు ప్రబంధములుచేసి ప్రసిద్ధిగాంచెను. ప్రధానమైన సప్తతాళములందలి ధ్రువతాళమందే తక్కిన ఆరుతాళములు అణగియుండునట్లును. ప్రబంధము పాటయెత్తునపుడు అన్నితాళముల మొదటిఘాతలు ఒకేఘాతగా పడునట్లుండును. మఱియు ప్రబంధ మాతువులో రాజుల నామాక్షరములు ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క ఆవృతమునకు మొదటియక్షరముగా వచ్చునట్లు అర్థముతో రచించెను. ధ్రువతాళము ముప్పది యావృతములైతే ఎత్తునపుడు మిగిలిన యారు తాళములును ఒకేరీతిగా ప్రబంధముయొక్క ఆది అక్షరమందే యెత్త బడును.

ఈవీణకృష్ణయ్య కొమరుడు వీణ సుబ్బుకుట్టిఅయ్య, ఇతడును తండ్రి వలెనే వైణికశ్రేష్ఠుడు. ఇతడు రాగాలాపన, మధ్యమకాల పల్లవి, స్వర కల్పనలు, గమకవిశేషములు, ఒప్పునట్లును, అతీతానాగత గ్రహములు విలసిల్లునట్లును, శుద్ధతాళజ్ఞానముతోను, వీణవాయించుటయందసాధారణ ప్రజ్ఞాధురంధరుడు. ఇతడు వీణవాయించుకొనుచు సుమారు డెబ్బదియేండ్లు జీవించెను.

## సొంఠి వెంకటసుబ్బయ్య.

ఈవిప్రోత్తముడు త్రిలింగదేశస్థుడు. వీరియింటిపేరు సొంఠివారు. ఇతడు సంగీతాంధ్రములందు బహు సమర్థుడు. ఇతడు ఆదియప్పయ్యకు సమకాలికుడైనను అతనికంటె చిన్నవాడు. వెంకటమఖిచే నిరూపింప బడినరాగాంగాది రాగసంప్రదాయముల బాగుగ తెలిసినవాడు. ఇతడు తుళుజామహారాజుమీద బేహాగరాగములో నొకవర్ణమును చిత్రవిచిత్ర కల్పనలతో రచించెను. రసికాగ్రేసరుడును, ఔదార్య

స్వరూపులునైన మణలి చిన్నయామొదలియారివారి సభలో నీసాంఠి వెంకటసుబ్బయ్యగారు బహు సమ్మానములనొంది గౌరవింపబడెను. బహుచమత్కారములతో విలసిల్లి యితనిచే రచింపబడిన సంగీతసాహిత్యరచనలు పెక్కులుగలవు

ఇతనిపుత్రుడైన సాంఠి వెంకటరమణయ్య సంగీతసాహిత్యములందు తండ్రిని మించినవాడని చెప్పుదురు. ఇతడు శరభోజి మహారాజు కాలమందుండెడివాడట.

# రామస్వామి దీక్షితులు.

ఇతడు ఉత్తరదేశస్థుడు. ద్రావిడబ్రాహ్మణోత్తముడు. కాశ్యపగోత్రజుడు, ఆపస్తంభసూత్రుడు. ఇతడు క్రీస్తుశకము 1735 లో వెంకటేశ్వరదీక్షితులను బ్రాహ్మణునికి జన్మించెను. తల్లిపేరు భాగీరథియమ్మ. కాంచీమండలములో కలహము సంప్రాప్తముకాగా (యుద్ధము.) నచటనుండి వెంకటేశ్వరదీక్షితులు తనభార్యతోను ఏడేండ్ల వయస్సువాడైన పుత్రునితోను బయలువెడలి మధ్యార్జున క్షేత్రమునకు సమీపముననున్న గోవిందపురము వచ్చిచేరెను. అచట రామస్వామిదీక్షితులు క్రమాంతస్వాధ్యాయ పరుడయ్యెను. అటుపిమ్మట రామస్వామిదీక్షితుల తల్లిదండ్రులు 6 మాసము లించుమించుగా పరలోకగతులైరి. ఏకాకియయ్యును రామస్వామిదీక్షితులు సంస్కృతాంధ్రముల నభ్యసించి ప్రవీణుడయ్యెను. పిమ్మట తంజావూరుపోయి వీరభద్రయ్యగారియొద్ద రెండేండ్లు శుశ్రూషజేసి దేశీయరక్తిరాగములందు వీరభద్రయ్యగారిచే రచింపబడిన కీర్తనముల పరిజ్ఞానమబ్బ నట్లభ్యసించెను. అటుపిమ్మట మధ్యార్జునమునకు వెడలి శ్రీవెంకటమఖిగారి మేనమామకు పౌత్రులైన శ్రీవెంకటవైద్యనాథ దీక్షితులవారియొద్ద వీణ నభ్యసించి వారి సంపూర్ణానుగ్రహమును బొంది శ్రీవెంకటమఖిగారి

చతుర్దండిప్రకాశిక గ్రంథానుసారముగా రాగాంగ, ఉపాంగ, భాషాంగ రాగగీతములను సకలరాగతాళలక్షణములను సాంగోపాంగముగా నభ్యసించి సంగీతలక్ష్యలక్షణముల దెలిసికొనినవారైరి. ఇటుపిమ్మట గురువుల యాజ్ఞానుసారము తంజావూరికిపోయి రాజసభలో కచ్చేరిచేసి బహుసమ్మానములంది గౌరవింపబడిరి. పిమ్మట మయూరమునకువచ్చి తిరువారూరులో జరుగు శ్రీత్యాగరాజమహోత్సవ సందర్శనార్థమై యచటికిబోయి శ్రీకమలాంబా సమేతులైన శ్రీత్యాగరాజస్వామిని సేవించుచునుండిరి. ఈరామస్వామిదీక్షితులగారి భక్తికి మెచ్చుకుని భగవంతుడైన త్యాగరాజస్వామి స్వప్నగతంబున నాజ్ఞయిచ్చిన ప్రకారము స్వామి యుత్సవసేగింపుసందర్భములో ధ్వజమంటపము మొదలు తిరిగి ధ్వజమంటపమునకు వచ్చువరకు నాగస్వర వాద్యగాండ్రు మొదలైనవారు ఏయేస్థలములందు యేవిధముగా వాయింపవలెనో రామస్వామిదీక్షితులవారు ఏర్పాటుచేసిరట. ఆయేర్పాటు ప్రకారమే యిప్పటికిని నడుచుచున్నది. శ్రీత్యాగరాజోత్సవసందర్భమునవచ్చిన అమరసింహమహారాజుచే వారిమీదచేసిన రాగమాలికను బాడి యనేక బహుమానగౌరవముల రామస్వామిదీక్షితులు పొందగలిగిరి.

రామస్వామిదీక్షితులవారికి 40 యేండ్లు వచ్చువరకు సంతతి లేదయ్యె. అందువలన వీరుభార్యాసమేతులై వైద్యనాథస్వామిగుడిలో శ్రీముద్దుకుమారస్వామిని భజింపగా వీరిభార్య సుబ్బమ్మ గర్భవతియయ్యెనట. పిమ్మట తిరువారూరులో శుభలగ్నమున మగశిశువును గనెను అతనికి ముద్దుస్వామియని భగవంతునిపేరు బెట్టిరి. అటుతరువాత మఱియిద్దరు మగశిశువులును, ఒక ఆడుబిడ్డయు బుట్టిరి. రెండవ కుమారుడైన చిన్నస్వామిదీక్షితులుకు వెంకవైద్యనాథశర్మయని గురువుగారిపేరు బెట్టిరి. ఆడుబిడ్డపేరు బాలాంబ. మూడవకుమారునిపేరు బాలస్వామి. వీరిలో జ్యేష్ఠుడైన ముద్దుస్వామిదీక్షితులు క్రిమాంతము

అధ్యయనము చేసి, వ్యాకరణశాస్త్రమును, కావ్యనాటకాలంకారము లనేగాక సంగీతమునుగూడ నభ్యసించినవాడయ్యె వీరితమ్ములును వయసుకుదగిన విద్యల నభ్యసించిరి.

మరికొంతకాలమునకు త్యాగరాజస్వామి దర్శనార్థము తిరువారూరువచ్చిన మణలి ముద్దుకృష్ణ మొదలారు అనుప్రభువు రామస్వామి దీక్షితులవారి మహిమను యోగ్యతనుదెలిసికొని వారిని సకుటుంబముగా దమయూరికి (మణలికి) బిలిచికొనిపోగా నచట కొన్నిసంవత్సరములు వారిచే నాదరింపబడియుండిరి. తరువాత ముద్దుకృష్ణ మొదలారు కుమారులును, రసికాగ్రేసరులును, ఔదార్యగుణోపేతులునైన చిన్నయా మొదలారుమీద రామస్వామిదీక్షితులు 108 రాగతాళమాలికనుజేసి పాడగా కనకాభిషేకము చేసెనట.

ఒకనాడు చిన్నయా మొదలారుగారి సభలో శ్రీ వెంకటమఖిగారి ప్రపౌత్రులు గోవిందదీక్షితులుగారిని వెంకటమఖిగారి చతుర్దండీ ప్రకాశిక మొదలైనగ్రంథములు జూడనిమ్మనియడుగ నేనిచ్చిన మూర్ఛన ఈరాగమనిచెప్తే ఇత్తుననని మొదలారితోచెప్పగా రామస్వామి దీక్షితులు మొదలారుచేసినట్లు 'నన్ను పరీక్షింపనేలా' యనుపదమును జేసి గోవింద దీక్షితులిచ్చిన మూర్ఛననుకనుపట నమర్చెనట. పిమ్మట తనకొమరులైన చిన్నస్వామి, బాలస్వాములచే బాడింపగా గోవింద దీక్షితులు ఇది మేమిచ్చినరాగమే వీరు మా వెంకటమఖి శిష్యులేయని చాలకొనియాడిరట.

రెండవకుమారుడైన చిన్నస్వామిదీక్షితులుకు కండ్లుకనబడకపోగా రామస్వామిదీక్షితులు చాలవిచారించి సకుటుంబముగా తిరుపతికేగి శ్రీవేంకటాచలపతిమీద 'మనసావేరి తరులదలచక' యను 48 రాగముల రాగమాలికను, 'ఇంకాదయరాకున్నను' అను వేగవాహిని రాగములో కీర్తనమునుజేసి భగవంతుని స్తుతిచేయగా చిన్నస్వామిదీక్షి

తునకు కండ్లువచ్చి ఆమరణాంతము సుఖముగానుండెనట. శ్రీరామ స్వామిదీక్షితులు ప్రతిఏకాదశియందును వ్రతముండి గీతగోవింద (అష్టపది) ద్వాదశసర్గమును దప్పక పారాయణజేయువాడట. శ్రీమధుర మీనాక్షిదేవిమీద నలుబదినాలుగు రాగముల రాగమాలిక నొకదానిని రచించెను. మఱియు రీతిగౌళ, హిందోళ, మనోహరి, పూర్ణచంద్రిక మొదలగురాగములలో చౌకవర్ణములను, శంకరాభరణ తానవర్ణమును, అనేకకీర్తనలను, 'వెంకటకృష్ణ' ముద్రతోరచించి వన్నెకెక్కిరి. మఱియు హంసధ్వనిరాగమును గల్పించి ప్రబంధమును రచించి చాలప్రసిద్ధిగాంచిరి. శ్రీరామస్వామిదీక్షితులు తన యవసానకాలమును దెలిసికొని క్రీస్తుశకము 1817లో శివరాత్రి పుణ్యకాలమందు పరమపదించిరి.

# సాహాజి మహారాజు.

ఇతడు తంజాపూరునేలిన ఏకోజిమహారాజపుత్రుడు. క్రీస్తుశకము 1684 మొదలు 1711 వరకు చోళమండలము నేలెను. ఈమహారాజు సంస్కృతాంధ్రమహారాష్ట్రహిందూస్థానీ మొదలగుభాషల గొప్పగానేర్చినవాడు. రాజులకుండవలసిన యుత్తమగుణములన్నియు కలిగియుండి సంగీతమం దతిసమర్థుడుగాన పైనజెప్పిన భాషలలో ననేకదేవతావిషయములైన రచనలజేసి ప్రఖ్యాతిగాంచెను. మఱియు తిరువారూరి శ్రీ వీధి విటంకత్యాగరాజస్వామిపై తెనుగున 'పల్లకి నాటకము' అను పల్లకి సేవాప్రబంధమును వాగ్గేయరూపమున రచించినవాడు. స్వామివారు పల్లకిలో వేంచేయునపుడు ఈమహారాజరచించిన పల్లకినాటకమును పాడుచు ఆడుచు పోవునట్లు ఏర్పాటుచేసియుండెను. అది యిప్పటికిని అట్లేనడచుచున్నది. ఈయుత్సవము నిరంతరము నిరాఘాటముగా నడిపించుటకీమహారాజు బహుమాన్యము లిచ్చియున్నాడు.

## వీణ పెరుమాళయ్య.

ఈయన ఒక గొప్పవిద్వాంసుడు. మహానుభావుడు. సంగీతమందు వీణ వాయిద్యమందును అసమాన పాండిత్యము గలవాడు. తెలుగుబ్రాహ్మణుడు. వీణ కాళహస్తి అయ్యావంశములోనివాడు అనగా నీవంశమువారందరును వైణికులే. ఇతడు ప్రసిద్ధ వాగ్గేయకారకులలో నొకడు. తంజాపూరి ఆస్థానపండితుడు. సర్వసమ్మానములందిన సాటి లేని గౌరవమునొందినవాడు. ఘనరాగతానములవాయించుటయందతి చతురుడట. రాత్రి రెండుయామముల చొప్పున పదిదినములు క్రమముగా భైరవిమొదలగు రక్తిరాగములవాయించి పూర్తిజేసేవాడట. ఉత్తరదేశాధిపతుల సభలలో నిటులనేవాయించి అమూల్యమైన బహుసన్మానముల నందెనట. ఒకప్రభు వితనికి రత్నఖచితవీణను సమర్పించెనట. కొత్తకోట సంస్థానాధిపతియైన రఘునాధ మహారాజావారిసభలో నొకరాగము 20 దినములు క్రమముగావాయించి ముగించగా నాప్రభువు 10000 రూపాయలనిచ్చి సమ్మానించెనట.

ఇతడు సౌరాష్ట్ర, సావేరిరాగములందు రెండు అటతాళవర్ణముల జేసియున్నాడు. ఆగేయకల్పనాచాతుర్య మసమానమై యసాధారణమై వెలయుచుండెను. ఇతడు ముద్దుస్వామి దీక్షితులవారికాలములో కొంతవరకుండెనట. ఈతని సోదరులిద్దరు, వీణ నారాయణసామయ్య కొండయ్య, నారాయణసామయ్యయు అన్నవంటి సమర్థుడే నట. కొండయ్యయనునతడు సావేరి రాగములో నొకస్వరజతి చేసియున్నాడు.

## గోవింద సామయ్య.

ఇతనియునికి కార్వేటినగరము త్రిలింగబ్రాహ్మణుడు. సంగీతాంధ్రములందు గొప్పపాండిత్య ప్రతిభగలవాడు. కార్వేటినగర సంస్థాన

విద్వాంసుడు. ఇతడు తెనుగున శృంగారరస ప్రధానములై వల్లిబిల్లిగ నుండుపదముల ననేకములు రచించిఖ్యాతిగాంచెను. కార్వేటినగర సంస్థానాధిపతులమీద జేసిన మోహనరాగములోని వర్ణమును, దేవతాపరముగ జేసిన నవరోజు, కేదారగౌళ రాగములలోని వర్ణములును మిక్కిలి ప్రసిద్ధములై వెలయుచున్నవి. ఇతడుఆది యప్పయ్యకు ప్రాక్కుడని తెలియుచున్నది.

# కూవన స్వామయ్య.

ఇతడు గోవింద సామయ్యసోదరుడని చెప్పుదురు సంగీతమందును, తెనుగునందును గడుసమర్థుడు. ఇతడు నాటకురంజిరాగములో రచించిన తానవర్ణము మిక్కిలి ప్రఖ్యాతముగా నున్నది.

# చిన్నస్వామి దీక్షితులు.

ఇతడు రామస్వామి దీక్షితులవారి రెండవకుమారుడు. ముద్దుస్వామి దీక్షితులవారి తమ్ముడు. ఆంధ్రగీర్వాణములందతి సమర్థుడు. సంగీతవిద్యావిశారదుడు. వైణిక శ్రేష్ఠుడేగాక గాయకోత్తముడు. రాజసభలయందు గొప్పసన్మానములబొందిన యశోవిశాలి. ఇతడు తిరువారూరులో సకుటుంబముగా నుండెడివాడు. ఒకప్పుడు ప్రభువులసభలో నొకరాత్రి 'నాగవరాళి' రాగము నాలాపించి వీణ వాయించుచుండగా నతనియెదుట నొకపెద్దసర్పము ఇటికప్పునుండిపడి పడగవిప్పి యాడుచుండెనట. అప్పుడు సభికులు భయపడవలదని హెచ్చరించి వీణ నాపకవాయించగా నాపాము క్రమేపి ఆడియాడి యలసిపడగను భూమికి జేర్చగా తాను వీణనుక్రిందబెట్టి యందఱిని నమస్కరింపుడనిజెప్పి తానునునమస్కరింపగా వెంటనే సర్పము వెడలిపోయెనట.

చిన్నస్వామి దీక్షితులవారు నారదమునిమీద తోడిరాగములో 'గానలోల కరుణాలవాల' అనుకీర్తనయును, కల్యాణిరాగములో 'నారా

యణానంత' అనుకీర్తనమును-రెండుకీర్తనల రచించెను. ఇతడు మధురలో తమ్ముడైన బాలస్వామిదీక్షితులతోనుండగా 45 ఏండ్ల వయస్సున లోకాంతర గతుడయ్యెను.

## బాలస్వామి దీక్షితులు.

ఇతడు చిన్నస్వామిదీక్షితుల తమ్ముడు. రామస్వామిదీక్షితుల మూడవకుమారుడు. క్రీస్తుశకము 1786లో జన్మించెను ఇతనిపేరు బాలకృష్ణశర్మ. తెనుగునందు మంచిపండితుడు. సంగీతములో అసాధారణ ప్రజ్ఞావంతుడు. వీణ, ఫిడేలు సితార్, స్వరబత్తు, మృదంగము మొదలగు వాద్యములు వాయించుటయందతిచతురుడు. సంగీత లక్ష్యలక్షణముల సర్వమర్మముల బాగుగనేర్చిన మహానుభావుడు చిన్నయామొదలారు వారితనికి ఒక ఆంగ్లేయపండితునిచే ఫిడేలువాద్యమును చిన్నతనమందు నేర్పించిరి. ఇతడు మూడుసంవత్సరము లభ్యసించి హిందూ, ఆంగ్లేయసంగీతములను ఫిడేలుమీద బాగుగా వాయించి మెప్పునొందెను. ఒకప్పుడు సొంటి వెంకటరమణయ్యగారు చిన్నయామొదలారు వారి సభలో 'టక్కా' రాగములో గీతతానములు వాయించి ఈరాగము మాయింటి సొమ్మనిచెప్పగా బాలస్వామి దీక్షితులు టక్కా రాగగీతమును నేనిదే వాయించెదనని చెప్పివాయించి చూపగా మొదలారు మెచ్చుకొని ఒకముత్యాల కంఠమాలయును జోడుశాలువలును ఇచ్చి బహూకరించెనట. బాలస్వామిదీక్షితులు చాలకాలము తిరువారూరిలోనుండి పిమ్మట తన యన్నయైన చిన్నస్వామి దీక్షితులతోడను, తనశిష్యుడైన హరితోడను మధురకేగెను అచ్చట కొంతకాలముండి అన్నయైన చిన్నస్వామిదీక్షితులు అచట పరమపదించగా శిష్యుని వెంటబెట్టుకొని సేతుక్షేత్రమునకుబోయి యటనుండి ఎట్టయపురమునుజేరి మహారాజును సందర్శించెనట. అపటికి ఫిడేలుఅపూర్వవాద్యమైయుండెను. ఆఫిడేలు వాద్యమువాయించి రాజును మెప్పించెను.

మహారాజు బహుసమ్మానించి సంగీతశాస్త్రమందును, వీణ, ఫిడేలు వాద్యము లందును బాలస్వామిదీక్షితుల సామర్థ్యమును దెలిసి తన యాస్థానపండితునిగా నియమించి గృహదానముచేసి రెండవవివాహము చేసి యాదరించెనట. అప్పటి మహారాజుకుమారుడైన కుమార ఎట్టప్ప మహారాజునకు గురువై సంగీతలక్ష్యలక్షణముల నెఱింగించి పండితుని గావించెను. కుమారఎట్టప్ప మహారాజు పట్టాభిషిక్తులైన పిమ్మట సంస్కృతమున అనేకకీర్తనముల ననేకరాగములలో రచింపగా నీకీర్తనల కన్నిటికిని బహుచమత్కారముగా కల్పనలుగల ముక్తాయిస్వరముల బాలస్వామిదీక్షితులే రచించి మహారాజు మెప్పుపొందెను. మఱియు బాలస్వామిదీక్షితులు శ్రీ గృధ్రాచల కార్తికేయస్వామి వారిమీద సారంగ, దర్బారు, కన్నడ, రుద్రప్రియరాగములలో తెనుగున కీర్తనలజేసెను. మఱియు నితడు కుమారఎట్టప్ప రాజేంద్రునిమీద నాటరాగములో బహుచమత్కారములతో గూడి కల్పనలతో అటతాళవర్ణమునురచించి శిష్యులచేపాడించి వినిపింపగా నామహారాజు వెయ్యివరహాలవిలువగల కెంపులతో జెక్కబడిన సింహతలాటములు గల జోడుతోడాలు రెండుచేతులకుదొడిగి జోడుశాలులిచ్చి బాలస్వామిదీక్షితులను బహూకరించుటయేగాక వర్ణముపాడిన శిష్యులకు బహుమానములిచ్చి గౌరవించెనట. ఈమహారాజుకు పిమ్మటనతని సోదరుడైన వెంకటేశ్వర ఎట్టప్ప మహారాజు పట్టాభిషిక్తుడయ్యె. ఇతడును బాలస్వామి దీక్షితులవద్ద సంగీతవిద్యనభ్యసించి పండితుడయ్యె. ఈ మహారాజు మీద బాలస్వామిదీక్షితులు, రుద్రప్రియ, దర్బారు, వసంత రాగములలో దరువులనుజేసి పాడివినిపించగా మహారాజు దశవరహాకటికి వెయ్యొసి వరహాలును జోడుశాలునలుచొప్పున నిచ్చి గౌరవించి పోషించెను. బాలస్వామిదీక్షితులు పరమభాగవతోత్తములు. ప్రతిఏకాదశియందు నుపవసించి గీతగోవింద (అష్టపదులు) ముపాడి భగవంతుని భజించు

చుండెడివాడు. ఈమహానుభావుడు 1859 (క్రీస్తుశకము)లో నొకపుణ్య దినమున పరలోకగతుడయ్యెను.

# దొర సామయ్య.

ఇతడు ఉత్తరదేశ ద్రావిడవిప్రుడు. సంగీతాంధ్రములయం దతి సమర్థుడు ఇతడు 'సుబ్రహ్మణ్య' ముద్రతో తెనుగున ననేకకీర్తనముల రచించి ప్రఖ్యాతినొందెను. ఇతనికీర్తనములు సులభశైలికలిగి రంజక ములైనవి. ఇతడు శరభోజి మహారాజు కాలమందును, శివాజిమహారా జు కాలములో కొంతవరకునుండె. ఇతని నివాసము పంచనదక్షేత్రము.

# కులశేఖర మహారాజు.

ఈమహారాజు కేరళదేశము నేలినవారిలో నొకడు. ఈదేశము నకు తిరువనంతపురము ముఖ్యపట్టణము. ఇతడు ఇంగ్లీషు, తెనుగు సం స్కృతము, కేరళము, హిందూస్థానీ మొదలగు అనేక భాషలనేర్చిన విద్యావంతుడు. సంగీతవిద్యావిశారదుడు. ఇతడు వాగ్గేయకారక శ్రేష్ఠులలో నొకడు. సంస్కృతసాహిత్యముతో ననేక దేశీయ రక్తిరా గములలో గేయకల్పనాచాతుర్యము విలసిల్లునట్టి చౌకవర్ణములును, అసంఖ్యాకములైన కీర్తనములనురచించి విశేషకీర్తినొందెను ఇతని ముద్ర 'పద్మనాభ'ముద్ర తెనుగున చౌకవర్ణములు పదములు ననేక ములు రచించె. కేరళమం దనేకకీర్తనములు రచించెను. ఇతడు మహా నుభావుడు. పరమ భాగవతోత్తముడు. శ్రీ పద్మనాభపాదారవింద ధ్యాననిష్ఠాగరిష్ఠుడు.

# వెంగుభాగవతులు.

ద్రావిడబ్రాహ్మణుడు. నివాసస్థానము తిరునల్వేలి. సంగీతమం దును, ఆంధ్రమందును మంచిపండితుడు. ఇత డనేకదరువులు, కృతులు, తానవర్ణములురచించి ప్రఖ్యాతిగాంచెను. ఇతడు గొప్పభక్తుడు.

## శేషాచలంభాగవతులు.

ఇతడు కొత్తకోట సంస్థాన సంగీతవిద్వాంసుడు. శ్యామశాస్త్రిలవారి శిష్యుడు. ఇతడు తెలుగులో ననేక కృతులు చేసి ఖ్యాతినొందినవాడు.

ఇతని సోదరుడైన రామదాసులు సంగీతసాహిత్యములందతిసమర్థుడు, ఇతడు 'రామ' ముద్రతో తెనుగున ననేకకీర్తనములు రచించి కీర్తిగాంచెను. ఇతనిపుత్రుడు మాతృభూతయ్య ఇతడును గాయకశ్రేష్ఠుడే. ఇతనికుమారుడు గోపాలస్వామిఅయ్య. ఇతడు గొప్ప సంగీతవిద్వాంసుడు. సంగీతలక్ష్యలక్షణమర్మముల నెఱిగిన మహానుభావుడు. ఇతడును కొత్తకోట ఆస్థాన సంగీతవిద్వాంసుడుగా నుండెను.

## యువరంగునిపదములు.

ఉడయార్పాళయ సంస్థానాధిపతియు, వితరణశీలుడు, రసికాగ్రేసరుడునైన యువరంగేంద్రునిమీద తెనుగున కొందరు వాగ్గేయకారకులు చేసినరమ్యమై గేయకల్పనాచమత్కృతులు గలిగి విలసిల్లు పదములు అనేకములు గలవు ఆపదములకు యువరంగుని పదములని పేరు.

## పరిమళరంగుడు.

ఇతడు సుమారు 250 సంవత్సరములకు పూర్వుడు. సంగీతమందును తెలుగునందును పండితుడు. గేయకల్పనాచాతుర్యము శోభిల్లునట్లును, ప్రాసయమకములతో విలసిల్లునట్లును అనేకపదముల రచించి యితడు యశముగాంచెను.

## సారంగపాణి.

ఇతడు ఉత్తరదేశనివాసి, తెనుగుబ్రాహ్మణుడు, ఇతడును 200 సంవత్సరములకు పూర్వపువాడె. సంగీతమందు ప్రౌఢుడు. తెనుగున శృంగార, హాస్యరసప్రధానములైన పదములననేకముల 'వేణుగోపాల ముద్రతో' రచించి ఖ్యాతిగాంచెను.

## ఘనం సీనయ్య.

ఇతడు వైష్ణవకులజుడైన శేషయజ్వకుమారుడు, ఆత్రేయస గోత్రోద్భవుడు, ఆపస్తంభసూత్రుడు, సంగీతాంధ్ర గీర్వాణములందు సమాన ప్రజ్ఞాధురీణుడు, శ్రీవిజయరంగ చొక్కనాథభూపాలుని కృపాకటాక్షముచే సంపదైభవమును బొందినవాడై యాతనికి మంత్రిశేఖరుడై విలసిల్లె. శశాంకవిజయమను ప్రబంధమును రచించి భూపాలునికి కృతియొసర్చె. ఇతడు మన్నారు రంగముద్రతో ననేక కీర్తనములను పదములను రచించి చిరస్థాయియయ్యెను. ఇతడు క్షేత్రయకు సమకాలికుడై యుండవచ్చును.

## మార్గదర్శి శేషయ్యంగారు.

ఇతడు వైష్ణవబ్రాహ్మణుడు. సంస్కృతమందును సంగీతమందును గొప్పపాండిత్యము గలవాడు. ఇతడు రంగనాథునిభక్తుడు, చాలకాలము అయోధ్యలో నివసించి పిమ్మట అచటనుండి శ్రీరంగమునకువచ్చి రంగనాథునిపై సంస్కృతములో ననేకకీర్తనములచేసి భజించుకొనుచునుండెడివాడట. ఇతడురచించిన కీర్తనల పుస్తకమును పూజారిద్వారా రంగనాథునికి సమర్పింపగా మరునాడు చూచుకొనగా నాగ్రంథమందు అరువది (60) కీర్తనములు మాత్రమే స్పష్టముగానుండి తక్కినవి చెదలితినినట్లయ్యెనట, అనగా నీయరువదికీర్తనములే భగవంతునిచే శుద్ధముగా నంగీకరింపబడినవి. ఇవి ఇప్పటికిని ప్రసిద్ధిగానున్నవి. సంస్కృతమున వాగ్గేయకారకుడై సంగీతలోకమున కప్పటికి మార్గదర్శియయ్యెగాన మార్గదర్శి శేషయ్యంగారని పిలువబడెను.

## వీరభద్రయ్య.

ఇతడు త్రిలింగబ్రాహ్మణుడు. సంగీతసాహిత్యములందసమాన పాండిత్యప్రతిభగలవాడు. తెనుగునందు గొప్ప ప్రజ్ఞగలవాడు. ఉత్తర

దేశము నివాసవాసస్థానము. ఇతనికాలమున తంజాపురిని రాజధాని గాజేసికొని చోళమండలమును ధర్మస్వరూపుడును, రసికాగ్రేసరుడును, వితరణశాలియు, దేవబ్రాహ్మణభక్తి తత్పరుడును అయిన ప్రతాపసింహమహారాజు పాలించుచుండెను. ఈమహారాజుయొక్క సుగుణసంపత్తినివిని వీరభద్రయ్యగారు వారిదర్శనలాభముకొరకు వేచియుండగా ప్రతాపసింహుడే యీవిద్వాంసుని గొప్పతనమును విని స్వయముగా పోయి వీరభద్రయ్య గానామృతమును గ్రోలి బహూకరించెనట. పిమ్మట వీరభద్రయ్యను వెంటబెట్టుకొని తంజావూరునకు వచ్చి యాతనికి గృహదానముచేసి యాస్థానవిద్వాంసునిగా జేసికొనెను వీరభద్రయ్య ప్రసిద్ధవాగ్గేయ కారకుడు. ఇతడు మహారాజులకు కులదైవమైన ప్రతాపరామునిమీదప్రతాపరామముద్రతో ననేక కీర్తనముల ననేకరక్తిరాగములతో, దేశీయాపూర్వరాగములలోను రచించి కీర్తిగాంచెను. ఇంతేగాక ప్రతాపసింహమహారాజుమీద ననేకదరు, పద, తిల్లానాలను గేయచమత్కృతులు వెలయరచించి గొప్పకీర్తిని బొందెను. ఇతడు దక్షిణదేశ సంగీతమునకు సుమార్గమును పరిష్కరించి చిరకీర్తినొందినవాడయ్యె.

# కవిమాతృభూతయ్య.

ఇతడు త్రిలింగబ్రాహ్మణుడు. ఇతర నివాసస్థానము త్రిశిరగిరి. (ఇప్పటితిరుచునాపల్లి). ఇతడు శ్రీకుంతలాంబాభక్తుడు, శ్రీకుంతలాంబాకటాక్షముచే నితడనేక నీతితోగూడిన, భక్తిరసముతోగూడిన కీర్తనములను జేసినవాడు. శృంగారరసప్రధానములయిన యనేకపదములను, గాంధర్వశైలిగా పారిజాతాపహరణ మను నాటకమును రచించి కీర్తిపొందెను. ఇతనిముద్ర 'త్రిశిరగిరి' ముద్ర. ఈతని రచనలన్నియు రసపుష్టి యర్థపుష్టిగలిగి పదశయ్యావ్యవహారములు గలిగియున్నవి.

ఈకవి మాతృభూతయ్య బహుబీదవాడగుటచే తనయిష్టదేవతయగు శ్రీసుగంధి కుంతలాంబను అనేకకీర్తనములద్వారా పేదతికమును బాపుమని వేడుకొనగా 'కాశికప్పణమీవలనమ్మ' యను కీర్తనమునకు పరదేవత మెచ్చుకొని స్వప్నమున గనబడి తంజావూరు నేలు ప్రతాపసింహుడు తనభక్తుడనియు అతనిని సందర్శించిన తనలేమిపోవుననియు జెప్పెనట. ఆనాడే ప్రతాపసింహునికిగూడ స్వప్నములో గనబడి కవిమాతృభూతయ్య తనభక్తుడనియు యతడు నీదర్శనమునకు రాగలడు వానిలేమి దీర్చుమనియు జెప్పెనట, అంతప్రతాపసింహుడు కవిమాతృభూతయ్యరాగా 10000 రూపాయలిచ్చి మిగుల గౌరవించి త్రిశిరగిరికి బంపగా మాతృభూతయ్యవచ్చి శ్రీకుంతలాంబను భజించుచు కొనుచు సుఖముగా కాలముగడపుకొనెను.

## మెరటూరి వెంకటరామశాస్త్రులు.

ఇతని నివాసస్థలము తంజావూరికి సమీపముననున్న మెరటూరుగ్రామము. త్రిలింగబ్రాహ్మణుడు. శరభోజిమహారాజకాలమందుండెడివాడు. తెనుగునం దసాధారణ పాండిత్యముగలవాడు. ఇతడు శృంగారరసప్రధానములైన ననేకపదములు రచించి కీర్తివడసెను.

## ముత్తు తాండవరు.

ఇతడు అరుణాచల కవిరాయరుకు పూర్వికుడు. సంగీతమందును ద్రావిడభాషయందును గడుసమర్థుడు. గొప్పశివభక్తుడు. ఇతడు భక్తిరసముతో గూడిన అనేకకీర్తనలను శృంగారరసముతో గూడిన పెక్కుపదములను జేసి ప్రఖ్యాతినొందెను.

## ఘనం కృష్ణయ్య.

ఈవిప్రోత్తముడు ద్రావిడభాషయందును సంగీతమందును గొప్పపండితుడు త్యాగరాజయ్య కాలమువాడు. ఉడయార్పాళె మితని

నివాసస్థానము, ఉడయార్పాళెసంస్థానాధిపతిమీద ననేక శృంగార రసప్రధానములైన పదములును, ఇంకా యితరపదములను జేసిన వాడు.

## శంకరాభరణం నరసయ్య.

ఇతడు శరభోజిమహారాజు కాలమునాటి బ్రాహ్మణోత్తముడు. సంగీతసాహిత్యములందుఁ గడుసమర్థుడు. శంకరభరణా రాగ మితని సొమ్మట. ఇతడు ద్రావిడభాషలో రచించిన గేయకల్పనావిశేషములతో విలసిల్లు కొన్నిపదములు గలవు.

## వైదీశ్వరునికుడి సుబ్బరామయ్య.

ఈభూసురశ్రేష్ఠుడు ద్రావిడభాషయందును సంగీతమందును గొప్ప ప్రజ్ఞావంతుడు. శ్రీ 'ముద్దుకొమరుని' ముద్రతో శృంగారరస ప్రధానములైన ననేకపదముల రచించి కీర్తిగొందెను.

## ఎట్టయపుర మహారాజులు.

ఈఎట్టయపురము నేలిన మహారాజులందరును గొప్పవిద్వాంసులును, రసికాగ్రేసరులును, దానశీలురును, గానకళాపోషకులేగాక సాధారణ విద్యాపోషకులును అయియుండిరి. ఈమహారాజులు రాజశబ్దమునకెతమో వన్నెదెచ్చినవారై సార్థకనామధేయులై సభా సప్తాంగలక్షణమనుమాట బీరుపోనీక యనేకమంది కవులను, గాయకులను ఆదరించి పోషించి యశముగాంచిరి.

అంతేగాక వారందరును పరమభాగవతోత్తములై భగవంతుని సదా భజించుచు ననేకగేయరూపములైన రచనల రచించి ఖ్యాతి గాంచిరి.

అట్టివారు :—

1. వెంకటేశ్వర ఎట్టప్పమహారాజు.
2. జగదీశ్వరరామకుమార ఎట్టప్పమహారాజు.
3. జగదీశ్వర రామవెంకటేశ్వర ఎట్టప్పమహారాజు.
4. ముద్దుస్వామి ఎట్టప్పమహారాజు.
5. రాజ జగదీశ్వర రామకుమారఎట్టప్పమహారాజు.
6 రాజజగదీశ్వర రామవెంకటేశ్వర ఎట్టప్పమహారాజు.

# పల్లవి గోపాలయ్య.

ఈద్రావిడ బ్రాహ్మణుని నివాసస్థానము తంజాపూరు. ఇతడు సంగీతాంధ్ర గీర్వాణములం దతిసమర్థుఁడు. పల్లవి పాడుటలోనే విద్వాంసుఁ డితనికి సాటికాడట, అందుచే నీతనికి పల్లవి గోపాలయ్య యని పేరువచ్చినది. 'వనజాక్షి' అనుకళ్యాణి అటతాళవర్ణమును రచించిప్రసిద్ధిగాంచిన మహానుభావుడితఁడే, మఱియు కాంభోజిరాగమందును, తోడిరాగములోను అటతాళవర్ణముల రచించిన మేటి, ఇంతేగాక "వెంకట"అను ముద్రతో ననేకకీర్తనలఁజేసి ఖ్యాతినొందెను.

ఈపల్లవి గోపాలయ్య అను మహానుభావుఁడు అమరసింహ మహారాజుకాలములోను శరభోజి మహారాజుకాలములో చాలవరకునుండి గొప్పకీర్తి గౌరవములనొందెను.

# ప్రతాపసింహ మహారాజు.

తంజావూరునేలిన అమరసింహమహారాజుపుత్రుడు ప్రతాపసింహమహారాజు. వీరు సంస్కృత, మహారాష్ట్రభాషలం దసమానపాండిత్యముగలవాడు. సంగీతమందు గడుసమర్థుఁడు. మృదంగవాద్యమం దతినిపుణుడు వీరు మహారాష్ట్రభాషలో నవరత్నమాలిక యనురాగతాళమాలికయొకటి స్వరచమత్కృతులు విలసిల్లఁజేసియున్నారు. ఇతడు శివాజిమహారాజుకు పూర్వీకుడు.

# సుబ్బరాయశాస్త్రి.

శ్రీ శ్యామశాస్త్రులవారి కిద్దరు కుమారులుగలరు. వారిలో రెండవకుమారుడు శ్రీ సుబ్బరాయశాస్త్రి. వీరు క్రీస్తుశకము 1803లో జన్మించిరి. వీరును తమతండ్రివలెనే పరదేవతా కటాక్ష లబ్ధులై సంగీతాంధ్ర గీర్వాణములం దతిసమర్థులై ఆంధ్రమున సుప్రసిద్ధవాగ్గేయకారకులై చిరకీర్తి నొందెను. వీరు రచించిన యనేక స్వరజతులు, కీర్తనలు సుప్రసిద్ధములై వాడుకలోనున్నవి. క్రీస్తుశకము 1862లో శ్రీసుబ్బరాయశాస్త్రులవారు అంబాకటాక్షముచే మణిపురముజేరిరి.

# ఆంధ్రమున శృంగారరస ప్రధానమైన పదము రచించిన కవులు.

1. వేణంగివారు—వేణంగిముద్ర.
2. బొల్లపురమువారు—బొల్లపురముముద్ర.
3. ఘటపల్లివారు—కైలాసపతిముద్ర.
4. జటపల్లివారు—జటపల్లి గోపాలముద్ర.
5. శోభనగిరివారు—శోభనగిరిముద్ర.
6. ఇనుకొండవారు—ఇనుకొండ విజయరామముద్ర.
7. మల్లికార్జునుడు—మల్లికార్జునముద్ర.
8. శివరామపురమువారు—శివరామపురము రామపురిముద్ర.

# తోడి సీతారామయ్య

తోడిరాగముపాడుట వీరిసామర్థ్యమట. వీరు శరభోజిమహారాజుగారికాలమున ప్రారంభమందుండెడి వారని చెప్పుదురు. ఈసీతారామయ్యగారు తోడిరాగమును కుదువబెట్టి వర్తకుని రూపాయలు దీసికొని ఖర్చుపెట్టుకొనువాడట. ఈతని తోడిరాగమును వినుట కభిలాషపడిన రాజులు, ప్రభువులు కుదువబెట్టిన తోడిరాగమును వర్తకుతో సహా దీర్చి విడిపించి తోడిస్వతంత్రిప్పియిచ్చి పాడుమని సమ్మానించేవారట. ఈయన రచించి కొన్ని గేయకల్పనల సాహిత్యములుగలవని చెప్పుదురు.

# తచ్చూరు సింగరాచార్యులు.

ఈతడు ఆంధ్రుడు. వైష్ణవకులజుడు. శ్రీ శ్యామశాస్త్రిులవారి కుమారులైన సుబ్బరాయశాస్త్రిులవారి శిష్యుడు. సంగీతాంధ్ర గీర్వాణములం దసమానపాండిత్యముగల మహానుభావుడు. ఫిడేలువాద్యములో నతిసమర్థుడు. సంస్కృతములో ననేకకీర్తనముల రచించెను. ఇతని తమ్ముడైన చినసింగరాచార్యులును ఫిడేలువాద్యమం దతిసమర్థుడు. వీ రుభయులునుగలసి బహుజనోపయుక్తమగునటుల సంగీతలక్ష్య లక్షణములును, పెద్దలచేరచింపబడిన యనేక గీత, వర్ణ, పద, కీర్తనములును, వెలయునట్లు 1. స్వరమంజరి 2 గాయకపారిజాతము 3. సంగీతకళానిధి 4. గాయకలోచనము 5. గాయకసిద్ధాంజనములను నీదైనదుగ్రంథములరచించి ప్రచురించి కీర్తిగాంచిరి.

# మైసూరు సదాశివరావు.

వీరు మైసూరుసంస్థాన విద్వాంసులు. మహారాష్ట్రబ్రాహ్మణులు. ఆంధ్రగీర్వాణములందును, సంగీతశాస్త్రమందును గొప్పపండితులు. వీరు సుప్రసిద్ధములై వెలయుచున్న యనేకకీర్తనలు, వర్ణములు, తిల్లానాలు, రచించి కీర్తిగాంచిరి.

# పట్నం సుబ్రహ్మణ్యయ్యరు.

ఈతడు ద్రావిడబ్రాహ్మణుడు. గొప్పభక్తుడు. సంగీతాంధ్రములలో గడుసమర్థుడు ఇతడు తెనుగున యనేకకీర్తనములచేసి సంగీతలోకమున కెంతయు మేలుచేసి చిరస్థాయియైయున్నాడు. వీరిముద్ర 'శ్రీవేంకటేశ'

# వీణ కుప్పయ్యరు

వీరి నివాసస్థానము తిరువత్తూరు. వీరు త్యాగరాజుగారి శిష్యులు. గొప్పభక్తులు. గాయకశిఖామణి. వైణికశ్రేష్ఠులు. వీరు తెనుగున యనేక తానవర్ణములను, కీర్తనములను రచించి ప్రసిద్ధిజెందిన మహానుభావులు. వీరు తమకుమారునికి 'త్యాగయ్య'యను తమగురువుగారి పేరుపెట్టిరి. ఇందువలన వీరిగురుభక్తి వెల్లడియగుచున్నది. ఈ త్యాగయ్య

సంగీతాంధ్రములందు విశేషప్రతిభగలవాడై కొన్ని తానవర్ణములను, కీర్తనములను రచించెను. అంతేగాక ఇతడు 'పల్లవి స్వరకల్పవల్లి' యనుగ్రంథమునురచించి యచ్చొత్తించి కీర్తినొందెను.

# స్వాతి తిరునాల్ మహారాజు.

తిరువాన్కూరుసేలిన రాజులలో వీరొకరు. ఈమహారాజు 1813 (క్రీస్తుశకము)లో జన్మించెను. ఇతడు ఆరుభాషలలో ప్రవీణుడు. గొప్ప విద్యాపోషకుడు. రసికాగ్రేసరుడు. సంగీతములో గొప్ప ప్రవీణుడు. ఇతడు సంస్కృతాంధ్రములందును, అరవములోను మహారాష్ట్రభాషలోను, హిందూస్థానీలోను బెక్కుకీర్తనలను, వర్ణములను, తిల్లానాలను రచించి సంగీతలోకమున కెంతయో వన్నెదెచ్చి కీర్తినొందెను. మఱియు మళయాళీ తెలుగుభాషలందు ఒకమణిప్రవాళము రచించి ఘనతవహించెను. ఇతడు క్రీస్తుశకము 1822 మొదలు 1847 వరకు రాజ్యమేలి ఘనతవహించి యుండినట్లు తెలియుచున్నది.

# పల్లవి శేషయ్యరు.

ఇతడు మురికినాటి బ్రాహ్మణుడు. ఆంధ్రుడు. ఇతనితండ్రి త్యాగరాజశిష్యుడు. శేషయ్యరుసంగీతాంధ్రములందు బహుసమర్థుడు. పల్లవిపాడుటయందు దద్భుతశక్తిగలవాడు గావున పల్లవి శేషయ్యరు అని పేరువచ్చినది. ఇతడు మంచివాగ్గేయకారకుడు. ఇత డాంధ్రమున అనేక కీర్తనలు, పదవర్ణములు, తిల్లానాలు రచించి కీర్తివడసెను. ఇతనిముద్ర యిశనిపేరే.

ఒకప్పు డితడు రాత్రి 10 గంటలకు సావేరి రాగాలాపనజేసి ప్రారంభించి పల్లవిపాడి ముగించుసరికి తెల్లవారినదట. ఇతడు ధన్యాసి రాగములో 'భూమినివెలయుసోమకుల వరశేషని మనవివినవిని కామితార్థములిచ్చి కావ్రమికె' అనుతిల్లానాను ఒక్కరోజులో రచించెనట. భైరవిలోని 'ఇక నను బ్రోవకున్న' అనుకీర్తనము, కేదారలోని 'నీవే నాజీవమని' అనుకీర్తనయు ఇతడు రచించినవే.

# గర్భపురివారు-ధర్మపురివారు.

ఈగర్భపురి, ధర్మపురివారలు శృంగారరసప్రధానములైన అనేక జావళులురచించి మహోపకారము చేసిరి.

# సుబ్బరామదీక్షితులు.

ఇతడు రామస్వామిదీక్షితులవారి తృతీయపుత్రుడైన బాలస్వామిదీక్షితులవారి కుమార్తెకు ద్వితీయపుత్రుడు. బాలస్వామిదీక్షితులవారికి పుత్రులులేరు. అప్పటి ఎట్టయపురంమహారాజు నాజ్ఞచొప్పున బాలస్వామిదీక్షితులు దౌహిత్రుడైన సుబ్బరామదీక్షితుని దత్తతచేసికొని పుత్రునిగా స్వీకరించి సంగీతాంధ్రగీర్వాణములందు గొప్పవిద్వాంసునిగా జేసె. సంగీతశాస్త్రలక్షణ మర్మములనెల్ల బాలస్వామిదీక్షితులవల్ల దెలిసికొని ఇతడు 17 వ యేట (శ్రీ) కార్తికేయస్వామిమీద దర్బారురాగములో అటతాళవర్ణమురచించి మహారాజైన జగద్వీరరామ కుమారఎట్టప్ప మహారాజుసభలో పాడి వినిపించెను. కానికొందరు ఇతని సమర్థతను శంకించుటచే మహారాజది కనిపెట్టి ఒకగంటలో స్వామిపోయి వచ్చెద ఇచటనేయుండి యమునారాగములో జతిస్వరమును పల్లవి, అనుపల్లవి, చరణ, ఎడుకస్వరయుక్తముగా రచియుమని యాజ్ఞాపించపోగా సుబ్బరామదీక్షితులు అట్లనే ఒకగంటలోపుగానే రచించి మహారాజు తిరిగిరాగానే సభలోపాడి వినిపించి మెప్పుపొందిరి. అటుపిమ్మట కొంత కాలమునకు ముద్దుస్వామి జగద్వీరరామఎట్టప్పమహారాజు ఆజ్ఞ చొప్పున వారికి [illegible] ఆనంద భైరవి, సురటిరాగములలో [illegible] రాగములుగల ఒకరాగమాలికనురచించి [illegible] సుబ్బరామదీక్షితులు (శ్రీ) [illegible] లబ్ధులుగాన ఎట్టయపురసంస్థాన ఆస్థానసంగీతవిద్వాంసులుగ [illegible] సమ్మానము లొందుచుండగా (శ్రీ) [illegible] సర్వశాస్త్రీకకు సమన్వయించునటుల సంగీతశాస్త్రమర్మములు [illegible] సంగీతసంప్రదాయ ప్రదర్శినియను గొప్పగ్రంథమును తెనుగున రచించి గాంధర్వలోకమునకు మహోపకారము గావించి శాశ్వతకీర్తి నొందిరి.

సమాప్తము.